భగవాన్ వేదవ్యాస మహర్షి రచించిన

# శ్రీ గరుడ పురాణం






జిల్లెళ్ళమూడి అమ్మ

మాతృశ్రీ అనసూయాదేవి ఆశీస్సులతో...

వచనం : డాక్టర్ జయంతి చక్రవర్తి

ఎం.ఏ., ఎం.ఫిల్., పిహెచ్.డి.,


ప్రచురణ



శ్రీ బాలాజీ పబ్లికేషన్స్

28-25-32/1, అరండల్‌పేట, ఏలూరురోడ్, విజయవాడ-2

సెల్ : 9441176276 / 9966675815

# శ్రీ గరుడ పురాణం


| | | |
|---|---|---|
| వచనం | : | డాక్టర్ **జయంతి చక్రవర్తి**<br>విజయవాడ. 9390526272 |
| కాపీరైట్ | : | పబ్లిషర్స్ |
| ప్రథమ ముద్రణ | : | 2014 |
| ముఖచిత్రం | : | రమణ |
| డి.టి.పి. &<br>పేజి లే-అవుట్ | : | విద్యార్థి క్రియేషన్స్<br>విజయవాడ |
| ముద్రణ | : | శ్రీ స్వామి ఆఫ్‌సెట్ ప్రింటర్స్<br>విజయవాడ-3 |
| ప్రచురణ | : | **శ్రీ బాలాజీ పబ్లికేషన్స్**<br>నసురుల్లాఖాన్ వీధి<br>అరండల్‌పేట, విజయవాడ |
| వెల | : | ₹. 60 /- |




ఆర్షవిజ్ఞాన భాండాగారాలైన అష్టాదశ పురాణాలని ఆంధ్రజాతికి అందించిన శ్రీ వేంకటేశ్వర ఆర్షభారతి ట్రస్ట్ వారికి, ఆ పురాణాలను అనువదించిన మహారచయితలకి సహస్రాధిక ప్రణామాలు సమర్పిస్తున్నాం.

# భగవాన్ వేదవ్యాస మహర్షి

## వ్యాసగుహ, సరస్వతీ తీరం, బదరీనాథ్



*అచతుర్వదనో బ్రహ్మా ద్విబాహురపరో హరిః ।*
*అఫాలలోచనః శంభుర్భగవాన్ బాదరాయణః ॥*

## కృతజ్ఞతలు

అష్టాదశ పురాణాలని సామాన్య జనానికి అందించాలని సంకల్పించిన శ్రీ బాలాజీ పబ్లికేషన్స్ అధినేత **శ్రీ పుట్టగుంట వీరయ్యచౌదరి (బోస్) గారికి** ముందుగా ప్రత్యేక కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

ఈ గ్రంథాలకి తమ అమూల్యమైన ఆశీస్సులందించిన శ్రీ పీఠాధిపతులు పరమపూజ్య **శ్రీశ్రీశ్రీ పరిపూర్ణానంద సరస్వతీ స్వామివారికి,** అస్మద్గురువర్యులు ఆర్షవిద్యాసాగర **బ్రహ్మశ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి గారికి** సహస్రాధిక వందనాలు సమర్పిస్తున్నాను.

ప్రోత్సహించిన మిత్రులు రోహిత్ ప్రింటర్స్ అధినేత శ్రీ పుప్పాల అప్పారావు గారికి, డా॥ కానుకొల్లు బాలకృష్ణ, వలివేటి శివరామకృష్ణమూర్తి, వేదాంతం సార్వభౌమ, ఉన్నవ గణేష్‌లకి..... అలాగే ఈ గ్రంథాన్ని డి.టి.పి. చేసిన శ్రీమతి వినీల గారికి పేజి మేకింగ్ చేసిన విద్యార్థి క్రియేషన్స్ వారికి ప్రత్యేక అభినందనలు...




Sreepeetam
# 1-9-278/10/1, Lalitha Nagar, Vidyanagar, Hyderabad - 500 044.
Ph: 27076655, M: 098490 33991

# ఆశీస్సులు

డా॥ జయంతి చక్రవర్తి గారు అనేక ఆధ్యాత్మిక రచనల ద్వారా తెలుగు పాఠకులకు సుపరిచితులు. విజయవాడ కనకదుర్గ దేవస్థానం పక్షాన వెలువడుతున్న 'కనకదుర్గ ప్రభ' పత్రికకు ప్రారంభ సంపాదకులుగా ఆయన పేరు తెచ్చుకున్నారు. 'దశ మహావిద్యలు' పుస్తక రచన తరువాత డా॥చక్రవర్తి గారు అష్టాదశ పురాణాలను తెలుగు పాఠక ప్రపంచంలోకి లోతుగా తీసుకువెళ్లాలని సంకల్పించారు. ఒక్కొక్క పురాణ సారాంశాన్ని ఒక్కొక్క చిన్న పుస్తకంగా విడుదల చేయాలన్న ఆ రచయిత సంకల్పం ప్రశంసనీయం.

ఈ చిన్నిపొత్తాలు పాఠకులందరికీ ప్రయోజనకరంగా, సదుపాయకరంగా ఉంటాయి. వీటి ఉపయోగాన్ని పాఠకులందరూ అందిపుచ్చుకోవాలని మనసారా ఆకాంక్షిస్తున్నాను.



స్వామి పరిపూర్ణానంద

**జయ వత్సరం, శ్రావణ పూర్ణిమ**

**(10.8.2014)**

"ఆర్షవిద్యాసాగర", "మధురభారతి"
మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి



దూరవాణి : 81061 96418

301, శ్రీ సాయి ఎన్‌క్లేవ్, అడవి శేషగిరిరావు వీధి, లక్ష్మీనగర్
సత్యనారాయణపురం, విజయవాడ-520011



తేది : 19-8-2014

# ఇది సృష్టి కథ

"అన్నీ వేదాల్లోనే ఉన్నాయిష" అనే వెక్కిరింపు లోకంలో బాగా ప్రచారంలో ఉంది. వెక్కిరించడానికి అన్నమాటే అయినా, ఇది నిజమని మాత్రం చెప్పక తప్పదు. వేదం సృష్టితత్త్వాన్ని, సృష్టికి మానవుడికి ఉన్న సంబంధాన్ని, మానవుడికి సృష్టికర్తతో గల అనుబంధాన్ని వ్యక్తం చేసింది. వేదం ఏ ఒక్కరో రచించిన గ్రంథం కాదు. సృష్టితత్త్వాన్ని, పరమాత్మ తత్త్వాన్ని తెలుసుకోవాలని ఆరాటపడిన మహర్షి సముదాయానికి అంతర్నేత్రానికి గోచరించిన ఒక దర్శనం. హృదయస్థానంలో వినిపించిన ఒక నాదం (శ్రుతి).వేదం 'అపౌరుషేయం' అని కూడా పెద్దలు గుర్తించారు. 'అపౌరుషేయం' అంటే మానవుమాత్రుడి రచన కాదు అని అర్థం.

అనాదిగా అలా దిగి వచ్చిన వేదం వ్యాసమహర్షి కాలానికి చిక్కువడిన దారాల రాశిగా ఉంటే, ఆ చిక్కును విడదీసి, వేదవిభాగ నిర్ణయించేసి, వేదం మనకు అక్కరకు వచ్చేలా చేశాడు ఆ మహర్షి. ఆనాటి నుండి అతడికి 'వేదవ్యాసుడు' అనే పేరు వచ్చింది. సకల వేదాల సారాన్ని 555 సూత్రాలుగా "బ్రహ్మసూత్రాలు" రచించాడు. అయినా, ఆ మహర్షికి తృప్తి కలుగలేదు. వేదమనే విత్తనంలో నుంచి విశాలమైన పురాణ మహావృక్షాలను అంకురింపచేశాడు. అందుకే పురాణాలకు

“వేదోపబృంహణాలు” అని పేరు. “ఉపబృంహణం” అంటే విత్తనాలు నుంచి మొలక రావడం. విత్తనంలో ఏమి ఉన్నదో మొలకలో, మొక్కలో, చెట్టులో అదే ఉంటుంది.

వేదవాఙ్మయంలో దాగిన సృష్టితత్త్వాన్ని కథారూపంగా వివరించడానికి అష్టాదశ పురాణాలను రచించాడు వ్యాసమహర్షి. మానవాభ్యుదయం కోసం వెలువడిన ఈ పురాణ వాఙ్మయసారాన్ని సంక్షిప్తంగా సంకలనం చేసి అందిస్తే, ఈనాటి సమాజానికి శ్రేయస్సు కలుగుతుందని సంకల్పించాడు మా శిష్యమిత్రుడు డా॥ జయంతి చక్రవర్తి. తన ఓర్పు నేర్పులతో అష్టాదశ పురాణాల ఆంతర్యాన్ని వాడుకభాషలో నేటి జన సామాన్యానికి అందుబాటులోకి తెచ్చే పవిత్రమైన బాధ్యతను నెరవేర్చాడు.

మంచి సాహిత్యాన్ని మన సమాజానికి అందించే మహత్తర లక్ష్యంతో శ్రీ బాలాజీ పబ్లికేషన్స్ వారు ఈ అష్టాదశ పురాణాలని ప్రచురించటానికి ముందుకు వచ్చారు. వీరిద్వారా ఇంకా ఎన్నో చక్కని గ్రంథాలు వెలుగు చూస్తున్నాయి.

పురాణ వాఙ్మయంలోని పుణ్యకథా విశేషాలను ఈనాటి సమాజానికి పంచే కృషిలో పాలు పంచుకుంటున్న మా చక్రవర్తి, సంప్రదాయ సాహిత్యాన్ని ప్రచురించే సత్కార్యాన్ని మహాయజ్ఞంగా స్వీకరించిన ప్రచురణకర్త శ్రీ బాలాజీ పబ్లికేషన్స్ వారు ఎంతైనా అభినందనీయులు.

వీరిద్దరికీ అంతర్యామి అనంత శుభాలనూ ప్రసాదించాలని ఆశీర్వదిస్తూ, ఈ గ్రంథాలు ప్రజలకు చేరువ కాగలవని ఆకాంక్షిస్తున్నాను.

- మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి



# పురాణ పురుషుడు శ్రీమన్నారాయణుడు



# విషయసూచిక

# ఉపోద్ఘాతము

అం.ఆ

**వక్రతుండ మహాకాయ కోటిసూర్య సమప్రభ ।**
**నిర్విఘ్నం కురుమేదేవ సర్వకార్యేషు సర్వదా ॥**

**వ్యాసం వశిష్ఠనప్తారం శక్తేః పౌత్ర మకల్మషమ్ ।**
**పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్ ॥**

## అష్టాదశ పురాణాలు

మన భారతవాఙ్మయంలో వేదాల తరువాత అంతటి ప్రాశస్త్యాన్ని పొందిన గ్రంథాలు పురాణాలు. వేదాల్లో చెప్పిన ధర్మాల్ని కథలరూపంలో, ఆఖ్యానాల రూపంలో సామాన్యులకు సైతం అర్థమయ్యేలా తెలియచెప్పేవే పురాణాలు. అందుకే పురాణాల్ని పంచమవేదంగా కీర్తించారు. అసలు పురాణం అంటే? పురా అపినవం-పురాతనమైనప్పటికీ నూతనంగా వుండేది అని అర్థం. అలాగే 'పురా ఆనతి' అంటే ప్రాచీనకాలంలో జరిగింది అని, వాయుపురాణం పురాణశబ్దాన్ని నిర్వచిస్తే, 'పురాఏతత్ అభూత్' పూర్వం ఇలా జరిగింది అని బ్రహ్మాండ పురాణం పురాణశబ్దానికి అర్థాన్ని చెబుతుంది. వీటన్నిటినీ క్రోడీకరించి చూస్తే పురాణం అంటే పూర్వకాలంలో జరిగిన ఎన్నో విషయాల్ని వివరించి చెప్పేది అని తెలుస్తోంది.

పురాణాలు ఎన్ని-

పురాణాలు మహాపురాణాలు, ఉపపురాణాలని రెండు విధాలుగా వున్నాయి. మహాపురాణాలు 18, అలాగే ఉపపురాణాలు 18.

**బ్రహ్మం పాద్మం వైష్ణవం చ వాయవీయం తథైవచ ।**
**భాగవతం నారదదీయం మార్కండేయంచ కీర్తితమ్ ॥**

**ఆగ్నేయంచ భవిష్యంచ బ్రహ్మవైవర్త లింగకే ।**
**వారాహంచ తథా స్కాందం వామనం కూర్మ సంజ్ఞకమ్ ।**
**మాత్స్యం చ గారుడం తద్వద్బ్రహ్మాండాఖ్యమితి త్రిషట్ ॥**

1.బ్రహ్మపురాణం 2.పద్మపురాణం 3.విష్ణుపురాణం 4.వాయు పురాణం 5.భాగవత పురాణం 6.నారదపురాణం 7.మార్కండేయ పురాణం

8.అగ్నిపురాణం 9.భవిష్యపురాణం 10.బ్రహ్మవైవర్త పురాణం 11.లింగపురాణం 12. వరాహ పురాణం 13.స్కాంద పురాణం 14.వామన పురాణం 15.కూర్మ పురాణం 16.మత్స్య పురాణం 17.గరుడ పురాణం 18.బ్రహ్మాండ పురాణం- ఈ పద్దెనిమిదీ మహాపురాణాలు. అలాగే 18 ఉపపురాణాలు కూడా వున్నాయి. ఈ మహాపురాణాల పేర్లని గుర్తుంచుకోవటానికి శ్లోకం కూడా వుంది.

**'మ' ద్వయం 'భ' ద్వయం చైవ 'బ్ర'త్రయం 'వ' చతుష్టయం।**
**అనాపలింగ కూస్కాని పురాణాని పృథక్ పృథక్ ॥**

'మ' తో మొదలయ్యేవి రెండు 1.మత్స్య 2.మార్కండేయ

'భ' తో మొదలయ్యేవి రెండు 1.భాగవత 2.భవిష్య

'బ్ర' తో మొదలయ్యేవి మూడు 1.బ్రహ్మ 2.బ్రహ్మవైవర్త 3.బ్రహ్మాండ

'వ' తో మొదలయ్యేవి నాలుగు 1.వాయు 2.విష్ణు 3.వామన 4.వరాహ

అ-అగ్ని, నా-నారద, ప-పద్మ, లిం-లింగ, గ-గరుడ, కూ-కూర్మ, స్కా-స్కాంద ఇలా మొత్తం పద్దెనిమిది పురాణాలు.

## పురాణాలు విష్ణుస్వరూపం

అష్టాదశ పురాణాలను సాక్షాత్తు విష్ణు స్వరూపంగా పోల్చారు. 18 పురాణాలని మహావిష్ణువు శరీరంలోని 18 అంగాలుగా భావిస్తారు మన ప్రాచీన ఋషులు.

1. బ్రహ్మపురాణం - శ్రీ మహావిష్ణువు శిరస్సు
2. పద్మపురాణం - శ్రీ మహావిష్ణువు హృదయం
3. విష్ణుపురాణం - శ్రీ మహావిష్ణువు కుడిభుజం
4. వాయుపురాణం - శ్రీ మహావిష్ణువు ఎడమభుజం
5. భాగవతపురాణం - శ్రీ మహావిష్ణువు ఊరువులు
6. నారదపురాణం - శ్రీ మహావిష్ణువు నాభి
7. మార్కండేయపురాణం - శ్రీ మహావిష్ణువు కుడిపాదం
8. అగ్నిపురాణం - శ్రీ మహావిష్ణువు ఎడమపాదం

9. భవిష్యపురాణం - శ్రీ మహావిష్ణువు కుడిమోకాలు
10. బ్రహ్మవైవర్తపురాణం - శ్రీ మహావిష్ణువు ఎడమమోకాలు
11. లింగపురాణం - శ్రీ మహావిష్ణువు కుడి చీలమండ
12. వరాహపురాణం - శ్రీ మహావిష్ణువు ఎడమ చీలమండ
13. స్కందపురాణం - శ్రీ మహావిష్ణువు కేశాలు
14. వామనపురాణం - శ్రీ మహావిష్ణువు చర్మం
15. కూర్మపురాణం - శ్రీ మహావిష్ణువు పృష్ఠభాగం
16. మత్స్యపురాణం - శ్రీ మహావిష్ణువు మెదడు
17. గరుడపురాణం - శ్రీ మహావిష్ణువు మాంససారం
18. బ్రహ్మాండపురాణం - శ్రీ మహావిష్ణువు ఎముకలు

పురాణ లక్షణం :-

**సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశోమన్వంత రాణి చ ।**
**వంశానుచరితం చేతి పురాణం పంచ లక్షణం ॥**

పురాణానికి ఐదు లక్షణాలు ప్రధానంగా వుండాలని చెప్పారు. 1.సర్గ-అంటే ప్రపంచ సృష్టి, 2.ప్రతిసర్గ-ఈ ప్రపంచ ప్రళయం, 3.వంశం-రాజుల, ఋషుల, దేవతలకు సంబంధించిన వంశ విశేషాలు-అవతారాలు 4.వంశానుచరితం-రాజవంశాలలో, ఋషుల వంశాలలో పుట్టిన వారి జీవితచరిత్రలు, 5.మన్వంతరాలు-మనువులు, మనువు ద్వారా ఏర్పడ్డ సంతతి, ఆయా మన్వంతరాలలో జరిగిన విశేషాలు. ఈ విధంగా ప్రతిపురాణం పంచలక్షణాలతో కూడి వుంటుంది.

పురాణకర్త :-

**విష్ణోరంశో మునిర్జాత సత్యవత్యాం పరాశరాత్ ।**
**పురాణ సంహితాం దద్యే తేషాం ధర్మ విధిత్సయా ॥**

అనే ఈ ప్రమాణ శ్లోకం ప్రకారం సత్యవతీ పరాశర మహర్షి కుమారుడుగా శ్రీ మహావిష్ణు అంశంతో జన్మించిన వ్యాసుడే అష్టాదశ పురాణాల కర్త అని తెలుస్తోంది. ఈయననే కృష్ణద్వైపాయనుడు అని కూడా అంటారు. పురాణాలకు కర్త వ్యాసుడైతే వక్త సూతమహర్షి. ఈయన నైమిశారణ్యంలో శౌనకాది మహామునులకు ఈ పురాణాలన్నిటినీ ప్రబోధించాడు.

పురాణాల ప్రాచీనత :-

వేద వాఙ్మయం ఎంత విస్తృతంగా వుందో, పురాణ వాఙ్మయం కూడా అంత విస్తృతంగా వుంది. సాధారణంగా లోకంలో వేదాలు అత్యంత ప్రాచీనమైనవని చెబుతారు. అయితే ఈ శ్లోకం వేదాలకన్నా పురాణాలే ప్రాచీనమైనవని చెబుతుంది.

**పురాణం సర్వశాస్త్రాణాం ప్రథమం బ్రహ్మణాస్మృతమ్ ।**
**నిత్యం శబ్దమయం పుణ్యం శతకోటి ప్రవిస్తరమ్ ।**
**అనంతరంచ వక్త్రేభ్యః వేదాంతస్య వినిర్గతాః ॥**

పూర్వం బ్రహ్మ నోటి నుంచి వందకోట్ల శ్లోకాలతో ముందు పురాణాలు బయలుదేరి ఆ తరువాత వేదాలు బయలుదేరాయట. ఇలా వందకోట్ల శ్లోకాలతో చతుర్ముఖ బ్రహ్మతో చెప్పబడ్డ పురాణం మొత్తం ఒక్కటిగానే వుండేది. అల్పబుద్ధులైన మానవుల కోసం ఆ బ్రహ్మదేవుడే వ్యాసుడి రూపంలో వచ్చి ఆ కోటిశ్లోకాల పురాణాన్ని నాలుగు లక్షల శ్లోకాలలోకి కుదించి దాన్ని పద్దెనిమిది పురాణాలుగా రచించాడని స్కందపురాణం చెబుతుంది.

**పురాణమేక మేవాసీ దస్మిన్ కల్పాంతరే నృప ।**
**త్రివర్గ సాధనం పుణ్యం శతకోటి ప్రవిస్తరమ్ ॥**
**స్మృత్వా జగాదచ మునీన్ ప్రతి దేవశ్చతుర్ముఖః ।**
**చతుర్లక్ష ప్రమాణేన ద్వాపరే ద్వాపరే సదా ।**
**తదష్టాదశధా కృత్వా భూర్లోకేఽస్మిన్ ప్రభాష్యతే ॥** *(స్కంద పురాణం)*

## పాఠకులకు నమస్కారం

భగవాన్ వేదవ్యాస మహర్షి రచించిన అష్టాదశ పురాణాలు ఆర్షవిద్యా భాండాగారాలు. ఆ భాండాగారాలలో నిక్షిప్తమైన ప్రధాన విషయాల్ని 18 పుస్తకాలుగా క్రోఢీకరించి మీ ముందుకు తెస్తున్నాం. సరళమైన భాషలో మేము ప్రచురించిన ఈ 18 పురాణాలని ఆదరించి, మమ్మల్ని ప్రోత్సహిస్తారని ఆశిస్తూ... మీ

***- ప్రకాశకులు, వచనకర్త***

# అష్టాదశ పురాణాల మొదటి వక్త - శ్రోత

అష్టాదశ పురాణాలను మొదటగా చెప్పిన వక్తలు వారి నుంచి మొదటిసారి విన్న శ్రోతలు ఈ క్రింద చెప్పిన విధంగా వుంటారు. అదేవిధంగా ఒక్కొక్క పురాణానికి వక్తృ శ్రోతృపరంపర వేరువేరు విధాలుగా కూడా ఉంటుంది.

| సం. పురాణం | ఏకల్ప వృత్తాంతం | వక్తృశ్రోతలు |
|---|---|---|
| 1. బ్రహ్మ పురాణాన్ని | బ్రహ్మ కల్పంలో | బ్రహ్మ మరీచి మహామునికి బోధించాడు |
| 2. పద్మ పురాణాన్ని | పద్మ కల్పంలో | స్వాయంభువమనువు బ్రహ్మకు బోధించాడు |
| 3. విష్ణు పురాణాన్ని | వరాహ కల్పంలో | పరాశరుడు బ్రహ్మకు బోధించాడు |
| 4. శివ(వాయు)పురాణాన్ని | శ్వేత కల్పంలో | శివుడు వాయువుకు బోధించాడు |
| 5. భాగవత పురాణాన్ని | సారస్వత కల్పంలో | విష్ణువు బ్రహ్మకు బోధించాడు |
| 6. నారద పురాణాన్ని | బృహత్ కల్పంలో | పూర్వ భాగాన్ని – సనకాదులు నారదునికి బోధించారు.<br>ఉత్తరభాగాన్ని – వశిష్ఠుడు మాంధాతకు బోధించాడు |
| 7. మార్కండేయ పురాణాన్ని | శ్వేత వారాహకల్పంలో | మార్కండేయుడు జైమినికి బోధించాడు |
| 8. అగ్ని పురాణాన్ని | ఈశాన కల్పంలో | అగ్నిదేవుడు వశిష్ఠుడికి బోధించాడు |
| 9. భవిష్య పురాణాన్ని | అఘోర కల్పంలో | బ్రహ్మ మనువుకు బోధించాడు |
| 10. బ్రహ్మవైవర్త పురాణాన్ని | రథంతర కల్పంలో | సావర్ణి నారదుడికి బోధించాడు |
| 11. లింగ పురాణాన్ని | కల్పాంత కల్పంలో | పరమశివుడు నారదుడికి బోధించాడు |
| 12. వరాహ పురాణాన్ని | మనుకల్పంలో | విష్ణువు పృథ్వికి బోధించాడు |
| 13. స్కాంద పురాణాన్ని | తత్పురుషకల్పంలో | స్కందుడు భూమికి బోధించాడు |
| 14. వామన పురాణాన్ని | కూర్మ కల్పంలో | బ్రహ్మ పులస్త్య మహామునికి బోధించాడు |
| 15. కూర్మ పురాణాన్ని | లక్ష్మీ కల్పంలో | విష్ణువు పులస్త్య మహామునికి బోధించాడు |
| 16. మత్స్య పురాణాన్ని | సప్త కల్పంలో | విష్ణువు మనువుకు బోధించాడు |
| 17. గరుడ పురాణాన్ని | గరుడ కల్పంలో | విష్ణువు మనువుకు బోధించాడు |
| 18. బ్రహ్మాండ పురాణాన్ని | భవిష్య కల్పంలో | బ్రహ్మ మనువుకు బోధించాడు |

# పురాణాలు ఎందుకు చదవాలి?

**పురాణశ్రవణే శ్రద్ధా యస్య స్యాద్బ్రాతరస్వహమ్ ।**
**తస్య సాక్షాత్ప్రసన్నః స్యాత్ శివో విష్ణుశ్చ సానుగః ॥**

**యత్స్నాత్వా పుష్కరే తీర్థే యాగే సింధౌ చ సంగమే ।**
**తత్ఫలం ద్విగుణం తస్య శ్రద్ధయా వై శృణోతి యః ॥**

**యే పఠంతి పురాణాని శృణ్వన్తి చ సమాహితాః ।**
**ప్రత్యక్షరం లభంత్యేతే కపిలాదానజం ఫలమ్ ॥**

**అపుత్రో లభతే పుత్రం ధనార్థీ లభతే ధనమ్ ।**
**విద్యార్థీ లభతే విద్యాం మోక్షార్థీ మోక్షమాప్నుయాత్ ॥**

**యే శృణ్వన్తి పురాణాని కోటిజన్మార్జితం ఖలు ।**
**పాపజాలంతు తే హిత్వా గచ్ఛన్తి హరిమందిరమ్ ॥**

పురాణాలు వినడంలో ఎవరికైతే శ్రద్ధ ఉంటుందో మరియు నిత్యము ఎవరైతే శ్రవణం చేస్తారో, అటువంటి వారి విషయంలో శివ-కేశవులు మరియు వారి గణాలు సంపూర్ణానుగ్రహం ప్రదర్శిస్తారు. పుష్కర తీర్థాల్లో, ప్రయాగ మొదలైన నదీసంగమ క్షేత్రాల్లో స్నానాలాచరిస్తే ఏవిధమైన పుణ్యం పొందగలరో దాని రెట్టింపు పుణ్యం పురాణ శ్రోతలకు లభిస్తుంది. భక్తి శ్రద్ధలతో పురాణ పఠన-శ్రవణాలు చేసేవారు కపిలగోవును దానం చేస్తే కలిగే పుణ్యరాశిని పొందగలరు. పుత్రులు లేనివారు పుత్రులను, దరిద్రులు ధనాన్ని, విద్యార్థులు విద్యను, మోక్షగాములు మోక్షాన్ని పొందగలరు. పురాణ శ్రోతలు తమ కోటి జన్మల పాపాలను దూరం చేసికొని చివర్లో శ్రీమన్నారాయణమూర్తి సాయుజ్యం పొందగలరు.

# పురాణ వైభవం

**అష్టాదశ పురాణానాం నామధేయాని యః పఠేత్ ।**
**త్రి సంధ్యాం జపతే నిత్యం సోఽశ్వమేధ ఫలం లభేత్ ॥**

ఈ అష్టాదశ మహాపురాణాల పేర్లను ఉదయ-మధ్యాహ్న-సాయంకాల సమయాల్లో ఎవరైతే పఠిస్తారో వారు అశ్వమేధ ఫలాన్ని పొందగలరని భావం.

# శ్రీ గరుడ పురాణం



శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్।
ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వ విఘ్నోపశాంతయే ॥

నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమమ్।
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయందీరయేత్ ॥

అష్టాదశ పురాణాలలో పదిహేడో పురాణం గరుడ పురాణం. 'మజ్జాతు గారుడం ప్రోక్తం' అన్న మాట ప్రకారం ఈ పురాణం, పురాణ పురుషుడైన శ్రీమహావిష్ణువు శరీరంలోని క్రొవ్వుగా వర్ణించబడింది. నారద పురాణం ప్రకారం ఈ పురాణంలో మొత్తం 19వేల శ్లోకాలున్నాయి. గరుడ కల్పంలో శ్రీమహావిష్ణువు గరుత్మంతుడి బోధించిన పురాణమే ఈ గరుడపురాణం. ఇది రెండు ఖండాలుగా విభాగించబడింది 1.పూర్వఖండం 2.ఉత్తర ఖండం అని ఈ రెండు ఖండాలలో కలిపి 264 అధ్యాయాలున్నాయి.

గరుడపురాణం అనగానే లోకంలో ఇది కేవలం పాపపుణ్యాలు, నరకాలు, యమబాధలు ప్రేతకర్మలు, ప్రేతలోకాలు వీటిని గురించి చెప్పే పురాణమే అన్న భావన వుండిపోయింది. అయితే ఇవన్నీ ఉత్తర ఖండంలో చెప్పబడ్డ విషయాలు. పూర్వ ఖండంలో ఎన్నెన్నో ఆసక్తి కరమైన విషయాలతో పాటూ, ఆయుర్వేద జ్యోతిష, మంత్ర తంత్ర సంబంధ విశేషాలు చాలా వివరంగా వర్ణించబడ్డాయి. ప్రస్తుతం ఉత్తర ఖండంలో చెప్పిన విశేషాలతోనే తెలుగులో గరుడ పురాణ ప్రతులు మనకి లభ్యమవుతున్నాయి. ఈ గరుడపురాణం ఉత్తర ఖండంలోని పదహారు అధ్యాయంచాలా విశేషమైనది. ఇందులో మోక్ష ధర్మం సవివరంగా చెప్పబడింది. విప్రమాణి కతహాసం ఆ ఆధ్యాయంలో చెప్పిన మూల శ్లోకాల్ని ఫలశ్రుతితో సహా ఉంది పొందు పరుస్తున్నాం. ఎంతో విశేషమైన ఈ పురాణాన్ని ప్రతిఒక్కరూ కనీసం ఒకసారి చదివినా వారి యమ బాధలుండవు పాపం చేయాలంటేనే భయం కలుగుతుంది.

## గరుడ పురాణంలో చెప్పిన విషయాలు

**1. పూర్వఖండం :** ఇందులో మొత్తం 240 అధ్యాయాలున్నాయి. వీటిలో పురాణోపక్రమం, సంక్షేపంగా సృష్టివిశేషాలు, సూర్యపూజావిధి, రక్షావిధానం, శ్రాద్ధపూజ, నవవ్యూహార్చనా విధానం, విష్ణుపంజర స్తోత్రం, యోగాధ్యాయం, విష్ణుసహస్రనామ సంకీర్తనం, శ్రీమహావిష్ణు ధ్యానం, సూర్యపూజావిధానం, మృత్యుంజయ అర్చన, మృత్యుంజయ మాలా మంత్రం, శివపూజా విధానం, గణపూజ,గోపాలుడి పూజావిధి, త్రైలోక్యమోహన శ్రీధరార్చన, శ్రీహరి పూజ, పంచతత్త్వ పూజ, చక్రపూజ, దేవపూజ, సంధ్యోపాసన, దుర్గార్చన, సూర్యార్చన, పరమేశ్వరీ పూజా, పవిత్రారోపణం, మూర్తి ధ్యానం, వాస్తుమాన విశేషాలు, ప్రాసాదలక్షణం.

సకలదేవతా ప్రతిష్ఠావిధి, అష్టాంగయోగం, దానధర్మ విశేషాలు, ప్రాయశ్చిత్తవిధి, నరకోపాఖ్యానం, సూర్యవ్యూహం, జ్యోతిషం, సాముద్రికం, స్వరజ్ఞానం, నవరత్న పరీక్ష, తీర్థమహాత్మ్యం, గయామహాత్మ్యం, మన్వంతర కథ, పిత్రాఖ్యానం, వర్ణధర్మాలు, ద్రవ్యశుద్ధి, సమర్పణ, శ్రాద్ధం, వినాయక పూజ, గ్రహయజ్ఞం, ఆశ్రమ ధర్మాలు, జనన, మరణం శౌచం, నీతిశాస్త్రం, వ్రత కథనం, సూర్యవంశం, సోమవంశం, శ్రీహరి అవతార కథనం, రామాయణం, హరివంశం, భారతం, ఆయుర్వేదనిదానం, చికిత్సా విధి, ద్రవ్యగుణాలు, సకల రోగాల్నీ హరించే విష్ణు కవచం, గరుడ మంత్రం, త్రిపురా మంత్రం, ప్రశ్న చూడామణి, హయ ఆయుర్వేదం,ఓషధులు వాటి నామాలు, వ్యాకరణ శాస్త్రం, ఛందశ్శాస్త్రం, సదాచారం, స్నాన విధి.

వైశ్వదేవ తర్పణం, సంధ్యా విధి, తర్పణ విధి, సపిండం అనే నిత్య శ్రాద్ధం, ధర్మసారం, పాపనిష్కృతి ప్రతి సంక్రమణం, యుగధర్మాలు, యోగశాస్త్రం, హరిభక్తి, శ్రీహరికి నమస్కరిస్తే వచ్చే ఫలం, వైష్ణమహాత్మ్యం, నారసింహ స్తోత్ర రత్నం, జ్ఞానామృతం, గుహాష్టకం, విష్ణు అర్చనా స్తోత్రం, వేదాంత సిద్ధాంతం, సాంఖ్య సిద్ధాంతం, బ్రహ్మజ్ఞానం, ఆత్మజ్ఞానం, గీతాసారం, ఇవన్నీ పూర్వఖండంలో చెప్పబడ్డ విషయాలు.

**2. ఉత్తర ఖండం :** దీనినే ప్రేత కల్పం అనికూడా అంటారు. ఇందులో మొత్తం 78 అధ్యాయాలున్నాయి. వీటిలో – ధర్మ ప్రకటనం, యోగుల గతి, దానాలు వాటి ఫలితాలు, ఊర్ధ్వదైహిక మంత్రాలు, యమలోక మార్గ వర్ణనం, షోడశ శ్రాద్ధఫలవర్ణన, యమమార్గ నిష్కృతి, ధర్మరాజ వైభవం, ప్రేత పీడా కథనం, ప్రేత చిహ్నాలు, ప్రేత చరిత్ర, ప్రేతత్వం ఏర్పడటానికి కారణం, ప్రేతకృత్యావిచారం, సపిండీకరణ కథనం, ప్రేతత్వమోక్షణ కథనం, ప్రేతత్వం విముక్తి పొందటానికి చేయాల్సిన దానాలు. ఆవశ్యక దానాలు, ఉత్తమదానం.

ప్రేతసౌఖ్యకర విధి, శారీరక కథనం, మృత్యువు తరువాత చేసే కర్మ, మధ్యషోడశ శ్రాద్ధం, స్వర్గ ప్రాప్తి క్రియా విధానం, సూతక కథనం, నారాయణ బలిక్రియ, వృషోత్సర్గమహాత్మ్యం, నిషిద్ధ వర్జనం, అపమృత్యు క్రియోక్తి, మానవుల కర్మవిపాకం, కృత్యాకృత్య విచారం, విష్ణు ధ్యానం, స్వర్గ ప్రాప్తికి చేయవలసిన కర్మలు, స్వర్గ సౌఖ్య నిరూపణం, భూలోకవర్ణన, సప్త అధోలోకాలు, ఐదు ఊర్ధ్వలోకాలు, బ్రహ్మాండస్థితి అనేక బ్రహ్మాండాల చరిత్ర, బ్రహ్మజీవనిరూపణం, అత్యంతిక ప్రళయం ఫలస్తుతి ఇవి ఉత్తర ఖండంలో చెప్పబడ్డ విశేషాలు

ఈ గరుడ పురాణం అనే గ్రంథంలో గరుడ మహాపురాణంలో చెప్పిన ప్రధానమైన విషయాలని సంక్షిప్తంగా మీకు అందిస్తున్నాం.

## శ్రీహరి గరుడ సంవాదం - ఐహికాముష్మిక దుఃఖాలు

ధర్మదృఢబద్ధమూలో వేదస్కంధః పురాణ శాఖాఢ్యః ।
కృతకుసుమో మోక్షఫలో మధుసూదన పాదపో జయతి ॥

ధర్మమే దృఢమైన మూలంగా కలిగినది. వేదాలనే స్కందాలు (కాండం) కలిగినది, పురాణాలనే కొమ్మలతో విస్తరించినది, యజ్ఞాలనే పూలతో వికసించినది. మోక్షమనే మధుర ఫలాల్ని అందించేది, అయిన శ్రీమహావిష్ణువు అనే కల్పవృక్షం సర్వకాలాలలో ప్రకాశిస్తుంది.

పూర్వం నైమిశారణ్యంలో శౌనకాది మహా మునులందరూ స్వర్గసౌఖ్యాలు పొందాలని పరమాత్మ అనుగ్రహాన్ని సంపూర్ణంగా సంపాదించాలనే కోరికతో, వెయ్యి సంవత్సరాలపాటు కొనసాగే సత్రయాగాన్ని ప్రారంభించారు. ఆ మునీశ్వరులంతా నిత్యం యథావిధిగా యాగాన్ని కొనసాగిస్తున్నారు. ఇలా కొన్నాళ్ళు గడిచాయి. ఒకనాడు బహుపురాణవేత్త సర్వజ్ఞుడు అయిన సూతమహర్షి అక్కడికి వచ్చాడు. ధర్మపురుషుడైన ఆయన్ని చూడగానే ఎంతో సంతోషించిన మునులంతా ఘనంగా స్వాగతం పలికారు.

కుశలప్రశ్నలు, అతిథి సత్కారాలు పూర్తయ్యాక సూతమహర్షి సావధానంగా కూర్చుని వుండగా, వారంతా ఎంతో వినయంగా ఇలా అడిగారు. “మహర్షీ! తమరు బహుపురాణాలు సాంగోపాంగంగా తెలిసిన సర్వజ్ఞులు. మాకు ఇతః పూర్వం ఎన్నో పురాణాలు చాలా వివరంగా ప్రబోధించారు. ప్రస్తుతం మాకు సంసారం వల్ల కలిగే కష్టాలు అవి పోగొట్టుకునే మార్గాలు, ఇహపరలోకాల్లో జీవులకి సంభవించే దుఃఖాలు వాటినివారణోపాయాలు, భయంకరమైనదని అందరూ చెప్పే యమలోక మార్గం ఎలా ఉంటుంది? ఇలాంటి విశేషాలు తెలుసుకోవాలని మాకు చాలా కుతూహలంగా వుంది. దయచేసి వాటి గురించి చెప్పండి” అని ప్రార్థించారు.

శౌనకాది మునులారా! మీరడిగిన విశేషాలు అందరూ తెలుసుకో తగినవి. పుణ్యాత్ములకి చాలా సుఖాన్ని కలిగించేది, పాపాత్ములకి ఎంతో వేదన కలిగించేది, అత్యంత భయంకరమైనది యమలోక మార్గం. పూర్వం గరుత్మంతుడు మీరడిగిన విషయం గురించే, శ్రీమహావిష్ణువుని అడిగాడు. అప్పుడాయన గరుడుడికి ఏవిశేషాలు చెప్పాడో వాటినే మీకు చెబుతున్నా శ్రద్ధగా వినండి” అని ఇలా చెప్పటం ప్రారంభించాడు.

పూర్వం గరుత్మంతుడు ఒకనాడు వైకుంఠానికి వెళ్ళి శ్రీహరిని ఇలా ప్రార్థించాడు. “స్వామీ! నీమీద భక్తిలేనివాళ్ళు సరాసరి యమలోకానికి వెళు తున్నారు. అసలు యమలోకమార్గం ఎలాఉంటుంది? అది చాలా భయంకరంగా ఉంటుందని అందరూ అంటారు అది నిజమేనా?

ప్రభూ! భక్తి గురించి ఎన్నో విధాలుగా నీవు పూర్వం ప్రబోధించావు. అలాగే భక్తులు పొందే ఉన్నతస్థానాల్ని గురించి కూడా చెప్పావు. ఎవరి నాలుకనివారు స్వాధీనంలో ఉంచుకుని, నిరంతరం భగవన్నామస్మరణ చేయటం చాలా సులభమైన విషయం. ఈనామ స్మరణ మానవుల్ని తరింపచేస్తుంది. ఇంత సులభమైన తరుణోపాయాన్ని తెలిసి కూడా మానవులంతా నరకం పాలవుతున్నారు స్వామీ! ఇది ఎంతో శోచనీయంగా ఉంది". అని అన్నాడు. గరుత్మంతుడి విన్నపాన్ని విన్న శ్రీహరి అతడితో ఇలా చెప్పటం ప్రారంభించాడు.

**నరకాన్ని పొందేవాళ్ళు :** గరుడా! నీవు చెప్పినట్టు పాపాత్ములైన వారికి మంచి ఎప్పుడూ రుచించదు. అత్యంత సులభమైన ఆధ్యాత్మిక మార్గాన్ని కూడా వాళ్ళు ఆచరించరు. పైగా ఆచరించేవారిని చూసి అవహేళన చేస్తారు. అలాంటి పాపాత్ములు, నాస్తికులు ఖచ్చితంగా నరకానికి వెళతారు. వాళ్ళు వెళ్ళే యమలోక మార్గం అత్యంత భయంకరంగా ఉంటుంది.

ఎవరైతే పాపాలు చేయటమే నియమంగా పెట్టుకుంటారో! ధర్మమార్గాన్ని వదిలిపెట్టి, దుర్మార్గులతో అనాచారులతో సావాసం చేస్తూ, ధర్మశాస్త్రాలమీదా, ధర్మాచరణ మీదా అనాసక్తులై ఉంటారో! అలాగే ఎవరైతే తనకుతానే గొప్పఅని, ధనమదంతో విర్రవీగుతూ ఇతరుల్ని చులకనగా చూస్తారో! నిత్యం రాక్షసంగా ప్రవర్తిస్తూ ప్రజల్ని బాధిస్తారో! దైవకార్యాలు ఆచరించటం మీద ఎలాంటి శ్రద్ధా భక్తులు లేకుండా వుంటారో, అలాంటి వారంతా నరకాన్ని పొందుతారు.

మనసుని విషయసుఖాల మీదకి మళ్ళించి, ఇంద్రియ నిగ్రహాన్ని కోల్పోయేవారు, మోహం అనే వలలో చిక్కుకుపోయి, భోగాలమీదే ఆసక్తిని పెంపొందించుకునేవారు, అత్యంత దుఃఖ కారణమైన నరకాన్ని చేరతారు.

యే న రాజ్ఞాన శీలాశ్చ తే యాంతి పరమాంగతిం ।
పాపశీలా పరాయంతి దుఃఖేవ యమయాతనాం ॥

ఎవరైతే జ్ఞానాన్ని కలిగి, ధర్మ స్వభావంతో ధార్మిక కార్యాలు ఆచరిస్తారో అలాంటివాళ్ళు మాత్రమే స్వర్గానికి వెళతారు. పాపకర్ములు ఆచరిస్తూ అజ్ఞానంతో

ప్రవర్తించేవాళ్ళు ఎన్నో బాధలుపడుతూ యమలోకానికి వెళ్ళి చిత్రహింసలు అనుభవిస్తారు.

సుకృతం దుష్కృతం వాపి భుక్త్వాపూర్వం యథార్జితం ।
కర్మయోగాత్తిదాతస్య కశ్చిదావ్యధిః ప్రజాయతే ॥

గరుడా! జీవులందరూ తమ పూర్వజన్మలో వారుచేసిన కర్మానుసారంగానే పుణ్యాల ఫలితంగా సుఖాల్ని, పాపకర్మల ఫలితంగా దుఃఖాల్ని పొందుతారు. ఆ తరువాత తమ తమ కర్మానుసారం వారు రోగాలచేత పీడించబడతారు.

**జీవుడి మరణ కాలస్థితి :** జీవుడు తన కర్మానుసారంగా ప్రస్తుత జన్మలో మనోవ్యాధి లేక, శారీరకవ్యాధితో బాధపడుతుంటాడు. అయినా ఎలాగో జీవించాలి అనే ఆశ పడతాడు. కానీ మృత్యువు ఊరుకోదుకదా! దాని సమయం రాగానే అది పాము ఎలుకని పట్టుకున్నట్టు జీవుణ్ణి పట్టుకుంటుంది. ఈవిధంగా జీవుడు మృత్యుముఖం దగ్గరకి వెళ్ళినప్పటికీ వాడికి వైరాగ్యం రాదు.

★ మరణం సమయం దగ్గరపడినవాడు ముసలితనంలో వికారమైన రూపంతో మంచంమీద కదల్లేక పడివుంటాడు

★ భార్యా బిడ్డలమీద మమకారాన్ని వదలేక, అలాగే మంచానపడి ఆకలి నశించి, ఏకొద్ది ఆహారాన్నైనా తినలేని స్థితిలో ఉంటాడు

★ జీవుడికి మరణకాలం సమీపించినప్పుడు, ప్రాణం శరీరంలోంచి బైటికి వెళ్ళేడప్పుడు, లోపలున్న నాడులన్నీ శ్లేష్మంతో నిండిపోతాయి. దగ్గువస్తుంది. ఆయాసంతో కళ్ళు, మూస్తూ తెరుస్తూ శ్వాస సరిగ్గా అందక, గురకతో బాధపడుతుంటాడు.

★ జీవుడు తనచుట్టూ బంధువులు, మిత్రులు చేరి విచారంగా, రోదిస్తూ ఉన్నప్పటికీ, మృత్యువు ఏమాత్రం జాలిలేకుండా అతడి ప్రాణాల్ని పట్టి లాక్కుపోతుంది. ఆ సమయంలో బంధువులు ఎంత గట్టిగా పిలిచినా జీవుడికి ఏ మాత్రం వినిపించదు.

★ ఇలా జీవుడు జీవించినంత కాలం ఇంద్రియాల మీద ఆపేక్షతో ఎన్నో దుష్కృత్యాలు చేసి, వ్యామోహాన్ని విడిచిపెట్టలేక, మరణకాలంలో ఎంతో వేదన అనుభవించి, చివరికి అందరూ చూస్తుండగానే మరణిస్తాడు.

గరుత్మంతా! ఆవిధంగా జీవుడు మరణించే ముందు, ఒక్క క్షణం అమృతం పొందుతాడు ఆసమయంలో అతడికి దివ్యజ్ఞానం ఉదయిస్తుంది. ఆ స్థితిలో అతడికి ఇహపర లోకాలు రెండూ సమానంగానే కనిపిస్తాయి. అయితే ఆ జీవుడు ఏదీ చెప్పగలిగే స్థితిలో ఉండడు. ఈ విధంగా ఇంద్రియాలన్నీ స్వాధీనం కోల్పోయి జీవుడు స్పృహ తప్పి పడిపోగానే అతడి ప్రాణాన్ని తీసుకుపోవటానికి యమభటులు సిద్ధంగా వుంటారు.

**యమ యాతనలు :**

★ యమభటులు జీవుడి ప్రాణాలు తీయటానికి ప్రయత్నిస్తున్నప్పుడు, ఆ జీవుడికి వందతేళ్ళు అతడికి కుడితే ఎంతబాధ కలుగుతుందో, అంతబాధని ఒక్క క్షణం అనుభవిస్తాడు. అయితే ఆ ఒక్క క్షణమే ఒక యుగంలా గడుస్తుంది.

★ ప్రాణాలు కోల్పోయే జీవుడు, నోటివెంబడి నురుగు, చొంగ కారుస్తాడు. మరణించేజీవుడు గనుక పాపాత్ముడైతే వాడి ప్రాణాలు అధో ద్వారం (మలద్వారం) నుంచి బైటికిపోతాయి.

**యమదూతల స్వరూపం :**

యమదూతే తదాప్రాప్తౌ భీమౌసరభపేక్షణే ।
పాశదండ ధరౌరగ్నే దంతైః కటాక్షటాయితే ॥

ఊర్ధ్వకేశే కాకకృష్ణౌ వక్రతుండే నఖాయుధే ।
సదృష్ట్వాత్రస్త హృదయః శకృన్మూత్రం విముంచతి ॥

క్రూరంగా భయంకరమైన చూపులు కలిగి, యమపాశాన్ని దండాన్ని ధరించి, దిగంబరులై పళ్ళు పటపటా కొరుకుతూ ఉంటారు యమభటులు. వారి రంగుకాకి నలుపు. వళ్ళంతా రోమాలు, వంకర ముఖం, గోళ్ళు, భీకరంగా

పెరిగి పెద్ద ఆయుధాల్లా ఉంటాయి. అలాంటి యమకింకరులు ఒక్కసారి జీవుడి కళ్ళకి కనపడగానే అతడు భయపడిపోయి ఒక్కసారిగా మలమూత్రాలు విడిచిపెడతారు.

గరుత్మంతా! ఆ సమయంలో జీవుడు బొటనవేలంత ప్రమాణంలో మాత్రమే ఉంటాడు. అతడు ఏడుస్తూ తన ఇంటిని, తన భార్యా బిడ్డల్ని వదిలిరాలేక పోతున్నప్పటికీ యమభటులు ఎలాంటి కనికరం లేకుండా జీవుడి ప్రాణాల్ని బైటికి లాగేస్తారు. ఈవిధంగా స్థూల శరీరం నశించిపోయాక, జీవుడి సూక్ష్మ శరీరాన్ని యమలోకానికి తీసుకెళ్ళటం సాధ్యంకాదు కాబట్టి, అప్పుడు యాతనాశరీరం అనేదాన్ని జీవుడిలో ప్రవేశపెడతారు. ఆ యాతనా శరీరాన్నే తమ పాశాలతో బంధించి తీసుకుపోతారు యమభటులు.

**యమమార్గంలో యాతనలు :** యమదూతలు జీవుడి యాతనా శరీరాన్ని యమలోకానికి తీసుకువెళ్ళేడప్పుడు దారిలో అతన్ని బాగా భయపెడతారు. నరకంలో అనుభవించబోయే శిక్షల్ని వర్ణించి చెప్తారు

★ యమకింకరులు కొట్టే దెబ్బలకి, వారు చెప్పే మాటలకి, బంధువుల రోదనలకీ ఆ జీవుడు ఎంతో బాధపడతాడు దీనంగా ఏడుస్తాడు

★ యమభటులు తీసుకెళ్ళే దారిలో జీవుణ్ణి, కుక్కలు దారుణంగా గాయపరుస్తాయి. ఆ బాధలు పడలేక తాను చేసిన పాపకర్మల్ని తలుచుకుంటూ ప్రయాణిస్తాడు.

★ జీవుడు వెళ్ళే యమమార్గంలో ఆకలి దప్పికలతో బాధపడుతూ, సూర్యుడు, వాయువు, అగ్ని, దావాగ్ని వీటిచేత ఎన్నో బాధలు పడుతూ, యమదూతలు వీపుమీద కొరడాతో కొడుతుంటే దారుణంగా రోదిస్తాడు.

★ యమమార్గం కాలిన ఇసుకతో నడవటానికి వీలులేని ఎడారిలా ఉంటుంది. దారిలో త్రాగటానికి నీరేవుండదు. అలాంటి దుర్లభమైన మార్గంలో నడవలేక నడవలేక నడుస్తూ వెళతాడు.

★ యమమార్గంలో ముందుకు వెళ్ళే కొద్దీ గాఢమైన అంధకారంతో నిండి వుంటుంది. పాపుల్ని యమభటులు ఆ మార్గంలోనే తీసుకువెళతారు.

ఈవిధంగా యమభటులు పాపాలు చేసిన జీవుడి యాతనా శరీరాన్ని ఆరులేక, నాలుగు ఘడియల్లో యమలోకానికి తీసుకుపోతారు. అక్కడ యమధర్మరాజుకి అతన్ని చూపిస్తారు. ఆ తరువాత జీవుడు పూర్వజన్మవాసనా ప్రభావంతో మరోశరీరంలోకి ప్రవేశించాలని పరుగెడతాడు. అయితే యమభటులు అతడి జుట్టు పట్టుకుని నరకానికి తీసుకుపోతారు. ఆ సమయంలో అతడు అకలి దప్పికలతో ఎంతో బాధపడతాడు.

గరుత్మంతా! పాపాత్ముడైనవాడికి, అతడి పుత్రులు పిండప్రదానం చేసి ఆహారాన్ని సమర్పించినప్పటికీ అది మాత్రం అతడికి సంతృప్తినివ్వదు. పిండాలు సమర్పించటం, తిలతర్పణాలు విడవటం, లాంటివి ఎన్ని చేసినా అవి పాపాత్ములైన జీవులకి చేరవు. అందుకే వారు ఎంతో వేదనకి గురౌతుంటారు. ఈవిధంగా మరణించిన పాపజీవి పిండ ప్రదానాలు అందకపోవటంతో ప్రేత స్వరూపాన్ని పొందుతాడు. ఈ శరీరంతో ఎన్నో బాధల్ని అనుభవిస్తూ కల్పాంతం వరకూ శూన్యమైన అడవిలో తిరుగుతూ ఉంటాడు.

నాభుక్తం క్షీణయతే కర్మ కల్పకోటిశతైరపి ।
అభుక్త్వా యాతనాం జంతుర్మానుష్యం చ తేనహి ॥

గరుత్మంతా! పూర్వజన్మలో చేసిన కర్మఫలాన్ని అనుభవించకుండా వుంటే అది ఎన్ని కల్పాలు గడిచినా నశించదు. కనుక జీవుడు తన యాతనా శరీరంతో కష్టాల్ని, బాధల్ని అనుభవించక పోతే తిరిగి మానవ జన్మని పొందలేడు.

## జీవుడికి పిండ ప్రదానం

ప్రేత స్వరూపాన్ని ధరించిన జీవుడికి ఆ ప్రేత స్వరూపం పోవాలంటే, మరణించిన పదిరోజుల్లో తిలోదకాలు, పిండప్రదానాలు క్రమంగా చేయాలి. ప్రేత శరీరం నుంచి జీవుడికి విముక్తి కలగటం కోసం ఇచ్చే ఈ పిండాలు నాలుగు రకాలుగా విభాగించబడ్డాయి. ఆ నాలుగు భాగాల్లోని రెండు భాగాలు, జీవుడి పాంచభౌతిక శరీరానికి బలం కలిగించగా, మూడోభాగం యమదూతలకి ఆహారమవుతుంది. మిగిలిన నాలుగోభాగమే మృతజీవికి మిగులుతుంది.

ఈవిధంగా 'ప్రేత' తొమ్మిది రోజుల్లో తనకి సమర్పించిన పిండాల్ని తిని ఒకశరీరాన్ని పొంది పదోరోజునాటికి బలాన్ని పుంజుకుంటాడు.

గరుత్మంతా! జీవుడి మృతశరీరం దహనం చేసిన తరువాత ఆ జీవుడు తన పుత్రులు తొమ్మిది రోజుల పాటు ఇచ్చిన పిండాల ద్వారా వృద్ధిచెంది ఒక మూరప్రమాణంతో శరీరాన్ని పొందుతాడు. తరువాత తన కర్మానుసారం యమమార్గంలో వెళ్ళేడప్పుడు సుఖ దుఃఖాలనుభవిస్తూ వుంటాడు.

జీవుడికి మొదటి రోజు పెట్టిన పిండం వల్ల తల ఏర్పడుతుంది. రెండోరోజు సమర్పించిన పిండం ద్వారా కంఠం మూపురాలు ఏర్పడతాయి. మూడో రోజు ఇచ్చిన పిండంతో హృదయం ఏర్పడుతుంది. నాలుగోరోజు పిండంతో వీపు, అయిదో రోజు పిండంతో ఉదరం, ఆరోరోజు పిండంతో పిరుదులు మర్మస్థానం, ఏడోరోజు పిండంతో తొడలు, ఎనిమిది, తొమ్మిది రోజుల్లో సమర్పించిన పిండాలతో మోకాళ్ళు, రెండు పాదాలు ఏర్పడతాయి. ఇలా సంపూర్ణ శరీరం పొందిన ప్రేతకి, పదోరోజు సమర్పించిన పిండ ప్రదానంతో ఆకలి దప్పికలు కలుగుతాయి.

ఈ విధంగా శరీరాన్ని పొందిన ప్రేతరూపుడు, పదకొండు, పన్నెండు దినాల్లో చేసే షోడశపిండీకరణ శ్రాద్ధాలు, వాటిలో భాగంగా లభించిన తిలోదకాలని ఆహారంగా స్వీకరిస్తాడు. ఇలా పదిరోజుల్లో శరీరాన్ని రూపొందించుకున్న ప్రేతని పెంపుడు జీవులు తీసుకెళ్ళినట్టు పదమూడో రోజు యమభటులు యమలోకానికి తీసుకువెళతారు. ప్రేతరూపుడు ప్రతిరోజూ విశేషమైన యమమార్గంలో రోజూ రెండువందలు లేక ఏడు వందల ఆమడల చొప్పున రాత్రి పగలూ నడుస్తూ వెళతాడు.

**యమ మార్గంలో నగరాలు :** ప్రేతరూపుడు యమలోకానికి వెళ్ళే దారిలో మొత్తం పదహారు పట్టణాల్ని దాటివెళ్ళాలి.

సౌమ్యం సౌరిపురం, నరేంద్ర భవనం గంధర్వశైలాగమం ।
క్రౌంచం, క్రూరపురం, విచిత్ర భవనం, బహ్వాపదం దుఃఖదం ॥

నానాక్రందపురం సుతప్తభవనం, రౌద్రం, పయోవర్షణం ।
శీతాఢ్యం బహుభీతి ధర్మభవనం యాద్యంపురం చాగ్రతః ॥

1. సౌమ్య పురం : ఇది చంద్రుడికి సంబంధించిన నగరం.
2. సౌర పురం : ఇది సూర్యుడికి సంబంధించిన నగరం.
3. నగేంద్ర భవనం : ఇది కొండలపై ఉండే పట్టణం.
4. గంధర్వ శైలం : ఇది గంధర్వులు నివసించే స్థానం.
5. క్రౌంచ పురం : ఇది కొంగలు నివసించే నగరం.
6. క్రూర పురం : అత్యంత క్రూరులు నివసించే ప్రాంతం.
7. విచిత్రభవనం : ఇది ఎంతో విచిత్రమైన గృహాలున్న నగరం.
8. బహ్వాపదం : క్కువకష్టాలతో ఉండే నగరం.
9. దుఃఖదం : ఈ నగరం ఎన్నో దుఃఖాలతో ఉంటుంది.
10. నానాక్రంద పురం : ఇక్కడ ఎంతో మంది ఆక్రందనలు వినిపిస్తుంటాయి.
11. సుతప్తభవనం : ఇది ఎప్పుడూ కాలుతూ ఉండే నగరం.
12. రౌద్రం : ఇక్కడ అంతా రౌద్రంగానే కనిపిస్తుంది.
13. పయోవర్షణం : ఇక్కడ ఎప్పుడూ వర్షాలు కురుస్తూనే ఉంటాయి.
14. శీతాఢ్యం : ఈ నగరంలో చల్లదనం చాలా ఎక్కువగా ఉంటుంది.
15. బహుభీతి : ఈ నగరం భయాన్ని కలిగిస్తుంది.
17. ధర్మ భవనం : ఈనగరం పుణ్యాత్ములు మాత్రమే చేరతగింది..

ఈ నగరాలన్నీ యమపురికి ముందుగా ఉంటాయి. వీటిని దాటిన తరువాతే యమపురికి చేరుకోగలరు.

## యమ మార్గ వర్ణనం

★ యమలోకానికి వెళ్ళే దారిలో విశ్రమించటానికి గాని, కాస్త ఆయాసాన్ని తీర్చుకోవటానికి గానీ కనీసం ఒక చెట్టు కూడా ఉండదు.

★ ఆకలికి అలమటించి పోతుంటే ఏవిధమైన ఆహారపదార్ధం దొరకదు.

★ దారిలో దాహం వేస్తే తీర్చుకోవటానికి చుక్కనీరు కూడా దొరకదు.

★ యమమార్గంలో ప్రళయకాలంలో ప్రకాశించేవిధంగా పన్నెండు మంది సూర్యులు ప్రకాశిస్తుంటారు.

★ పాపాత్ములు ఆ మార్గంలో వెళ్ళేడప్పుడు కొన్ని ప్రాంతాలలో తీవ్రమైన చలిగాలులతో పీడించబడతారు

★ కొన్ని ప్రాంతాల్లో ముళ్ళు గుచ్చుకుంటాయి.

★ కొన్ని దారుల్లో పాములు మీదపడి కరుస్తాయి.

★ పాపాత్ములైన వాళ్ళని కొన్ని ప్రదేశాలలో సింహాలు పులులు, కుక్కలు మీదపడి కరుస్తాయి.

★ మరో ప్రాంతంలో లక్షలాది తేళ్ళు దాడిచేస్తాయి.

★ ఇంకో ప్రదేశంలో అగ్నిజ్వాలలు శరీరాన్ని దహిస్తాయి.

★ దారిలో కొంతదూరం వెళ్ళాక ఎంతో భయంకరమైన అసిపత్రవనం ఒకటుంటుంది. ఆ వనం రెండువేల ఆమడల విస్తీర్ణంతో ఉంటుంది.

★ అసిపత్రవనంలో కాకులు, గుడ్లగూబలు, గద్దలు, తేనెటీగలు, అడవిఈగలతో నిండి ఉంటుంది. అలాంటివనంలో నించి వెళ్ళే జీవుణ్ణి, ఆ కీటకాలన్నీ దారుణంగా కుట్టి బాధిస్తాయి.

★ యమమార్గంలో గాఢమైన అంధకారంతో నిండిన బావుల్లో పడిపోతుంటారు. మరోచోట ఎత్తైన పర్వతాల మీద నుంచి పడతారు. ఇంకోచోట కత్తులు మేకులు గుచ్చిన నేలమీద నడిచివెళ్ళాలి.

★ ఒకచోట జలగలతో నిండిన బురదలో నడవాలి.

★ యమమార్గంలో కొన్ని ప్రాంతాలు నిప్పులతో మండుతుంటాయి. మరికొన్ని ప్రాంతాలు పొగతో నిండి ఉంటాయి. పాపాత్ముడు ఈ నిప్పుల్ని, పొగని దాటి నడవాలి.

★ యమమార్గంలో నడిచేపాపాత్ములమీద దారిలో నిప్పుల వర్షం కురుస్తుంది. పిడుగులతో, రాళ్ళతో, నెత్తురుతో వర్షం ధారాపాతంగా మరికొన్ని ప్రదేశాల్లో కురిసి వారిని నానా బాధలకి గురిచేస్తుంది. ఒకచోట అతిచల్లని మంచువర్షం పడితే మరోచోట బాగా వేడినీళ్ళు ధారాపాతంగా వర్షిస్తాయి.

★ ఒకచోట ఎత్తైన పర్వతాలు ఎక్కాలి. మరోచోట లోతైన లోయల్లోకి దిగి నడవాలి. ఇంకోచోట పర్వతాల గుహల్లోంచి నడచిపోవాలి

★ భయంకరమైన ఆ గుహమార్గంలో ఒకచోట చీము నెత్తురుతో నిండిన పెద్దపెద్ద మడుగులుంటాయి. వాటిలోకి దిగి ఈదుకుంటూ ముందుకి సాగాలి.

## వైతరణీ నది

మార్గమధ్యవహాత్యుగ్రా ఘోరా వైతరణీనదీ ।
సాదృష్టా దుఃఖదాకితివాతాస్యా వార్తా భయావహా ॥
శతయోజన విస్తీర్ణా పూయ శోణితవాహినీ ।
అస్థిబృంద తటా దుర్గా మాంస శోణిత కర్దమా ॥

యమలోకానికి చేరే మార్గంలో అడ్డంగా ప్రవహిస్తూ ఎంతో లోతైనది, భయంకరమైనది అయిన 'వైతరణీ' అనే నది ప్రవహిస్తుంది. దానిపేరు వింటేనే భయం కలుగుతుంది. ఇక దాన్ని చూస్తే చెప్పేదేముంది. ఆ వైతరణీనది వంద ఆమడల వెడల్పుతో చీము నెత్తురు ప్రవాహంతో, మాంసం బురదతో, ఎముకల గుట్టలతో అత్యంత జుగుప్సాకరంగా వుండి భయాన్ని కలిగిస్తుంది.

ఎంతో లోతైన ఆ నది దాటటానికి అలవి కాకుండా ఉంటుంది. ఆ నదిలో అసంఖ్యాకమైన వెంట్రుకలు నాచులా ఉంటాయి. అందులో భయంకరమైన మొసళ్ళు సంచరిస్తూ ఉంటాయి. అలాంటి వైతరణీనది పాపాత్ములు తన దగ్గరకి రాగానే మంటలతో, పొగలతో ముందుకు దూసుకొస్తుంది. ఆనదీ తీరంలో సూదిమొనలాంటి ముక్కుతో, పొడిచి చంపే కాకులు, గ్రద్దలు విహరిస్తూ ఉంటాయి. అలాగే జీవుల్ని చీల్చి చెండాడే ఎన్నో నీటి జంతువులు

ఆనదిలో సంచరిస్తూ ఉంటాయి. ఎంతో ఘోరమైన పాపాలు చేసినవారు వైతరణీనదిలో పడి అమ్మో! అయ్యో! తండ్రీ! నాకెంత కష్టం వచ్చింది. నేనెలా తట్టుకోగలను. నావల్ల కావటంలేదు అని దారుణంగా విలపిస్తుంటారు.

★ వైతరణీనదిని చూడగానే పాపాత్ములు మూర్ఛవచ్చి పడిపోతారు. ఆకలిబాధకి తట్టుకోలేక ఆనదిలో ప్రవహించే రక్తాన్నే త్రాగుతారు.

★ ఆ నది, తేళ్ళతో, నల్లటి సర్పాలతో వ్యాపించి ఉంటుంది. ఆనదిలో పడ్డవాళ్ళని ఎవరూ రక్షించలేరు.

★ పాపాత్ములు వైతరణిలో పడి అందులోని సుడిగుండాల్లో చిక్కి పాతాళం దాకా వెళ్ళి మళ్ళా వెనక్కివస్తారు

★ గరుత్మంతా! ఆ నది కేవలం పాపాత్ముల కోసమే సృష్టించబడింది. దానికి అంతేలేదు.

★ ఈవిధంగా ఎన్నో కష్టాలు బాదలు పడుతూ ఎలాగో వైతరిణిని దాటుకుంటూ పాపాత్ములు ఎంతో దుఃఖాన్ని అనుభవిస్తూ యమలోకానికి వెళుతుంటారు.

★ కొంతమంది పాపాత్ముల్ని అంకుశాలతో గుచ్చుతూ, వీపు మీద పొడుస్తూ, తాళ్ళుకట్టి ఈడుస్తూ లాక్కుపోతారు.

★ మరికొంతమందిని ముక్కుచివర త్రాళ్ళు కట్టి, కొందర్ని చెవులకి తాళ్ళు కట్టి, యమపాశాలతో బంధించి ఇంకొందర్ని ఈడ్చుడుకుపోతారు.

★ యమభటులు కొందరు దుర్మార్గుల్ని కంఠానికి, చేతులకీ, పాదాలకీ సంకెళ్ళు వేసి ఈడ్చుకుపోతారు.

★ కొంతమంది యమదూతలు పాపాత్ముల్ని ముద్గరం అనే ఆయుధంతో కొట్టి నోటినుంచి రక్తం కక్కుకునేలా చేసి, తిరిగి ఆ రక్తాన్నే వారిచేత త్రాగిస్తారు.

★ ప్రాణులందరూ తాముచేసిన పాపకర్మల్ని తలుచుకుంటూ ఏడుస్తు ఎన్నో యాతనలు పడి యమలోకానికి వెళతారు.

# జీవుల పశ్చాత్తాపం

★ యమలోకానికి వెళ్ళే జీవులు దారిలో అయ్యో కుమారా! మనవడా! నాకెంత కష్టం వచ్చింది. ఎన్ని పాపాల్ని చేసాను. అని ఏడుస్తూ పశ్చాత్తాపపడతారు.

మహాతాపుణ్యయోగేనమానుషం జన్మలభ్యతే ।
తత్రాన్యన కృతో ధర్మః కీదృశం హి మయాకృతం ॥

ఎంతో గొప్పపుణ్యకర్మలు చేస్తే గానీ మానవ జన్మ లభించదు కదా! అంతటి గొప్ప మానవజన్మ నాకు లభించినప్పటికీ, ఏకొంచెమైనా ధర్మాన్ని చేయలేకపోయానే! నేనెంతపాపం చేసానో కదా! నాకింత కష్టం కలిగింది అని పశ్చాత్తాపపడతాడు.

★ నేనెప్పుడూ దాన ధర్మాలు చేయలేదు, హోమం జపం, తపం అన్నవి ఏనాడు ఆచరించలేదు. కనీసం పుణ్యక్షేత్రాలనైనా దర్శించలేదు. అందుకే నాకీ కర్మ పట్టింది. చేసిన కర్మ అనుభవించాలి కదా! అని విలపిస్తాడు.

★ మరొకడు నేను జీవితంలో ఏనాడూ బ్రాహ్మణుణ్ణి పూజించలేదు. గంగానదిలో స్నానం చేయలేదు. సత్పురుషుల్ని ఎప్పుడూ సేవించలేదు. పరోపకారమంటే ఏమిటో నాకు తెలీదు. అందుకే నాకీ బాధలు వచ్చాయని చింతిస్తాడు.

★ ఇంకొకడు అయ్యో! నేను జీవించి ఉన్నప్పుడు – మనుషులు పశువులు పక్షులు జంతువులు జీవించటం కోసం నీళ్ళు లేని ప్రదేశంలో చిన్న చెఱువుని కూడా త్రవ్వించలేదు. గోవుల కోసం, బ్రాహ్మణులకోసం ఏ కొంచెం ధనాన్ని కూడా వెచ్చించలేదు. కనుక నాకీ యమయాతన తప్పదు అని విలపిస్తాడు

★ ఒకడు నేను కనీసం ఏదో ఒక దానాన్ని కూడా చేయలేదే! కనీసం ఆవుకి ఒక్క రోజైనా మేత పెట్టలేదే! పుణ్యగ్రంథాలైన వేదాల్ని, శాస్త్రాల్ని కనీసం నమ్మనైనా నమ్మకపోతినే! పురాణాలు చెప్పేవారిని కనీసం గౌరవించలేదే!

కనుక ఓ జీవుడా నీకు చేసిన కర్మ అనుభవించక తప్పదు. అని తనని తాను నిందించుకుంటాడు.

**భార్యల పశ్చాత్తాపం :**

★ అయ్యో! నేను నా భర్త ఇష్టానుసారంగా ఓ ఒక్కరోజూ నడుచుకోలేదే! పతివ్రతా ధర్మాల్లో ఏ ఒక్కదాన్నీ ఆచరించలేదే! గురువులకి తగిన మర్యాద ఇవ్వలేదే! అందుకే నాకీ కష్టాలు ప్రాప్తించాయి. దీన్ని అనుభవించక తప్పదుకదా! అని వాపోతుంది ఒక పడతి

★ మరొక స్త్రీ, భర్తని సేవించటం పరమధర్మమని తెలిసికూడా నేనాపని చేయలేదు. నా భర్త మరణించినప్పుడు సహగమనం చేయలేకపోయాను. కనీసం విధవా ధర్మాన్ని కూడా సక్రమంగా పాటించలేదు. అందుకే నాకీ గతిపట్టింది. ఇదంతా నేను స్వయంగా చేసుకున్న పాపం అని విలపిస్తుంది.

ఈ విధంగా జీవుడు యమమార్గంలో ప్రయాణంచేస్తూ ఎన్నో బాధలు పడి దుఃఖిస్తూ తన పూర్వజన్మలో చేసిన పాపాల్ని తలుచుకుని వాటిని గురించే ఆలోచిస్తూ వేగంగా ముందుకి వెళతాడు. ఇలా పదిహేడు రోజులు ప్రయాణించి పద్దెనిమిదోరోజు నాటికి సౌమ్యం అనే పదహారు పట్టణాలలో మొదటి పట్టణానికి చేరుకుంటాడు.

**1. సౌమ్యనగరం :** సౌమ్యనగరం చంద్ర సంబంధమైనది. ఈ నగరంలో ఎంతో మంది ప్రేతల సమూహాలున్నాయి. అక్కడ పుష్పభద్ర అనేనది ప్రవహిస్తుంది. దాని పరిసరాల్లో విశాలమైన మర్రి చెట్లున్నాయి. యమలోకానికి జీవుల్ని తీసుకుపోయే యమభటులు ఆ నగరంలో వారిని కొద్దిసేపు విశ్రాంతి తీసుకోనిస్తారు. అప్పుడా ప్రేత శరీరుడు ఇంకా మోహాన్ని విడవకుండా "అయ్యో! నేను మరణించాక నా భార్య ఎలా ఉంటుందో? నా పిల్లలు ఏంచేస్తున్నారో? నేను సంపాదించిన ధనం క్షేమంగానే ఉందా!" ఇలా ఆలోచిస్తూ దుఃఖిస్తూ ఉంటారు. అదే సమయంలో యమభటులు వచ్చి, మూర్ఖులారా! మీ భార్యా బిడ్డలు ఇక్కడ ఎక్కడున్నారు? ఎందుకిలా

విలపిస్తున్నారు. వాళ్ళకి మీకు ఎప్పుడో సంబంధం తెగిపోయింది. “విశ్రమించింది చాలు ఇక బయలుదేరండి” అని కసిరి కొడతారు.

ప్రేత శరీరులు తమ పుత్రులు లేక మనమలు శ్రద్ధగా ‘మాసికం’ చేసి సమర్పించిన పిండాన్ని ఆ సౌమ్యనగరంలోనే భుజించి, అక్కణ్ణుంచి బయలుదేరి సౌరి నగరానికి వెళతారు.

**2. సౌరి నగరం :** ఇది సూర్యసంబంధమైనది. అక్కడ యమధర్మరాజుతో సమానుడైన ‘జంగముడు’ అనే పేరుగల రాజుఉన్నాడు. అతన్ని చూడగానే ప్రేతజీవుడికి ఎంతో భయం వేస్తుంది. అక్కడ కొద్దికాలం విశ్రాంతి తీసుకుని, నెలరోజులకి పైన నలభై అయిదురోజుల లోపు చేసే త్రైపక్షిక శ్రాద్ధంలో పెట్టిన పిండాల్ని భుజించి, అక్కణ్ణుంచి లేచి బయలుదేరుతాడు. దారిలో అతడికి భయంకరమైన వనాలు ఎదురౌతాయి. వాటి గుండా ఎన్నో కష్టాలు భరిస్తూ శైలేంద్ర నగరానికి చేరుకుంటాడు.

**3. నగేంద్ర భవనం :** కొండలమీద ఉండే ఈ నగరాన్ని చేరుకున్న ప్రేతశరీరుడు అక్కడే కొద్ది సేపు విశ్రమిస్తాడు. రెండు నెలల తరువాత ఆ నగరానికి చేరిన ప్రేతుడు, రెండో నెల మాసికంలో తన పుత్రులు పెట్టిన పిండాల్ని ఆరగించి సంతోషంగా ఉంటాడు. అంతలోనే తిరిగి యమభటులు అతన్ని పాశాలతో బంధించి ముందుకు తీసుకుపోతారు.

**4. గంధర్వ శైలం :** నగేంద్ర భవనం నుంచి బయల్దేరిన ప్రేతుడు యమభటుల ద్వారా తీసుకురాబడి గంధర్వనగరంలోకి ప్రవేశిస్తాడు. అక్కడు మూడో మాసికంలో తనకి ఇవ్వబడ్డ పిండాల్ని స్వీకరించి తిరిగి నడవటం మొదలుపెడతాడు.

**5. శైలాగమం :** నాలుగో మాసం నాటికి ప్రేతుడు శైలమాగమం అనే నగరానికి చేరుకుంటాడు. అక్కడ నాలుగో మాసికంలో తన పుత్రులు పెట్టిన పిండాల్ని, జలాన్ని గ్రహించి ఐదోమాసం వచ్చేసరికి క్రౌంచ పట్టణానికి చేరుకుంటాడు.

**6. క్రౌంచం :** క్రౌంచపట్టణం కొంగలకు నిలయం. ఆ పట్టణానికి చేరుకున్న ప్రేతుడు. అయిదో 'మాసికంలో' తన పుత్రులు పెట్టిన పిండాన్ని ఆరగిస్తాడు. కొద్దికాలం అక్కడ గడిపి క్రూరం అనే పట్టణానికి వెళతాడు.

**7. క్రూర పురం :** క్రూరపురానికి చేరిన ప్రేతుడు, ఐదునెలల పదిహేనురోజులు గడిచాక 'ఉన షాష్మాసికం' అనే శ్రాద్ధ క్రియలో ఇవ్వబడ్డ పిండాల్ని, జలాన్ని స్వీకరించి సంతృప్తి చెందుతాడు. అక్కడ కొన్ని ఘడియలు విశ్రాంతి తీసుకుని తరువాత యమభటులు లాక్కుపోగా ఎంతో విలపిస్తూ యమధర్మరాజు సోదరుడైన విచిత్రుడు పాలించే చిత్రభవనానికి చేరుకుంటాడు.

**8. చిత్రపురి–వైతరణీ నది :** ప్రేతుడు చిత్రపురిని చేరగానే మహాభయంకరంగా వున్న విచిత్రుడు దర్శనమిస్తాడు. ఆయన్ని చూసి భయపడి పారిపోవటానికి ప్రయత్నించే ప్రేతుడితో అక్కడున్న కొందరు పల్లెవాళ్ళు "ప్రేతుడా! ఇది చిత్రపురి. ఇదిగో ఇక్కడ వైతరణీనది ప్రవహిస్తోంది. దీన్ని నీవు దాటి ముందుకు సాగాలి. అదిగో అక్కడొక ఓడ ఉంది. అది పుణ్యాత్ములకి మాత్రమే. నీవేదైనా పుణ్యం చేస్తే చెప్పు నిన్నాఓడ ఎక్కిస్తాం. లేదంటే నీవీనదిని ఈదుకుంటూ వెళ్ళాల్సిందే" అని చెప్తారు.

దానం వితరణం ప్రోక్తం మునిభస్తత్వదర్శిభిః ।
ఇయం సాతీర్యతేయ స్మాత్తస్మాద్వైతరణీ స్మృతా ॥

తత్త్వాన్ని గ్రహించిన మునీశ్వరులు దానం చేయటాన్ని 'వితరణ' అని వ్యవహరించారు. అలాంటి వితరణ చేసిన వాళ్ళే ఈ వైతరణీ నదిని దాటటానికి సమర్థులు. అందుకే ఈ నదికి 'వైతరణీ' అనే పేరు వచ్చింది.

పల్లెవాళ్ళు తిరిగి ప్రేతుణ్ణి "జీవుడా! పోనీ నీవు జీవించిఉన్నప్పుడు కనీసం ఒక్క గోవునైనా దానం చేసావా! చేస్తే చెప్పు ఈ ఓడ మీద నిన్నెక్కించుకుని నదిదాటిస్తాం. అదీ చేయకపోతే నీకు ఓడ ఎక్కే అర్హత ఉండదు" అని అంటారు. అప్పుడా జీవుడు అయ్యో! నేనెంత అవివేకిని కనీసం దానం కూడా చేయలేదే! అందుకే కదా నాకీ దుఃస్థితి కలిగింది" అని విలపిస్తాడు.

పాపాత్ముడైన ప్రేతుడు ఇలా విలపిస్తున్నప్పటికీ యమకింకరులు జాలిచూపించకుండా అతన్ని ఎత్తి వైతరిణిలో పడేస్తారు. అలా నదిలో పడ్డ ప్రేతుడి ముఖానికి ఒక గొలుసుతో ఉన్న ఇనుప కొక్కేన్ని గుచ్చి చేపని లాక్కెళ్ళినట్టు అవతల ఒడ్డుకి లాక్కెళతారు. నది అవతలి తీరానికి చేరాక 'షాణ్మాసిక పిండాన్ని' పుత్రులు సమర్పించగా దాన్ని తిని ప్రేతుడు ఆకలి తీర్చుకుంటాడు.

**9. బహ్వాపదం :** వైతరణిని దాటి వచ్చిన ప్రేతుడు బహ్వాపద పట్టణాన్ని చేరుకుని అక్కడ కొద్ది ఘడియలు విశ్రాంతి తీసుకుంటాడు. ఆనగరంలో ఉన్నప్పుడు తన పుత్రులు ఏడోమాసికంలో సమర్పించిన పిండాల్ని భక్షిస్తాడు. అలా ఆ పట్టణం నుంచి బయలుదేరి ఏడుస్తూ ఆకాశమార్గంలో దుఃఖం అనే నగరానికి చేరుకుంటాడు

**10. దుఃఖ పురం :** దుఃఖపురంలో ప్రవేశించిన ప్రేతుడు ఎనిమిదో మాసికంలో తన వారసులు అందించిన పిండాల్ని తిని కడుపు నింపుకుంటాడు. తిరిగి తొమ్మిదో మాసం నాటికి ఆక్రందన పురానికి చేరతాడు.

**11. ఆక్రందన పురం :** ఇది ఎందరో ప్రేతల ఆక్రందనలతో హాహా కారాలతో నిండి ఉంటుంది. ఎంతోమంది దారుణంగా అలా విలపిస్తూంటే చూసి మతిచెడిపోయిన ప్రేతుడు, తాను కూడా దిక్కుతోచక వారితో పాటు హాహాకారాలు చేస్తాడు. అక్కడ తొమ్మిదో మాసికంలో పెట్టిన పిండాల్ని భక్షించి, ఎంతో కష్టంగా సుతప్తం అనే నగరానికి వెళతాడు.

**12. సుతప్తం :** ఈ నగరం పేరుకు తగ్గట్టే వేడిగా శరీరాన్ని కాల్చేసేలా ఉంటుంది. ఆ నగరాన్ని చేరిన ప్రేతుడు శరీరమంతా వేడెక్కిపోయి ఎంతో వేదన పడతాడు. పదోమాసంలో తనవారు ఇచ్చిన పిండాన్ని భక్షించి ఆకలితీర్చుకుంటాడు. అక్కడ వేడిని భరించి చేసేదేం లేక, తిరిగి బయలుదేరి రౌద్రపురానికి వస్తాడు.

**13. రౌద్ర పురం :** పేరుకి తగ్గట్టే ఈ పురం ఎంతో భయానకంగా ఉంటుంది. ఇక్కడికి పదకొండో మాసానికి ప్రేత జీవుడు చేరుకుంటాడు. ఈ పట్టణంలో ఎన్నో భయంకరమైన సంఘటనలు చూసి తీవ్రమైన దుఃఖాన్ని పొందుతాడు. ఇక్కడ వున్నప్పుడు ప్రేతుడు తన పుత్రులు 'పదకొండో మాసికంలో' పెట్టిన పిండాల్ని భుజించి మరో పదిహేనురోజులకి పయోవర్షం అనే నగరానికి చేరుకుంటాడు

**14. పయోవర్ష పురం :** పయోవర్షపురంలో ధారాపాతంగా వర్షం కురుస్తూనే వుంటుంది. ఆనగరాన్ని చేరిన ప్రేతుడు ఆ వర్షంలోనే తడుస్తు ఎన్నో బాధలు అనుభవిస్తాడు. అక్కడుండగా తన వారు, సంవత్సరం పూర్తికాకుండా చేసే 'న్యూనాబ్దికం' అనే శ్రాద్ధం ద్వారా ఇచ్చిన పిండాన్ని భక్షిస్తాడు. ఆ తరువాత సంవత్సరం పూర్తికాగానే శీతాఢ్యం అనే నగరానికి చేరుకుంటాడు.

**15. శీతాఢ్య పురం :** శీతాఢ్యం అత్యంత చల్లదనం కలిగిన ప్రదేశం. ఇక్కడ ఎప్పుడూ మంచు కురుస్తూనే ఉంటుంది. భయంకరమైన ఆ చలిలోకి ప్రవేశించిన ప్రేతుడు తీవ్రమైన చలిబాధలనుభవిస్తూ దారుణంగా విలపిస్తాడు. ఆ నగరంలో జీవుడలా బాధలు అనుభవిస్తూ సంవత్సరం పూర్తయిన తరువాత, పుత్రుడు సమర్పించే ఆబ్దిక పిండాన్ని భుజించి కొద్దిగా బలాన్ని పుంజుకుంటాడు

**16. మహాభీతి పురం :** సావత్సరిక శ్రాద్ధం ద్వారా కొంచెం శక్తి పొందిన ప్రేతజీవుడు యముడి పట్టణానికి దగ్గర్లో వున్న మహాభీతి పురానికి చేరుకుంటాడు. ఆ నగరంలో తనకి సంక్రమించిన ప్రేత శరీరాన్ని విడిచిపెట్టేస్తాడు. ఆ తరువాత బొటనవేలంత పరిమాణంతో వాయువుతో, సహా పదిహేడు తత్త్వాలతో కూడిన సూక్ష్మశరీరాన్ని జీవుడు పొందుతాడు. అయితే దానితో పాటు పూర్వజన్మలో చేసిన కర్మల ఫలితాల్ని అనుభవించటానికి, ఒక యాతనా శరీరాన్ని కూడా పొంది, యమభటులతో కలిసి ఆకాశమార్గంలో తిరుగుతుంటాడు.

జీవుడు మరణించాక తనవాళ్ళు తనకి పుణ్యలోకాలు ప్రాప్తించటం కోసం ఎలాంటి దాన ధర్మాలు చేయకపోతే, జీవుడుకి ఎలాంటి పుణ్యఫలితం రాదు. కాబట్టి యమ కింకరులు అతన్ని తాళ్ళతో బంధించి లాక్కుపోతారు.

గరుత్మంతా! అత్యంత భయంకరమైన యమ పురికి నాలుగు ద్వారాలుంటాయి. ఇప్పటి దాకా నేను నీకు చెప్పించి దక్షిణ మార్గం గురించే. ఈవిధంగా పాపాత్ములు యమమార్గంలో ఎన్ని రకాల కష్టాలు బాధలు అనుభవిస్తారో నీకు చెప్పాను. ఇంకా ఏది వినాలనుకుంటున్నావో అడుగు అన్నాడు శ్రీహరి. అప్పుడు గరుత్మంతుడు "ప్రభూ! పాపాత్ముడు యమలోకానికి వెళ్ళాక అక్కడ ఎలాంటి బాధలు అనుభవిస్తాడో తెలుసుకోవాలనుంది" అన్నాడు.

"గరుత్మంతా! యమలోకంలో ఉండే నరకాలు చాలా భీకరమైనవి. పాపులకి అక్కడ వేసే శిక్షలు వింటే భయంతో నీవళ్ళు జలదరిస్తుంది. అయినా నీవు అడిగావు కాబట్టి చెబుతున్నా విను"

బహుభీతి పట్టణం దాటి కొద్దిదూరం ముందుకి వస్తే అక్కడే యమధర్మరాజు నివసించే యమలోకం ఉంటుంది. ఈ రెండు నగరాలకీ మధ్యదూరం నలభై ఆమడలు. యమబాధలు అనుభవిస్తూ హాహాకారాలు చేసే జీవులు నివసించే ఆనగరాన్ని చూసి, పాపాత్ములు ఎంతోవిలపిస్తారు. వారి ఏడ్పులు విని ఆనగరంలో ఉన్న యమభటులు దక్షిణ ద్వారపాలకుడైన 'ధర్మధ్వజుడనే' వారికి వచ్చిన పాపుల గురించి తెలియచేస్తారు. అప్పుడా ధర్మధ్వజుడు పాపులు చేసిన సుకృత దుష్కృత్యాలన్నీ వెళ్ళి చిత్రగుప్తుడికి నివేదించగా, వచ్చిన పాపి సంపూర్ణ వృత్తాంతాన్నంతా ఆ చిత్రగుప్తుడు యమధర్మరాజుకి వివరిస్తాడు.

ఈవిధంగా పాపికి సంబంధించిన పాపపుణ్యాల వివరాలు యమ ధర్మరాజుకి సంపూర్ణంగా తెలిసినప్పటికీ ఆచారాన్ని అనుసరించి, పాపిగురించిన సమాచారాన్ని చెప్పమని చిత్రగుప్తుణ్ణి కోరతాడు. చిత్రగుప్తుడు కూడా తనకి సంపూర్ణ సమాచారం తెలిసినప్పటికీ 'శ్రవణులు' అనేవారిని పిలిచి జీవుల పాపపుణ్యాల విశేషాలు చెప్పమని కోరతాడు.

అసలు శ్రవణులు అనే వారు ఎవరంటే! వారు బ్రహ్మదేవుడి కుమారులు. స్వర్గ, మర్త్య, పాతాళాలనే త్రిలోకాలలో సంచరించేవాళ్ళు. భూత భవిష్యత్ వర్తమాన కాలాల్లో జరిగే అన్ని విషయాలు తెలుసుకోగలిగే జ్ఞానం వారి కుంటుంది. వారిలాగానే వారి భార్యలకి కూడా శ్రవణకులకున్న శక్తి సామర్థ్యాలుంటాయి. స్త్రీలకి సంబంధించిన సమస్త సమాచారాన్ని, గ్రహించగలిగే సామర్థ్యం కలిగిన వారు శ్రవణకుల భార్యలు.

ఈవిధంగా శ్రవణకులు, వారి భార్యలు భూలోకంలో స్త్రీలు, పురుషులు చేసే రహస్య విషయాలూ పాపపుణ్యాలు తెలుసుకుని ఆ సమాచారాన్నంతా చిత్రగుప్తుడికి నివేదిస్తారు. గరుత్మంతా! ఈ శ్రవణకులతో పాటు మానవులు చేసే సమస్త పాపపుణ్యకర్మల్ని మరో పదహారు మంది నిత్యం గమనిస్తూ ఉంటారు. వారెవరంటే!

అదిత్య చంద్రాపనిలో నలశ్చద్యౌర్భూమి రాపోహృదయం యమశ్చ ।
అహశ్చ రాత్రిశ్చ ఉభేచ సంధ్యే ధర్మస్యజానాతి నరస్య వృత్తం ॥

1.సూర్యుడు 2.చంద్రుడు 3.పగలు 4.రాత్రి 5.అగ్ని 6.ఆకాశం 7.భూమి 8.జలం 9.ఆత్మ 10.యమధర్మరాజు 11.పగలు 12.రాత్రి 13.ఉదయం 14.సాయంత్రం 15.ఉభయ సంధ్యలు 16.ధర్మం ఇవన్నీ మానవులు చేసే సుకృత దుష్కృత్యాలన్నిటినీ పరిశీలిస్తాయి. ఇలా యమ ధర్మరాజు చిత్రగుప్తుడు, శ్రవణులతో పాటు సూర్యాది ఇతరులు కూడా తమ తమ స్థానాల్లో ఉండి అన్నీ చూస్తుంటారు.

## యమ ధర్మరాజు స్వరూపం

యమధర్మరాజు వీరందరి ద్వారా పాపుల ప్రవర్తనని విచారించి, ఆపాపులకి ముందుగా అత్యంత భయంకరమైన తన స్వరూపాన్ని చూపిస్తాడు.

పాపిష్ఠాస్తే ప్రనశ్యంతి యమరూపం భయంకరం ।
దండహస్తం మహాకాయం మహిషోపరి సంస్థితం ॥

ప్రళయాంబుద నిర్ఘోషం కజ్జలాచల సన్నిభం ।
విద్యుత్ప్రభాయుదై ర్భీమం ద్వాత్రింశద్భుజ సంయుతం ॥
యోజనత్రయ విస్తారం వాపీతుల్య విలోచనం ।
దంష్ట్రా కరాళవదనం రక్తాక్షం దీర్ఘనాసికం ॥

పెద్ద దండాన్ని చేతిలో ధరించినవాడు, భారీశరీరం కలిగినవాడు, దున్నపోతు వాహనం మీద కూర్చున్న వాడు, ప్రళయకాలం లాంటి మేఘంతో సమానంగా గర్జించేవాడు, నల్లటి కాటుక పర్వతంలాంటి రంగుతో ప్రకాశించేవాడు, మెరుపుతీగలా తళుక్కుమనే ఆయుధాలతో కూడినవాడు, ముప్పైరెండు చేతులతో, మూడు ఆమడల పొడవుగా ఉండేవాడు. దిగుడు బావిలాంటి కళ్ళతో, భయంకరమైన కోరలతో, పొడవైన ముక్కుతో వెలుగొందేవాడు, ఇలాంటి భయంకర స్వరూపంతో ఉన్న యమధర్మరాజుని చూసి పాపాత్ములు భయంతో వణికిపోతారు

గరుత్మంతా! ఇక చిత్రగుప్తుడు కూడా మృత్యువు, జ్వరం లాంటి వాటితో కలిసి అత్యంత భయంకరంగా కనిపిస్తాడు. అలాగే యముడి చుట్టూ వుండే యమకింకరులు కూడా యముడిలాగానే కోరలతో భయాన్ని కలిగిస్తూ ఉంటారు. ఏమాత్రం ధర్మకార్యక్రమాలు చేయని పాపాత్ములు యమధర్మరాజుని చూసి భయంతో వణికిపోతూ ఉంటారు. అయ్యో! మాకెంత కష్టం వచ్చింది? అని విలపిస్తూంటారు

**చిత్రగుప్తుడి పలుకులు :** యమధర్మరాజు ఆజ్ఞని అనుసరించి తమ తమ పాపాల్ని తలుచుకుని ఏడుస్తున్న పాపులతో చిత్రగుప్తుడు ఇలా అంటాడు

పాపులారా! మీరంతా అయోగ్యులై, దురహంకారంతో ఎందుకిన్ని పాపాలు చేసారు? తోటివారు మంచిని బోధిస్తున్నా వినకుండా అజ్ఞానంతో ఇన్ని అధర్మకార్యాలు ఏ ప్రయోజనం కోసం చేసారు? జ్ఞాన శూన్యులారా! దుర్మార్గుల సాహచర్యంతో కామక్రోధాది దుర్గుణాలకి లోనైన మీరు ఇలా పాపాల మీద పాపాలు చేసారు కాబట్టే ఈనాడు మీకీ నకరం ప్రాప్తించింది.

నరులారా! ఎంత ఆనందంగా మీరానాడు పాపాలు, ఘోరాలు చేసారో! అదేవిధంగా మీరీనాడు నరకాన్ని కూడా అనుభవించాలి. ఇక్కణ్ణుంచి తప్పించుకుని మీరెక్కడికీ పోలేరు

మూర్ఖేపి పండితే వాపి దరిద్రేవా శ్రియాన్వితే ।
సబలే నిర్బలే వాపి సమవర్తీ యమ స్మృతః ॥

ఓ పాపులారా! సరిగ్గా వినండి. పండితుడి మీద, పామరుడి మీదా, బలవంతుడి మీదా, బలహీనుడి మీదా, యమధర్మరాజు సమభావంతో ఉంటాడు. ఆయనకెలాంటి పక్షపాతబుద్ధీ లేదు. మీరీ దుఃఖాన్ని పొందటానికి కారణం మీరు చేసిన పాపపు పనులేగానీ, యమధర్మరాజు తప్పేమీ లేదని గ్రహించండి”

ఈవిధంగా చిత్రగుప్తుడు పలికిన మాటలు విని అక్కడికొచ్చిన పాపాత్ములంతా ఏమీ మాట్లాడక ఊరుకున్నారు.

## యమబాధలు నరకంలోని శిక్షలు

గరుత్మంతా! చిత్రగుప్తుడు పాపుల చరిత్రని చెబుతూ ఉంటే యమధర్మరాజు వారు చేసిన పాపాలకి తగిన శిక్షలు విధిస్తూ ఉంటాడు. ఆయన ఆజ్ఞ ప్రకారం శిక్షపడ్డ పాపుల్ని యమదూతలు తన్నుకుంటూ ఆయా శిక్షల్ని అనుభవింప చేయటానికి తీసుకుపోతుంటారు. ఇలా పాపుల్ని నరకాలికి తీసుకుపోయేదారిలో అగ్ని హోత్రంలా వుండే ఒక విశాలమైన వృక్షంవుంది. యమభటులు పాపుల్ని ఆ చెట్టుకి తలక్రిందులుగా వేలాడదీస్తారు. ఆ చెటుకున్న మంటల వేడి భరించలేక పాపులు హాహాకారాలు చేస్తూ దారుణంగా విలపిస్తారు. విశేషంగా పాపాలు చేసిన వాళ్ళని, అక్కడే ఉన్న బూరుగ చెట్టుకి కట్టి కొరడాలతో కొడతారు. ఆదెబ్బలు తట్టుకోలేక “యమదూతలారా! మీకు దండంపెడతాం మమ్మల్ని వదిలేయండి. మేమీ బాధలు పడలేం” అని దీనంగా వేడుకుంటారు.

**యమదూతల మాటలు :** గరుత్మంతా! యమదూతలకి ఎలాంటి దయాదాక్షిణ్యాలూ ఉండవు. కొందరు పాపాత్ముల్ని ఇనుప చువ్వలతో సమ్మెటలతో, ఈటెలతో, గదలతో, రోకళ్ళతో మాటిమాటికీ కొడుతూ ఉంటారు.

ఇలా కొట్టగా కొట్టగా స్పృహ తప్పిపడిపోయిన పాపుల్ని చూసి "దుర్మార్గులారా! జీవించినంతకాలం ఎవ్వరికీ నీళ్ళని గానీ, ఆకలేసిన వాడికి అన్నంగానీ పెట్టలేకపోయారు. కనీసం వైశ్వదేవ కర్మని కూడా (దేవతా బలి) ఇవ్వలేదు. జీవితంలో ఒక్కసారైనా యమధర్మరాజు గురించిగానీ, భయపడి చిత్రగుప్తులవారి గురించిగానీ దానం కూడా చేయలేకపోయారు. నరకబాధల్ని తొలగించేవారి నామాన్ని కూడా జపించలేదు.

దురాత్ములారా! జీవితంలో ఒక్క పుణ్యక్షేత్రాన్ని కూడా దర్శించలేదు. ఏ దేవతల్ని పూజించలేదు. గృహస్థాశ్రమంలో ఉండి అందరికీ సేవచేయాల్సింది పోయి, కనీసం అతిథుల్ని కూడాఆదరించలేదు. సత్పురుషుల్ని చూసికూడా వారిని గౌరవించలేదు. కనుక మీరీనాడు బాధలనుభవిస్తున్నారు. మీరేమాత్రం ధర్మకార్యాలు చేయలేదు కాబట్టే మాచేత దారుణంగా దండించబడుతున్నారు. ఒక్క యమధర్మరాజు మాత్రమే పాపుల్ని క్షమించగలడు. మేము మాత్రం ఆయన ఆజ్ఞ ప్రకారం శిక్షల్ని అమలు చేస్తుంటాం"

ఈవిధంగా యమదూతలు పలికి, ఎలాంటి జాలిచూపకుండా పాపులు కాస్త స్పృహనుంచి కోలుకోగానే తిరిగి తన్నటం ప్రారంభించారు.

★ కొందరు పాపుల్ని కత్తుల్లాంటి ఆకులు తిరిగుతున్న యంత్రాలమీద పడేసారు.

★ కొందర్ని యమదూతలు ముఖాన్ని తాళ్ళతో కట్టి ముద్గరం అనే ఆయుధంతో పాపుల్ని కొడతారు.

★ ఇంకొందరు పాపాత్ముల్ని కొయ్యని కోసినట్టు రంపంతో కోస్తారు. మరికొందర్ని గొడ్డళ్ళతో చెట్టుని నరికినట్టు నరుకుతారు.

★ గొయ్యితీసి అందులో తలదాకా పాతేసి, వారితలలమీద బాణాలతో కొడతారు. కొందర్ని గానుగలో వేసి చెరుకుగడలాగా పిప్పిచేస్తారు.

★ బాగా నిప్పులతో నిండిన కొలిమిలో వేసి ఇనుపముద్దని కాల్చినట్టు కాలుస్తారు.

★ కొందరు దుర్మార్గుల్ని బూరెల మూకుడులో వేసి వేయిస్తారు.

★ సలసలా కాగే నూనెలో ముంచి తేలుస్తారు.

★ కొందర్ని ఏనుగులు నడిచేదారిలో పడేస్తారు.

★ కొందర్ని తలకిందులుగా వ్రేలాడదీసి క్రింద నిప్పుల కుంపటి పెడతారు.

★ కొందరు దుర్మార్గుల్ని నూతిలో, కొందర్ని ఎత్తైన పర్వతాలమీద నుంచి తోసేస్తారు. మరికొందర్ని విషపురుగులతో నిండిన గోతిలోకి పడేస్తారు. పురుగులతో ఇంకొందర్ని బాగా కుట్టిస్తారు.

★ కొందరు పాపాత్ముల్ని వజ్రాల్లాంటి గోళ్ళున్న కాకులు గ్రద్ధలు సంచరించే ప్రాంతంలో వదిలేస్తారు. అక్కడున్న కాకులు, గ్రద్ధలు భయంకరమైన తమ గోళ్ళతో పాపుల కళ్ళుపొడిచేసి శరీరాన్నంతా ఛిన్నాభిన్నం చేసేస్తాయి.

ఈవిధంగా యమదూతలు పాపుల్ని యమయాతనలకి గురిచేసి యముడి ఆజ్ఞప్రకారం వారిని ఈడ్చుకుపోయి 'తామిస్రం' అనే నరకంలో పడేస్తారు.

## వివిధ రకాల నరకాలు

గరుత్మంతుడా! యమలోకంలో వివిధరకాల పాపాలు చేసినవాళ్ళని శిక్షించటానికి మొత్తం నాలుగు లక్షల నరకాలున్నాయి. వాటన్నిటినీ చెప్పటం సాధ్యంకాదు. కనుక అందులో ముఖ్యమైన ఇరవై ఒక్క నరకాల గురించి చెబుతాను.

తామిస్రో లోహశంకుశ్చ మహారౌరవ శాల్మలీ ।
రౌరవః కుట్మలః కాలసూత్రకః పూతి మృత్తికః ॥
సంఘాతో లోహితో దశ్చన విష స్సంప్రతాపనః ।
మహానిరయ కాకోలే సంజీవన మహౌషధే ॥
అవీచి రంధతామిస్రః కుంభీపాక స్తథైవ చ ।
సంప్రతాపన నామైక స్తపనః ఏకవింశతిః ॥

1. తామిస్ర నరకం – బాగా చీకటిగా ఉండేది.
2. లోహశంకువు – ఇనుప మేకులతో ఉండేది.
3. మహారౌరవం – ఎంతో దుఃఖాన్ని కలిగించేది.

4. శాల్మలి - బూరుగు వృక్షాలతో నిండివుండేది.
5. రౌరవం - సామాన్యమైన దుఃఖంతో వుండేది.
6. కుట్మలం - బాగా సూదిమొనలాంటి మొగ్గలు కలిగింది.
7. కాలసూత్రం - ఇనుప పాశాలతో కూడుకుని ఉన్నది.
8. పూతి, మృత్తికం - చీము కలిసిన మట్టితో ఉంటుంది.
9. సంఘాతం - సకల జంతువులూ సంచరించేది.
10. లోహితోదం - రక్తంలాంటి నీళ్ళతో ఉంటుంది.
11. సవిషం - భయంకరమైన విషాలతో ఉంటుంది.
12. సంప్రతాపనం - బాగా తాపాన్ని (వేడిని) కలిగిస్తుంది.
13. మహా నిరయం - ఎన్నో బాధల్ని కలిగిస్తుంది.
14. కాకోలం - భయంకరంగా పొడిచే కాకులతో ఉండేది.
15. సంజీవనం - పాపులకి కొద్దిపాటి శిక్షలు మాత్రమే విధించేది.
16. మహాపథం - చాలాదూరం వ్యాపించిన నరకం.
17. అవీచి - ఎలాంటి తరంగాలు లేనిది నీళ్ళతో ఉండేది.
18. అంధతామిస్రం - భయంకరమైన చీకటి కలిగింది.
19. కుంభీపాకం - కడవల్లో పాపుల్ని ఉంచి వండబడేది.
20. సంప్రతాపనం - పాపుల్ని బాగా కాల్చేసే నరకం.
21. తపనం - కోటిసూర్యుల వేడితో పాపుల్ని దహించే నరకం.

ఈ ఇరవై ఒక్క ప్రధాన నరకాలు పాపుల్ని శిక్షించే యమకింకరులతో నిండి వుంటాయి. తమ తమ పాపాలకి తగ్గ శిక్షల్ని పొందిన పాపులు ఈ నరకాల్లో పడి కల్పాంతం దాకా శిక్షలనుభవిస్తూ ఉంటారు.

భూలోకంలో జీవించి ఉన్నప్పుడు కేవలం తన స్వార్థాన్నే చూసుకుంటూ జీవించేవారు. పరోపకారం అన్నది ఏ మాత్రం చేయనివారు లోకంలో అందర్నీ తమ సుఖం కోసం కష్టపెట్టేవారు మరణించాక యమలోకాన్ని చేరి తామిస్రం అనే నరకాన్ని పొందుతారు.

కేవలేహ్యా ధర్మేణ కుటుంబ భరణోత్సుకః ।
యాతి జీవోంధతామిస్రం చరమంత మనః పదం ॥

గరుత్మంతా! లోకంలో మానవుడు తన సంసారాన్ని పోషించుకోవటం అతడి ధర్మం. అయితే అందుకోసం అక్షయమార్గాల్ని అవలంబించి తద్వారా తన సంసారాన్ని వృద్ధి చేయాలనుకోవటం పాపం. అలాంటి పాపాలు చేసినవాళ్ళు 'అంధతామిస్రం' అనే నరకానికి చేరుతున్నారు. లోకంలో ఇలాంటి వారి సంఖ్యే అధికం.

## నరకాన్ని కలిగించే పాపాలు

గరుత్మంతుడు 'పురుషోత్తమా! మానవులు ఎలాంటి పాపాలు చేస్తే నరకానికి వెళతారు? ఎలాంటి పాపాల వల్ల భయంకరమైన వైతరణీనదిలో పడిపోతారు? దయచేసి చెప్పు ప్రభూ" అని అడగగా, శ్రీహరి ఇలా చెప్పటం ప్రారంభించాడు.

సదైవాకర్మ నిరతా శ్శుభకర్మ పరాఙ్ముఖాః ।
నరకాన్నకరం యాంతి దుఃఖాద్దుఖం భయాద్భయం ॥

గరుత్మంతా! ఎప్పుడూ పుణ్యకర్మల్ని ఆచరించకుండా పాపకర్మల్నే ఆచరించేవారు, నరకం నుంచి మరో నరకానికీ, దుఃఖం నుంచి మరో దుఃఖానికీ, చేరుకుంటారు భయం నుంచి మరో భయాన్ని పొందుతారు.

యమధర్మరాజు నగరానికి నాలుగువైపులా నాలుగు ద్వారాలుంటాయి. వాటిలో దక్షిణ ద్వారం నుంచి పాపాత్ములు ప్రవేశించగా, మిగిలిన మూడు ద్వారాల నుంచి పుణ్యాలు చేసిన వారు మాత్రమే ప్రవేశిస్తారు. మహా భయంకరమైన వైతరణీనది దక్షిణ మార్గంలో ఉంది. ఆ నది ఉన్న మార్గంలో ఎవరు వెళతారో చెబుతున్నా విను –

## యమ మార్గంలోకి ప్రవేశించే పాపాత్ములు

★ బ్రాహ్మణుల్ని చంపినవారు, కల్లు త్రాగేవారు, శిశువుల్ని స్త్రీలని చంపేవారు, గర్భస్రావం చేయించుకున్నవారు.

★ గురుధనాన్ని దైవధనాన్ని, విప్రుల ధనాన్ని, స్త్రీల, బాలుర ధనాన్ని అపహరించేవారు.

★ ధనాన్ని అప్పుతీసుకుని తిరిగి చెల్లించనివారు, దాచమని ఉంచిన ద్రవ్యాన్ని అపహరించేవారు, నమ్మిన వారిని మోసగించేవారు, అన్నంలో విషం పెట్టి చంపేవారు.

★ దోషాలనే చూస్తు ఎప్పుడూ మంచి గుణాలని ప్రశంసించని వారు, మంచివారికి సహాయం చేయనివారు, హీనమైన వారిని సేవించేవారు, సత్పురుషులు సావాసం చేయనివారు.

★ పుణ్యక్షేత్రాలని సత్పురుషుల్ని, గురువుల్ని, దేవతల్ని, పురాణాలని, వేదాలని, వేదాంతశాస్త్రాలని నిందించేవారు.

★ ఇతరుల దుఃఖిస్తుంటే తాము సంతోషించేవారు. సంతోషంతో కాలం గడిపేవారికి దుఃఖాన్ని కలిగించేవారు. చెడ్డ మాటల్నే ఎప్పుడూ పలికేవారు దుష్టచింతనతోనే జీవించేవారు

★ మంచిమాటల్ని విననివారు, శాస్త్రాలని అభ్యసించనివారు, తమని తామే గొప్పవారుగా పొగడుకునేవారు, మందబుద్ధి కలిగినవారు, 'నేనే పండితుడనని' అహంకరించేవారు

★ గరుత్మంతా! ఇలాంటి పాపాలు చేసిన వారందరూ తాము చేసిన పాపాల్ని తలుచుకుని రాత్రి పగలూ ఏడుస్తూ యమలోకమార్గంలో వెళుతుంటారు. ఇక వైతరణీనదిలో పడే పాపాత్ములు గురించి చెబుతాను.

## వైతరణీ నదిలో పడే పాపాత్ములు

★ తల్లిని, తండ్రిని, గురువుని, ఆచార్యుణ్ణి, పూజ్యుల్ని తిరస్కారభావంతో చూసేవాడు.

★ పతివ్రత, వినయశీలం కలిగింది. మంచికులంలో పుట్టింది, అయిన స్త్రీని విడిచిపెట్టినవాడు.

★ సత్పురుషుల్లో ఎన్నో మంచిగుణాలున్నప్పటికీ వారిలో ఉండే దోషాలనే ఆక్షేపిస్తూ జీవించేవారు.

★ బ్రాహ్మణులకి దానం ఇస్తానని చెప్పి ఇవ్వనివాడు, ఇస్తానని పిలిచి ఇవ్వకుండా అవమానపరిచి పంపేవాడు ఇచ్చిన దానాన్ని తిరిగి తీసుకునేవాడు.

★ దానంచేసిన తరువాత అయ్యో! ఎందుకు అనవసరంగా దానం చేశానా! అని బాధపడేవాళ్ళు. ఇతరుల వృత్తుల్ని అపహరించేవారు, ఎవరైనా ఎవరికైనా దానం చేస్తుంటే వద్దని వారించేవారు, వైతరణీ నదిలో పడతారు.

★ యజ్ఞాలు చేసేవారికి ఆటంకాలు కలిగించేవాళ్ళు, విష్ణుకథలు చెబుతుంటే వద్దనేవాళ్ళు, భూములు సరిహద్దుల్ని చెడగొట్టేవాళ్ళు, ఆవులు మేసే భూమిని దున్నేసేవాళ్ళు.

★ రసాన్ని విక్రయించేవాళ్ళు, వృషలీ స్త్రీని, (వివాహంకాకుండా రజస్వల అయిన స్త్రీని –లేక శూద్రస్త్రీని) పెళ్ళి చేసుకున్నవాడు, వేదాల్లో చెప్పిన యజ్ఞయాగాది క్రతువులు కోసం కాకుండా కేవలం తాను భుజించటానికే పశువుల్ని చంపేవాడు.

★ వేదోక్తమై శ్రోత్రియ కర్మల్ని ఆచరించనివాడు, మాంసాన్ని తిన్నవాడు, కల్లుత్రాగినవాడు, స్వేచ్ఛగా పరస్త్రీలతో సంచరించేవాడు.

★ వేదశాస్త్రాధ్యయనాన్ని విడిచిపెట్టినవాడు, శూద్రుడైవుండి వేదాభ్యాసం చేసేవాడు, కపిలగోవు పాలు త్రాగేవాడు, యజ్ఞోపవీతాన్ని దొంగతనంగా ధరించి, బ్రాహ్మణస్త్రీని వివాహం చేసుకున్నవాడు.

★ రాజుల భార్యలమీద, ఇతరుల భార్యలమీద దురాశ కలిగినవాడు, రజస్వలకాని స్త్రీల మీద కామవాంఛ కలిగినవాడు, పతివ్రతల్ని చెడగొట్టాలని చూసేవాడు.

★ చేయకూడని పనులు చేసేవాళ్ళు, చేయాల్సిన పవిత్రమైన కార్యాల్ని చేయకుండా విడిచిపెట్టేవాళ్ళు, జ్ఞానశూన్యులై అకార్యాలు చేసేవాళ్ళు...

గరుత్మంతా! ఈవిధంగా వివిధ రకాల పాపాలుచేసినా వాళ్ళందరూ ఘోరమైన వైతరణీ నదిలో పడతారు. అన్ని రకాల పాపాలలో ఇరవై ఒక్కపాపాలు మానవుల్ని బాగా పీడిస్తాయి. అవిఎంతో బాధకలిగించే నరకానికి చేరుస్తాయి. ఇక నీకు నరకబాధల్ని కలిగించే భయంకరమైన పాపాల గురించి చెబుతున్నా విను –

## నరక బాధలు కలిగించే పాపాలు

★ అబద్దపు సాక్ష్యాలు చెప్పేవారు, వేదాల ద్వారా నిందించబడ్డ కర్మల్ని ఆచరించేవారు, ఇతరుల్ని మోసం చేసి సంపాదించేవారు, దొంగతనాన్ని సంపాదనా మార్గంగా వాడుకునేవారు.

★ ఉద్యానవనంలో అందంగా ఏపుగా పెరిగిన వృక్షాల్ని అకారణంగా నరికి వేసేవారు, వ్రతాలు, పుణ్యక్షేత్ర సందర్శనలుచేయని విధవా స్త్రీలు.

★ భర్తని దూషించి, పరపురుషుడి మీద ప్రేమాభిమానాలు కలిగిన స్త్రీలు, భగవంతుడు లేడని చెప్పే పాపాత్ములు, పెద్దలు చెప్పిన ఆచారాలు పాటించనివాళ్ళు.

నాస్తికా భిన్నమర్యాదా కదర్యా విషయాత్మకాః ।
డాంభికాశ్చ కృతఘ్నాశ్చ తేవై నరక గామివః ॥

★ అతిథుల్ని ఆదరించని వాళ్ళు, విషయసుఖాల మీద తీవ్రమైన వాంఛ కలిగినవాళ్ళు. డాంబికం కోసం జపతపాలుచేసేవాళ్ళు, చేసిన మేలు మరిచిపోయేవాళ్ళు.

★ నూతులు, దిగుడుబావులు, మంచినీటి చెరువుల్ని పూడ్చివేసేవాళ్ళు, దేవాలయాల్ని, మనుషులు నివసించే ఇళ్ళని అకారణంగా కూల్చేసే వాళ్ళు, భార్యా పిల్లల్ని సేవకుల్ని గురువుల్ని విడిచిపెట్టేవాళ్ళు

★ దేవతలు, పితృదేవతలు గురించి వైశ్వదేవాది కర్మల్ని ఆచరించకుండా భుజించేవాళ్ళు, అందరూ నడిచేదారిలో మేకులు కొట్టి నడవకుండా ఆటంకపరిచేవాళ్ళు

శివం శివాం హరిం సూర్యం గణేశం సద్గురుం బుధం ।
న పూజయంతి యే మందాస్తే వైనరక గామినః ॥

శంకరుణ్ణి, పార్వతీదేవిని, శ్రీహరిని, సూర్యుణ్ణి, గణపతిని, ఇతర దేవుళ్ళని, గురువుని, విద్వాంసుణ్ణి పూజించనివాళ్ళు నరకానికి పోతారు.

★ దాసీ స్త్రీతో సంభోగం చేసిన విప్రుడు, శూద్ర స్త్రీ ద్వారా సంతానం పొందిన విప్రుడు, నమస్కారానికి కూడా అర్హుడు కాడు.

★ బ్రాహ్మణులు గోవులు పోట్లాడుకుంటే చూసి, వాటిని విడదీయకుండా, చూస్తూ ఆనందించేవాళ్ళు.

★ తమనే నమ్ముకున్న పతివ్రతల్ని అవమానించేవాళ్ళు.

★ స్త్రీల ఋతుకాలంలో సంభోగించేవాళ్ళు

★ భార్య రజస్వల అయినప్పుడు, వర్షాకాలంలో, పగటిపూట, శ్రాద్ధం పెట్టే రోజుల్లో సంభోగించేవాళ్ళు.

★ శస్త్రాల్ని, బాణాల్ని ధరించినవాళ్ళు, వాటిని అమ్మేవాళ్ళు.

★ దిక్కులేని దీనుల్ని కాపాడని వాళ్ళు, ఉత్తమ పురుషుల్ని ద్వేషించేవాళ్ళు, నేరం చేయకపోయినప్పటికీ ఇతరుల్ని దండించేవాళ్ళు.

★ బ్రాహ్మణుడు, ఆకలితో బాధపడుతుంటే తెలిసికూడా దానం చేయనివాడు.

★ సకలభూతాలమీదా విశ్వాసం లేనివాడు, దయలేనివాడు కుటిలస్వభావంతో నడిచేవాడు.

నియమాస్సముపాదాయతే పశ్చాద జితేంద్రియాః ।
విలోపయంతి తాన్మోహయాస్తే వై నరకగామినః ॥

గరుత్మంతా కొన్ని విషయాల్ని నిష్ఠల్ని ఖచ్చితంగా పాటిస్తానని భీషణ ప్రతిజ్ఞచేసి, కొన్ని రోజుల పాటు ఆ నియమాల్ని పాటించి, తరువాత ఇంద్రియ నిగ్రహాన్ని కోల్పోయి, ఆ నియమాలన్నిటినీ వదిలేసేవాడు నరకానికి వెళతాడు.

★ ఆత్మజ్ఞానాన్ని ఉపదేశించే గురువుని, పురాణాలు ప్రవచనం చేసే పౌరాణికుణ్ణి గౌరవించనివాళ్ళు.

★ స్నేహితుల్ని వంచించేవాళ్ళు, వారికి ద్రోహం చేసేవాళ్ళు.

★ వివాహకార్యక్రమానికి విఘ్నాలు కలిగించేవాళ్ళు, తీర్ధయాత్రలు చేసేవాళ్ళకి ఆటంకాలు కలిగించేవాళ్ళు.

★ ఇళ్ళని, గ్రామాలని, ఉద్యానవనాలని కక్షలతో తగలబెట్టేవాళ్ళు.

ఈ విధంగా పాపాలు చేసిన పతితుల్ని యమకింకరులు నరకానికి తీసుకుపోయి దారుణంగా చిత్రవధలు చేస్తారు. పెద్ద అగ్నిగుండంలో పడేసి కాలుస్తారు. కొద్దిసేపటికి బైటికి తెచ్చి ఇనుపకత్తులతో నిండిపోయిన అసితపత్ర వనంలోకి విసిరేస్తారు. ఆవనంలో పడ్డ పాపులు కత్తులతో తీవ్రమైన గాయాల పాలవుతారు. అలా ఘోరమైన శిక్ష అనుభవించిన పాపుల్ని పైకి తీసుకొచ్చి కొద్దిసేపు విశ్రాంతి తీసుకోనిస్తారు. ఆ పాపిదాహం వేసి నీళ్ళు అడిగినప్పుడు బాగా కాచిన వేడివేడి నూనెని తెచ్చి తాగమని నోట్లో పోస్తారు. ఆనూనె లోపలికి వెళ్ళి ప్రేగులన్నిట్నీ కాల్చివేస్తుంది గరుత్మంతా! అలాంటి బాధ పగవాడికి కూడా రాకూడదని పాపులు కోరుకుంటారు.

ఇలా నరకంలో స్త్రీలు పురుషులు తాముచేసిన పాపాలకి ఈవిధమైన దారుణ శిక్షలు అనుభవిస్తుంటారు. తమ పాప కర్మలు క్షయమైపోయే వరకూ నరక బాధలు అనుభవించిన పాపులు, తిరిగి యమధర్మరాజు ఆజ్ఞ ప్రకారం వృక్షాలుగా, స్థావరాలుగా భూలోకంలో జన్మిస్తారు. స్థావరాలంటే చెట్లు,పొదలు, తీగలు గడ్డి మొదలైనవి.

కీటకాశ్చ పశవశ్చైవ పక్షిణశ్చ జలేచరాః ।
చతురాశీతి లక్షేషు కథితా దేవయోనయః ॥

గరుత్మంతా బ్రహ్మదేవుడి చేత సృష్టించబడ్డ ఎనభైనాలుగు లక్షల జీవరాసుల్లో – మనుషులు, దేవతలు, పురుగులు, పక్షులు, పశువులు, మృగాలు చేరి వుంటాయి.

పూర్వం చెప్పిన నరకాలలో శిక్షలనుభవించిన పాపులు, వారి పాపకర్మల ఫలాన్ననుసరించి మనుషుల్లోన్ని హీనకులంలో జన్మిస్తారు. గతజన్మలో వారుచేసిన పాపం ఫలితంగా భయంకరమైన కుష్ఠు, క్షయ ఇత్యాది వ్యాధులతో పీడించబడతారు.

## పాపులు - రోగాలు

నారాయణా! భూలోకంలో మానవులు ఏఏ పాపాలు చేసినందువల్ల ఏ రకమైన జన్మలు పొందుతారు? ఈ విషయం తెలుసుకోవాలని నాకు చాలా కుతూహలంగా ఉంది" అని గరుత్మంతుడు శ్రీహరిని అడిగాడు

"గరుత్మంతా! ఎన్నో పాపాలు చేసిన మానవులు నరకానికి వచ్చి అక్కడ ఘోరమైన శిక్షలనుభవిస్తారు. ఆ తరువాత వారు గత జన్మలో చేసిన పాపాలననుసరించి వివిధ రకాల రోగాలతో జన్మిస్తారు. ఆ రోగాలు ఎలాంటివో చెబుతున్నా విను"

★ బ్రహ్మహత్య చేసిన వాడు – క్షయ రోగిగా పుడతాడు.

★ గోహత్య చేసినవాడు – మరు గుజ్జుగా పుడతాడు.

★ కన్యని చంపినవాడు – కుష్ఠు రోగిగా పుడతాడు.

★ స్త్రీలని చంపినవాడు, గర్భస్రావం చేసినవాడు–బోయకులంలో పుడతాడు.

★ ఇతరజాతి స్త్రీలతో సంభోగించినవాడు – నపుంసకుడౌతాడు.

★ మాంసంతినేవాడు – ఎర్రటి కుష్ఠువ్యాధితో జన్మిస్తాడు.

★ కల్లుతాగినవాడు – నల్లటి దంతాలతో జన్మిస్తాడు.

★ తినకూడని వాటిని తిన్నవాడికి – జలోదర వ్యాధి కలుగుతుంది.

★ ఇతరులకేమీ పెట్టకుండా తినేవాడికి – గళిగండరోగం వస్తుంది.

★ శ్రాద్ధంలో శుద్ధిలేని అన్నం పెడితే – చిత్రమైన కుష్ఠు వ్యాధి కలుగుతుంది.

★ గురువుని తిరస్కరించినవాడి – అపస్మార రోగం కలుగుతుంది.

★ వేదశాస్త్రాల్ని నిందించినవాడికి – పాండు రోగం వస్తుంది.

★ అబద్ధపు సాక్ష్యం చెప్పినవాడు – మూగవాడిగా పుడతాడు.

★ వివాహాన్ని చెడగొట్టినవాడు – పెదవులు లేనివాడౌతాడు.

★ పుస్తకాలు దొంగలించినవాడు – పుట్టుగ్రుడ్డిగా పుడతాడు.

★ ఆవుల్ని బ్రాహ్మణుల్ని కాలితో తన్నేవాడు – కుంటివాడౌతాడు.

★ అసత్యాలు ఆనందంగా వినేవాడు – చెవిటివాడౌతాడు.

★ విషం పెట్టినవాడు – బుద్ధిమాంద్యంతో పుడతాడు.

★ ఇళ్ళు తగలబెట్టినవాడు – మూలశంక రోగం వస్తుంది.

★ మాంసాన్ని భుజించినవాడు – రోగాలతో పుడతాడు.

★ రత్నాలు దొంగతనం చేసినవాడు – హీనజాతిలో పుడతాడు.

★ బంగారం దొంగతనం చేసినవాడు – పిప్పిగోళ్ళతో జన్మిస్తాడు.

★ రాగి ఇత్తడి దొంగలించినవాడు – దరిద్రుడిగా జన్మిస్తాడు.

★ అన్నం దొంగతనం చేసినవాడు – ఎలుకగా పుడతాడు.

★ ధాన్యం దొంగతనం చేసినవాడు – మిడతగా పుడతాడు.

★ నీళ్ళని దొంగతనం చేసినవాడు – చాతక పక్షిగా పుడతాడు.

★ విషాన్ని దొంగతనం చేసినవాడు – తేలుగా పుడతాడు.

★ కూరల్ని, ఆకుల్ని అపహరించినవాడు – నెమలిగా పుడతాడు.

★ తేనె దొంగతనం చేసినవాడు – తేనెటీగగా జన్మిస్తాడు.

★ కస్తూరి లాంటి సుగంధద్రవ్యాల్ని, అపహరించేవాడు–చుంచుగా పుడతాడు.

★ మాంసాన్ని అపహరించినవాడు – గ్రద్దగా జన్మిస్తాడు.

★ ఉప్పు దొంగలించినవాడు – చీమగా పుడతాడు.

★ తాంబూలాన్ని, పుష్పాల్ని ఫలాల్ని అపహరించిన వాడు – అడవిలో కోతిగా పుడతాడు.

★ గడ్డి, ప్రత్తి వంటివి అపహరించినవాడు – మేకగా పుడతాడు.

★ బాటసారుల్ని కొల్లగొట్టేవాడు, వేటాడి జీవుల్ని చంపేవాడు – కటికవాడి ఇంట్లో మేకగా జన్మిస్తాడు.

★ విషంత్రాగి చనిపోయిన వాడు – పర్వతం మీద నల్ల త్రాచుగా పుడతాడు.

## పాపం చేసిన బ్రహ్మణులు పొందే జన్మలు

వైశ్వదేవం చేయనివారు, సర్వవర్ణాలవారి అన్నాన్ని తినేవారు, యుక్తాయుక్త విచక్షణ లేకుండా అన్ని పదార్ధాలనీ భక్షించేవాళ్ళు అయిన విప్రులు మనుషులు లేని అడవిలో పెద్ద పులిగా జన్మిస్తారు.

సంధ్యావంద విధుల్ని ఆచరించనివారు గాయత్రీ మంత్రాన్ని జపించనివారు, మనుసులో క్రూరంగా వుంటూ బైటికి సాధుజీవిలా ప్రవర్తించేవారు కొంగ జన్మపొందుతారు.

మ్లేచ్ఛులకి యాజ్ఞీకం చేయించినవాడు ఊరపందిగా పుడతాడు. ధనాశతో అనేకులకి యాజ్ఞీకం చేయించినవాడు గాడిదగా జన్మిస్తాడు.

పరిషేచన మంత్రం చదవకుండా అన్నంతినేవాడు కాకిగా పుడతాడు.

యోగ్యుడైన శిష్యుడు లభించినప్పుడు అతడికి విద్య చెప్పని విప్రుడు ఎద్దుగా జన్మిస్తాడు. గురుసేవ చేయని శిష్యుడు కంచరగాడిదగా పుడతాడు.

బ్రాహ్మణుడు మరో బ్రాహ్మణుడితో అనవసరంగా వాదం పెట్టుకుని అహంకారంతో అవమానించేవాడు అడవిలో బ్రహ్మ రాక్షసుడిగా పుడతాడు.

## పాపాలు – జన్మలు

★ విప్రులకి దానం ఇస్తానని చెప్పి ఇవ్వనివాడు నక్కగా పుడతాడు.

★ సత్పురుషులకి అపకారం చేసేవాడు అగ్ని హోత్రం నుంచి వెలువడే పెటపెట ధ్వనిగా అవుతాడు.

★ మిత్రద్రోహం చేసేవాడు పర్వతం మీద గ్రద్దగా పుడతాడు.

★ వస్తువులు అమ్మేడప్పుడు మోసం చేసినవాడు గుడ్లగూబగా జన్మిస్తాడు.

★ వర్ణాశ్రమధర్మాల్ని నిరసించినవాడు అడవిలో పావురాయిగా పుడతాడు.

★ ఆశాభంగం చేసినవాడు, స్నేహభంగం చేసినవాడు, భార్యమీద కోపంతో విడిచిపెట్టినవాడు చక్రవాక పక్షిగా పుడతాడు.

★ తల్లితో, తండ్రితో, తోబుట్టువులతో పోట్లాడేవాడు ఎన్నో జన్మలు గర్భంలో ప్రవేశించి, జన్మఎత్తకుండానే గర్భస్రావం జరిగి మరణిస్తాడు.

★ అత్తమామలతో నిత్యం పోట్లాటపెట్టుకుని వారిని బాధపెట్టే స్త్రీ జలగలాగా పుడుతుంది. భర్తని ఎదిరించి పోట్లాడే స్త్రీని ఊపిరికుట్టురోగంతో జన్మిస్తుంది.

★ తన భర్తని విడిచి, పరపురుషుల మీద ఆసక్తితో వుండే స్త్రీ ఆడమేకగా, బల్లిగా, రెండు తలలు ఆడపాముగా పుడుతుంది.

★ స్వగోత్రం కలిగిన స్త్రీని వివాహం చేసుకున్నవాడు, శిధిలమైన అంగాలతో ఎలుగుబంటిగా పుడతాడు.

★ కామంతో బలవంతంగా తాపస స్త్రీతో సంభోగించినవాడు నీళ్ళులేని ప్రదేశంలో పిశాచంగా జన్మిస్తాడు.

★ యౌవనంరాని స్త్రీతో సంభోగం చేసినవాడు అడవిలో కొండచిలువగా జన్మిస్తాడు.

★ రజస్వల అయిన స్త్రీని వివాహం చేసుకున్నవాడు ఎద్దుగా పుడతాడు.

★ మరణించినవాడికి పదకొండోరోజు చేసే శ్రాద్ధంలో భోజనం చేసినవాడు కుక్కగా, ధనం తీసుకుని దేవతా పూజచేసే వాడు కోడిగా పుడతారు.

★ బ్రహ్మహత్య చేసినవాడు గాడిదగా, లొట్టిపిట్టగా, దున్నపోతుగా జన్మిస్తాడు.

★ బంగారాన్ని దొంగతనం చేసినవాడు పేడలాంటి దుర్గంధభరితమైన వాటిలో పురుగుగా, దోమగా, ఈగగా జన్మిస్తాడు.

★ ఇతరుల భార్యని అపహరించి, వారు దాచుకున్న ధనాన్ని అపహరించి, బ్రాహ్మణుల సొమ్ముని అపహరించినవాడు బ్రహ్మరాక్షసుడిగా పుడతాడు.

లోహచూర్ణాశ్మ చూర్ణం చ విషం చ జరయేన్నరః ।
బ్రహ్మస్వం త్రిషులోకేషు కః పుమాన్ జరయిష్యతి ॥

వైనతేయా! ముల్లోకాల్లో ఎవడైనా ఇనుపరాళ్ళనిగానీ, ఇనుప చూర్ణాన్ని గానీ, విషాన్నిగానీ, తిని హరాయించుకోగలడేమోకానీ బ్రాహ్మణ ద్రవ్యాన్ని అపహరించి హరించుకోలేడు.

దేవతాధనాన్ని అపహరించినవాడు, విప్రుల సంపదహరించినవాడు, విప్రుల్ని తిరస్కరించేవారు హీనకులంలో పుడతారు. తననే ఆశ్రయించుకున్న వేద పండితుణ్ణి విడిచి మరో పండితుణ్ణి ఆదరించేవాడు బ్రాహ్మణాతిక్రమణ దోషం చేసినవాడౌతాడు. ఇలాంటి దోషం చేసినవాడు దరిద్రుడుగా జన్మిస్తాడు.

బ్రాహ్మణుడికి జీవనాధారంగా భూదానంచేయాలి. ఆ భూమిని కాపాడాలి. అలా జీవన భృతి కల్పించిన వాడికి లక్షగోవుల్ని దానం చేసిన ఫలం లభిస్తుంది. అదే బ్రాహ్మణ వృత్తిని చెడగొట్టిన వాడికి కోతి, కుక్క, కొండముచ్చులాంటి జన్మలు ప్రాప్తిస్తాయి.

## శ్రీహరి ప్రవచనం

స్త్రీపుంసో స్తు ప్రసంగేన భూత్వాగర్భే క్రమా దసౌ ।
గర్భాది మరణాంతం చ ప్రాప్య దుఃఖం మ్రియే త్పునః ॥ 1

సముత్పత్తి ర్వినాశశ్చ జాయతే సర్వదేహినాం ।
ఏవం ప్రవర్తితం చక్రం భూతగ్రామే చతుర్విధే ॥ 2

ఘటీయంత్రం యథా మర్త్యా భ్రమంతి మమ మాయయా ।
భూమౌ కదాచి న్నరకే కర్మపాశ సమావృతాః ॥ 3

అదత్తదానాచ్చ భవేద్దరిద్రో దరిద్రభావాచ్చ కరోతి పాపమ్ ।
పాపప్రభావా న్నరకే ప్రయాతి పునర్దరిద్రః పున రేవ పాపీ ॥ 4

అవశ్య మేవ భోక్తవ్యం కృతం కర్మ శుభాశుభం ।
నాభుక్తం క్షీయతే కర్మ కల్పకోటిశతైరపి ॥ 5

*(శ్లో॥53-57,అధ్యా-5)*

గరుత్మంతా! జీవుడు స్త్రీ పురుషుల సంభోగం వల్ల గర్భంలో ప్రవేశించి, నవమాసాలు గడిచాక జన్మిస్తాడు. ఇక పుట్టింది మొదలు మరణించేదాకా ఎన్నో రకాల దుఃఖాలు అనుభవించి తిరిగి మరణిస్తాడు.

ఈవిధంగా జీవులు పుడుతూ చస్తూ వుంటారు. ఈ జీవులందరూ నా మాయతో కర్మపాశబద్ధులై భూమిమీద పుడుతూ, చస్తూ నరకాలు పొందుతూ ఘటియారంలో ముల్లులాగా పైకీ క్రిందికీ తిరుగుతూ ఉంటారు.

మానవుడు దానం చేయకపోవటం వల్ల దరిద్రుడవుతాడు. దరిద్రుడవటం వల్ల పాపాలు చేస్తాడు. తిరిగి పాపాత్ముడైన మానవుడు దరిద్రుడుగా పుడుతున్నాడు. జీవుడు చేసుకున్న కర్మని అనుభవించి తీరాల్సిందేకానీ అది ఎన్ని కల్పాలు గడిచినా నశించదు. ఎలాంటివాడైనా సరే పుణ్యకర్మని, పాపకర్మని అనుభవించే తీరాలి.

## గర్భవాస నరకం

పరంధామా! జీవుడు నరకం నుంచి తిరిగి జన్మఎత్తటానికి తల్లి గర్భంలోకి ప్రవేశిస్తాడు కదా! ఆ గర్భంలో అతడు ఎలాంటి నరక బాధని అనుభవిస్తాడు? దయచేసి చెప్పు స్వామీ! అని గరుత్మంతుడు ప్రార్థించగా, శ్రీహరి ఇలా చెప్పటం ప్రారంభించాడు.

వైనతేయా! స్త్రీ పురుషుల సంయోగం వల్ల శుక్లశోణితాలు ఏకమై మానవుడు జన్మిస్తాడు. పాపం చేసిన జీవుడికి ప్రసవసమయానికి మూడు రోజులు ముందే శరీరోత్పత్తి జరుగుతుంది. ఎలాగంటే! ఇంద్రుడికి బ్రహ్మహత్యాదోషం గర్భిణీ స్త్రీకి మొదటి మూడు రోజులు ఆవరించి ఉంటుంది. ఆరోజుల్లో మొదటి రోజు స్త్రీని చండాలిగా, రెండోరోజు బ్రహ్మఘాతిగా, మూడోరోజు రజకి అని వ్యవహరించబడుతుంది. కాబట్టి ఈ మూడు రోజుల్లోనే పాపాత్ములైన వారు జన్మిస్తారు.

గరుత్మంతా! ప్రతిజీవీ తాను చేసిన కర్మానుసారం శరీరాన్ని పొందుతాడు. పురుషుడి వీర్యం ద్వారా స్త్రీ శరీరంలోకి ప్రవేశిస్తాడు. శుక్ల శోణితాలు రెండూ ఒక్కరోజులో కలిసిపోతాయి. అవి అయిదురోజులకి నురుగగా మారుతాయి. పదిరోజులు గడిచేసరికి మాంసాకారాన్ని పొంది రేగుపండంత కఠినత్వాన్ని పొందుతాయి. తరువాత అది అండంగా మారుతుంది.

గర్భంలో ఉన్న జీవికి ఒకనెలలో తల రెండో నెలలో చేతులు మొదలైన అవయవాలు, మూడో నెలలో గోళ్ళు, వెంట్రుకలు, చర్మం, మర్మావయవాలు, రంధ్రస్థానాలు ఏర్పడతాయి. నాలుగోనెల వచ్చేసరికి సప్తధాతువులు, అయిదో నెలలో ఆకలి దప్పికలు, ఆరో మాసంలో మావిచేత చుట్టుకోబడి కుడిడొక్క తిరుగుతుంటుంది.

ఆవిధంగా ఆకలి దప్పికలు పొందిన జీవి తల్లి గర్భంలోనే ఉండి, తల్లి తినే పదార్ధాలనే తనూతింటూ, వృద్ధి చెందుతాడు. మలమూత్రాలతో దుర్వాసనగా ఉండే తల్లి గర్భంలో శయనించి వుంటాడు. గర్భంలో ఉండే పురుగులు లోపలున్న శిశువుని మాటిమాటికీ కుడుతూ ఉంటాయి. శిశువు శరీరం చాలా సుకుమారంగా ఉండటంతో వాటి బాధని తట్టుకోలేకపోతాడు. తల్లి తినే ఉప్పుకారం వేడి, పులుపు లాంటి పదార్ధాలు వల్ల తన అన్ని అంగాలు ఎంతో బాధపడతాయి.

మావితో చుట్టుకోబడ్డ శిశువు ప్రేగులతో వెలుపలిభాగమంతా ఆవరించబడి, నడుము తల వంచుకుని తల్లిగర్భంలో శయనిస్తాడు. పంజరంలో పక్షివున్నట్టుగానే జీవుడు మాతృగర్భంలో కొలువుంటాడు. అలా గర్భంలో ప్రవేశించి రూపం పొందిన జీవుడు పూర్వజన్మ జ్ఞానాన్ని కలిగి, ఎన్నో జన్మల నుంచీ తాను చేసిన పాపాల్ని తలచుకుని చింతిస్తూ ఉంటాడు.

సప్తధాతువులతో పుట్టినజీవుడు గర్భనరక బాధనుంచి విముక్తి కలగటం కోసం, ఒక మునిలాగా తనని తల్లి గర్భంలో ప్రవేశపెట్టిన భగవంతుణ్ణి ఇలా దీనంగా ప్రార్థిస్తాడు.

# గర్భస్థ జీవుడు చేసే పరమాత్మ స్తుతి

నైకత్రాఽస్తే సూతివాతై ర్విష్ఠా భూరివ సోదరః ।
జీవ ఉవాచ : శ్రీపతిం జగదాధార మశుభక్షయకారకమ్ ॥ 1
ప్రజామి శరణం విష్ణుం శరణాగతవత్సలం ।
త్వన్మాయామోహితో దేహే తథా పుత్రకళత్రకే ॥ 2
అహం మమాభిమానేన గతో ఽహం నాథ సంసృతిం ।
కృతం పరిజన స్వార్థే మయా కర్మ శుభాశుభమ్ ॥ 3
ఏకాకీ తేన దగ్ధోహం గతా స్తే ఫలభాగినః ।
యది యోన్యాః ప్రముచ్యేఽహం తత్ స్మరిష్యే పదం తవ ॥ 4
త ముపాయం కరిష్యామి యేన ముక్తిం ప్రజా మ్యహం ।
విణ్మూత్ర కూపే పతితో దగ్ధోఽహం జఠరాగ్నినా ॥ 5
ఇచ్ఛన్నితో వివసితుం కదా నిర్యాస్యతే బహిః ।
యే నేదృశం మే విజ్ఞానం దత్తం దీనదయాళునా ॥ 6
తమేవ శరణం యామి పునర్మే మాస్తు సంసృతిః ।
న చ నిర్గంతు మిచ్ఛామి బహిర్గర్భా త్కదాచన ॥ 7
యత్ర యాతస్య మే పాపకర్మణా దుర్గతి ర్భవేత్ ।
తస్మాదత్ర మహాదుఃఖే స్థితోఽపి విగతక్లమః ॥ 8

*(శ్లో॥ 16-23,అధ్యా-6)*

ప్రపంచానికి ఆధారమైనవాడు, లక్ష్మీదేవికి భర్త, సకలజీవుల పాపాలని నశింపచేసేవాడు, శరణువేడుకున్న వారిమీద దయచూపించేవాడు, అయిన శ్రీహరిని శరణువేడుకుంటున్నాను. ఈ శరీరం మీద భార్యా పుత్రుల మీద మాయామోహంతో, అజ్ఞానంతో ఇది నాది ఇది నేనే అనే అభిమానాన్ని, అహంకారాన్ని పొందాను. ప్రభూ! నా కుటుంబపోషణ కోసం ఎన్నో పాపకార్యాల్ని ఆచరించి నా భార్యా బిడ్డల్ని సుఖపెట్టాను. ఎంతో సంపాదించాను.

అయితే నేను చేసిన పాపాన్ని నేనే అనుభవిస్తున్నాను కానీ, నా భార్యా బిడ్డలు నా పాపంలో భాగం పంచుకోవటం లేదు. స్వామీ! ఈ గర్భవాస నరకాన్ని భరించలేకపోతున్నాను. దయచేసి నన్ను దీనినుంచి బైటపడెయ్యి, నీ పాదకమలాలనే నిత్యం ధ్యానం చేసుకుంటాను. తిరిగి పుట్టాక ముక్తిని పొందే ఉపాయాన్ని ఆలోచిస్తాను. ప్రభూ! మలమూత్రాలతో నిండిపోయిన గర్భంలో చేరి ఆకలతో ఉన్నాను. ఈ గర్భం నుంచి బైటపడాలని కోరుకుంటున్నాను. ఎప్పుడు బైటికి వస్తానో నాకు తెలియటంలేదు.

దీనుల మీద దయచూపే ఏ పరమాత్మ నాకీ పూర్వజన్మ జ్ఞానాన్ని ప్రసాదించాడో, ఆపరమాత్మనే తిరిగి ఈ సంసారంలో పడకుండా వేడుకుంటాను.

స్వామీ! నేను ఈ గర్భం నుంచిబైటికి రాకూడదని కూడా నాకొకసారి అనిపిస్తోంది. ఎందుకంటే! ఇంతకుముందే ఈ గర్భంలో ప్రవేశించిన ఈ నరకాన్ని అనుభవిస్తున్నాను. జన్మించాక మళ్ళీ పాపాలు చేసి నీ పాదాల మీద భక్తి ప్రపత్తులు లేకుండా ఉండేకన్నా, ఈ గర్భవాసనరకం ఎంత బాధపెట్టినప్పటికీ నేనిక్కడే ఉండి, నీ పాదపద్మాలని నమ్ముకొని, ఎలాంటి కష్టాలూ లేకుండా గడిపేస్తాను. తిరిగి సంసార బంధంలో చిక్కుకోకుండా నా ఆత్మని ముక్తిపథం వైపు పయనించేలా చేస్తాను.

గరుత్మంతా! ఈవిధంగా పదినెలల పాటు గర్భంలో ఉండి ఆ జీవుడు ఒక మునీశ్వరుడిలాగా భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నప్పుడు, అతడి బాధలు పోగొట్టటానికి, తిరిగి కర్మఫలాన్ని అనుభవింపచేయటానికి, ప్రసూతిగాలిని వీచి, అతడు బైటికి రావటానికి వీలుగా అధోముఖుణ్ణిగా చేస్తాను.

ప్రసూతి ఘడియలు సమీపించగానే జీవుడు తల్లి గర్భం నుంచి యోనిమార్గం ద్వారా, అధోముఖంగా బైటికి వస్తాడు. వచ్చేడప్పుడు ఎంతోబాధతో తెలివి తప్పి అతికష్టంగా బైటికి చేరతాడు. మలంలో ఉండే పురుగులా భూమిమీద పడ్డ జీవుడు అప్పటిదాకా వున్న పూర్వజన్మ జ్ఞానం నశించగా, అటు ఇటు కొట్టుకుంటూ ఏడుస్తాడు.

గర్భే వ్యాధే శ్మశానే చ పురాణే యమతిర్భవేత్ ।
సా యది స్థిరతాం యాతి కోపముచ్యేత బంధనాత్ ॥

గరుత్మంతా! గర్భంలో ఉన్నప్పుడు, అనారోగ్యం కలిగినప్పుడు, శ్మశానంలో ఉన్నప్పుడు, పురాణకథనాలు విన్నప్పుడు కలిగిన వైరాగ్యం గనుక మానవులకి స్థిరంగా ఉంటే వారికి సంసార బంధాలలో చిక్కుకునే దుర్గతి కలగదు.

కర్మ అనుభవించిన తరువాత గర్భం నుంచి బైటికి వచ్చిన వెంటనే ఆ జీవుణ్ణి విష్ణుమాయ మోహింపచేస్తుంది. విష్ణుమాయతో ఆవరించబడ్డ జీవి భూమిమీదకి రాగానే ఏవిధమైన జ్ఞానం లేకుండా అలా నిశ్చలంగా ఉంటాడు. అతడికి ఏమీ చెప్పగలిగే సామర్ధ్యం ఉండదు. అలా పుట్టిన తరువాత ఊహ వచ్చేంతవరకూ నరకాన్నే అనుభవిస్తాడు.

బిడ్డ ఆకలితో ఏడుస్తుంటే కడుపునొప్పి వచ్చిందేమో అనుకుని మందువేస్తారు. నిజంగా కడుపునొప్పి వచ్చి ఏడుస్తుంటే, ఆకలేసిందేమోనని పాలుతాగిస్తారు. ఇలా విరుద్ధంగా జరుగుతున్నప్పటికీ శిశువుగా వున్నజీవుడు తానేదీచెప్పగలిగే స్థితిలో ఉండడు. ఆవిధంగా జీవుడు నాలుగైదు సంవత్సరాలు వచ్చేవరకూ బాల్యసంబంధిత దుఃఖాలు అనుభవిస్తూనే ఉంటాడు. తరువాత కౌమార వయసులో విద్యాభ్యాసం లాంటి బాధలు పడతాడు. యౌవనదశలో దర్పాన్ని, అహంకారాన్ని పొంది రాక్షస గుణాలు కలిగినవాడౌతాడు.

యౌవన ప్రాయంలోకి చేరిన మానవుడు జూదం, సురాపానం లాంటి వ్యసనాల చేత మోహింపబడి, ఇంద్రియనిగ్రహాన్ని కోల్పోయినిప్పులో పడ్డ మిడతలాగా మోహంలోపడి కొట్టుకుంటాడు.

కురంగ మాతంగ పతంగ భృంగ మీవాహతాః పంచభిరేవ పంచ ।
ఏకః ప్రమాదీవ కథం నహన్యతే। యస్సేవతే పంచభిరేవ పంచ ॥

గరుత్మంతా! లోకంలో లేడి, ఏనుగు, పక్షి, తుమ్మెద, చేప, అనే ఈ అయిదు జంతువులు ఒక్కొక్కటీ ఒక్కో విషయం మీదే తీవ్రమైన కోరిక ఉండటంతో చెడిపోతున్నాయి. అయితే మానవుడు ఒక్కడే వివేకశూన్యుడై,

చర్మం, చెవులు, కళ్ళు, నాలుక, ముక్కు అనే అయిదు ఇంద్రియాలకి వశమైపోయాక ఇక చెడిపోకుండా ఎలాఉంటాడు.

ఇలా అత్యంత దుర్లభమైన మానవజన్మని పొందికూడా, ఎలాంటి సత్కర్మలు ఆచరించకుండా విషయ వ్యామోహంలో చిక్కి తన జీవితాన్ని నశింపచేసుకునే మూర్ఖుడికన్నా పాపాత్ముడు మరొకడుండడు.

జాతీశ తేఘ లభతే భువిమానుషత్వం ।
తత్రాపి దుర్లభతరం ఖలు భో ద్విజత్వం ॥
మస్తన్నపాలయతి లాలయతీంద్రియాణి ।
తస్యామృతంక్షరతి హస్తగతం ప్రమాదాత్ ॥

గరుత్మంతా! ఈ నలభైనాలుగులక్షల జీవరాశుల్లో మానవజన్మ మరీదుర్లభం. కనుక ఈ నరజన్మని అందరూ సార్థకం చేసుకోవాలి. ధార్మిక కార్యక్రమాలు చేసి జీవితాన్ని తరింపచేసుకోవాలి. అలా చేయక విషయాల మీద మమకారాన్ని పెంచుకుని సంచరిస్తే తన చేతిలో ఉన్న అమృత కలశాన్ని జారవిడిచినవారే అవుతారు. ఈవిషయాన్ని గ్రహించక జీవితాన్ని వ్యర్థంగా దుర్వ్యసనాలతో, వ్యామోహాలతో గడిపిన మానవుడు శ్లేష్మవ్యాధులతో కూడిన వార్ధక్యాన్ని పొంది, ఎన్నో బాధలు పడుతూ చివరికి మరణించి, మళ్ళా పూర్వంలాగానే నరకానికి చేరుకుంటాడు.

గరుత్మంతా! ఈవిధంగా పాపాత్ములు కర్మ అనేపాశంతో చుట్టబడి నా విష్ణుమాయలో చిక్కుకుని జన్మ తరింపచేసుకునే మార్గం తెలుసుకోలేక, వైరాగ్యభావం కలగక సంచరిస్తూ ఉంటారు.

## పుత్రుడి ప్రాముఖ్యం

'నారాయణా! ఇప్పటిదాకా పాపాత్ములు ఎలాంటి నరకబాధలు అనుభవిస్తారో, వారు చేసిన పాపాలకి ఎలాంటి జన్మలు పొందుతారో! చక్కగా వివరించావు. చాలా సంతోషం. మరి మానవులు తెలిసిగానీ, తెలియకగానీ చేసిన పాపాలవల్ల వారు యమ బాధలు పడకుండా ఉండటానికి ఏం చేయాలి?

సంసార సముద్రంలో పడి జ్ఞానంలేక పాపకర్మలు ఆచరించేవారు ఏకర్మల్ని చేస్తే తరిస్తారు? దయచేసి ఈ విషయాల గురించి చెప్పు" అని ప్రార్థించాడు గరుత్మంతుడు.

గరుత్మంతా! లోకోపకారంకోసం నీవు చాలా మంచి ప్రశ్నలే అడిగావు. సమాధానం చెబుతున్నా విను. ఇప్పటిదాకా నీకు సంతానం లేనివారికి, పాపాత్ములకి, పట్టే దుర్గతుల గురించి వివరించాను. నేను చెప్పిన ఈ నరకబాధలు ఏవైతే ఉన్నాయో! అవి సంతాన వంతులైన వారికి, ధర్మాత్ములకీ కలగవు.

పుంనామ్నో నరకాద్యస్మాత్పితరం త్రాయతే సుతః ।
తస్మాత్పుత్ర ఇతి ప్రోక్త స్స్వయమేవ స్వయంభువా ॥

'పుం' అనే నరకం నుంచి తండ్రికి రక్షించేవాడు కాబట్టి కుమారుడికి 'పుత్రుడు' అనే పేరు కలిగింది. ఈ విషయాన్ని స్వయంగా బ్రహ్మదేవుడే చెప్పాడు.

గరుత్మంతా! పుత్రులున్నవారికి సుగతి కలుగుతుంది కాబట్టి ఎలాగైనా పుత్ర సంతానాన్ని పొందటం కోసం తీవ్రంగా ప్రయత్నించాలి. ఏదో ఒక పుణ్యకార్యాలు ఆచరించైనా పుత్ర సంతానాన్ని పొందాలి. పుత్ర సంతానంకోసం హరివంశం లాంటి సద్గ్రంథాలలో ఉండే కథల్ని విని, పార్వతీపరమేశ్వరుల్ని భక్తి శ్రద్ధలతో పూజించినట్లైతే, పుత్రసంతానం పొందేయోగం కలుగుతుంది.

ధర్మాత్ముడైన పుత్రుడు ఒక్కడుంటేచాలు. అతడి వంశమంతా తరిస్తుంది. పూర్వం వేదం కూడా పుత్రుడన్నవాడు అన్నిలోకాల్నీ జయించగలడనే చెప్పింది. ఇలా మానవుడికి పుత్రుడు జన్మించగానే అతడు పితౄఋణం తీర్చుకునే వాడవుతాడు. అదే మానవుడికి మనుమడు కూడా కలిగితే, అతడు దేవ పితౄఋణాలు రెండింటినీ తీర్చుకోగలుగుతాడు. అదే మానవుడు జీవించి ఉండగానే ముని మనవడు కూడా కలిగితే అతడు యమలోకాన్ని దాటి స్వర్గాన్ని చేరుకుంటాడు.

గరుత్మంతా! పుత్రుడి విషయంలో ఒక ప్రధానమైన అంశం ఉంది. మానవుడు శాస్త్రబద్ధంగా పెళ్ళిచేసుకున్న స్త్రీ ద్వారా కన్న పుత్రుడే పున్నామ

నరకాన్ని తప్పిస్తాడుకానీ, వివాహం చేసుకోకుండా ఉంచుకున్న స్త్రీకి పుట్టిన పుత్రుడు పున్నామ నరకాన్ని తప్పించలేడు. అందుకే ఎప్పుడూ తన కులం కన్నా తక్కువ కులంలో పుట్టిన స్త్రీని వివాహం చేసుకోకూడదు. మానవులు తన కులంవారిని వివాహం చేసుకుని, తమ భార్యల ద్వారా పొందిన పుత్రులే వారికి వారసులవుతారు. అలాంటి వారసులు పెట్టే శ్రాద్ధాలవల్లే పితృదేవతలు తృప్తి చెందుతారు.

వైనతేయా! మరణించిన వ్యక్తిని గురించి ఇతరులు శ్రాద్ధాదికర్మలు ఆచరించినప్పటికీ అవి సత్ఫలితాలునే ఇస్తాయి. ఆ పుణ్యఫలం మరణించిన మానవుడికి చెంది అతడు నరకబాధల నుంచి ఉద్ధరించబడతాడు. ఈ విషయాన్ని ధృవపరిచే ఒక పురాతన వృత్తాంతాన్ని చెబుతా విను.

## బభ్రువాహన వృత్తాంతం

అది త్రేతాయుగం అకాలంలో అందమైన మహోదయం అనే నగరం ఉంది. ఆ నగరంలో ధర్మాత్ముడు, బలవంతుడు అయిన బభ్రువాహనుడనే మహారాజుండేవాడు. యజ్ఞయాగాది కర్మలు చేయటం, దానధర్మాలు ఆచరించటం, సత్పురుషుల్ని గౌరవించటం, సదాచారాల్ని పాటించటం, ఇంద్రియ నిగ్రహాన్ని కలిగిఉండటం, ఇలాంటి మంచి గుణాలు కలిగిన ఆ రాజు క్షత్రియధర్మాన్ని అనుసరించి, దుష్టుల్ని శిక్షిస్తూ, శిష్టుల్ని రక్షిస్తూ ప్రజలందర్నీ తన పుత్రుల్లానే పాలిస్తున్నాడు.

పరాక్రమవంతుడైన ఆ మహారాజు ఒకనాడు వేటాడాలనే కోరికతో, ఎన్నో వృక్షాలతో, క్రూరమృగాలతో నిండిన అడవిలోకి సైన్యసమేతంగా ప్రవేశించాడు. అడవిలోకి వెళ్ళిన రాజు కొంతదూరం పోయాక అక్కడొక మృగాన్ని చూసాడు. ఒక్కసారిగా బాణాన్ని ఎక్కుపెట్టి ఆ మృగం మీదకి వదిలాడు. బాణం సరాసరి వెళ్ళి ఆ మృగానికి గుచ్చుకుంది. వెంటనే గుచ్చుకున్న బాణంతో సహా ఆ మృగం పరుగెత్తింది. అలా రక్తంకారుతున్నా చలించకుండా పరుగెడుతున్న మృగాన్ని వెంబడించాడు బభ్రువాహనుడు.

అలా వెళ్తు ఆవనంలోంచి మరో వనంలోకి ప్రవేశించాడు. సైన్యమంతా ఎక్కడో వెనకాలే ఉండిపోయింది. వారికి రాజుజాడ తెలియలేదు.

మృగాన్ని వెంటాడుతూ వెళ్ళిన రాజుకి బాగా అలసట, దప్పిక, ఆకలి కలిగాయి. గొంతెండిపోతుంటే దగ్గర్లో కనిపించిన ఒక మడుగు దగ్గరకెళ్ళి అందులోని నీళ్ళని తీసుకుని కడుపారా త్రాగాడు. తన గుర్రాన్ని కూడా నీళ్ళలో దించి నీళ్ళు త్రాగించాడు. నీళ్ళు త్రాగగానే రాజుకి కొంత శ్రమ తగ్గింది. మడుగు నుంచి బైటికి వచ్చి సమీపంలోనే ఉన్న ఒక విశాలమైన మర్రిచెట్టు క్రింద విశ్రాంతిగా కూర్చున్నాడు.

కొద్దిసేపటికి రాజు తలెత్తి చెట్టుమీదకి చూసాడు. అక్కడ ఆకలి దప్పిలకతో పీడించబడుతూ అవయవాలన్నీ కృశించి, జుట్టుకూడా లేకుండా, పొట్టిగా, వృద్ధుడిగా వున్న ఒక నిశాచరుడు ఆయనకి కనిపించాడు. అది ఒక ప్రేత్రం.

బభ్రువాహనుడు ఎంతో వికారంగా ఉన్న ఆ ప్రేతాన్ని చూసి ఆశ్చర్యపోయాడు. ఆ ప్రేతం కూడా రాజుని చూసి ఆశ్చర్యపోయింది. అంత కీకారణ్యంలో అందమైన బలవంతుడైన ఒక మనిషిని చూసేసరికి ప్రేతస్వరూపుడికి ఆనందం కలిగింది. చెట్టు దిగి రాజు దగ్గరకెళ్ళి" అయ్యా! తమరెవరో మహానుభావులుగా నాకు కనిపిస్తున్నారు. మిమ్మల్నిచూసే సరికి నాకీ ప్రేత రూపం నుంచి విముక్తి కలుగుతుందన్న ఆశ కలిగింది. మీరే నన్ను ఉద్ధరించాలి" అని దీనంగా ప్రార్థించాడు.

ప్రేతం మాట విన్న రాజు "నల్లగా భయంకరంగా ఉన్న ప్రేతమా! నీకీ రూపం ఎలా వచ్చింది. నీవేం పాపం చేసావు? ఇంతకీ నీవెవరు? నీ వృత్తాంతమంతా సవివరంగా నాకు చెప్పు అని అడిగాడు.

ధర్మాత్మా! నాకీ ప్రేత రూపం రావటానికి గల కారణాన్ని చెబుతాను. అంతా విని నామీద దయ చూపించు.

సంపదలతో నిండిన ఎన్నో గ్రామాలు కలిగినది. ఎన్నో దేవాలయాలతో, ధనికుల గృహాలతో, ధర్మాత్ములకి నిలయంగా భాసించేది అయిన విదిశా నగరం

ఉండేది. ఆనగరంలో నేను జన్మించాను. అయ్యా! నేనొక వైశ్యుడిని, నాపేరు సుదేవుడు! నిత్యం హవ్యం ద్వారా దేవతలల్ని, కవ్యంద్వారా పితృదేవతల్ని తృప్తి పరిచేవాణ్ణి. బ్రాహ్మణులకి ఎన్నో దానధర్మాలు చేసాను. దిక్కులేని దరిద్రులకి అన్నదానాలు వస్త్ర దానాలు విరివిగా చేసాను. నేనిన్ని విధాలుగా పుణ్యకార్యాలు చేసినప్పటికీ ప్రారబ్ధం వల్ల నేను చేసినదంతా వ్యర్ధమయ్యింది. అదెలా జరిగిందంటే!

మహాత్మా! నాకు పరలోక క్రియలు చేయటానికి పుత్రసంతానం లేదు. అలాగే దగ్గరి బంధువులు స్నేహితులూ లేరు. ఎవరికైనా ఆద్యాది షోడశ (16) శ్రాద్ధాన్ని ముందుగా చేయకుండా తరువాత ఎన్ని శ్రాద్ధాలు చేసినా ఆ జీవుడికి ప్రేత రూపం తప్పకుండా ప్రాప్తిస్తుందని శాస్త్రం చెబుతుంది. అలా నేను మరణించాక నాకెవరూ శ్రాద్ధ కర్మలు చేయలేదు అందుకే నాకీ ప్రేత రూపం కలిగింది.

రాజా! అన్ని వర్ణాల వారికీ! రాజ్యాన్నేలే రాజే ముఖ్యబంధువని అందరూ చెబుతారు. దయచేసి నీవు పరలోక క్రియలు నాకోసం చేసి నన్నుద్ధరించు. నాకీ ప్రేతరూపం నుంచి విమోచనం కల్పించు. నన్ను తరింపచేయి" రాజా! నీవు నాకు ఆత్మబంధువులాంటి వాడివి. నీకొక దివ్యమైన మణినిస్తాను. ఈ ప్రేత జన్మవల్ల నేనెన్నో బాధలు పడుతున్నాను దయచేసి విముక్తి ప్రసాదించు.

ఈ అడవిలో ఎన్నో మధురమైన ఫలవృక్షాలున్నాయి. అవెన్ని ఉన్నా, నాకెంత ఆకలిగా ఉన్నా కేవలం వాటిని చూడగలేకానీ తినలేను ఎందుకంటే నాకీ ప్రేతరూపం వచ్చింది కనుక. మహాత్మా! నేను ఉద్ధరించబడాలంటే ముందుగా నాకు నారాయణ విధానం ప్రకారం పరలోక క్రియల్ని జరిపించాలి.

తదా నశ్యతిమేనూనం ప్రేతత్వం నాత్ర సంశయః ।
వేదమంత్రాస్తపోదానం దయా సర్వత్ర జంతుషు ॥

సచ్ఛాస్త్ర శ్రవణం విష్ణోః పూజాసజ్జన సంగతిః ।
ప్రేతయోని వినాశాయ భవంతీతి మయాశ్రుతం ॥

ఓ గరుత్మంతా! వేదమంత్రాలు, తపస్సు, దానం, సకల జీవుల మీద దయ, వేదాంతశాస్త్రాల్ని శ్రద్ధగా వినటం, శ్రీహరిని పూజించటం, సత్పురుషులతో సావాహం చేయటం, ఇలాంటివన్నీ ప్రేత స్వరూపాన్ని పోగొట్టటానికి సమర్థమైనవని పూర్వం పెద్దల ద్వారా విన్నాను. కనుక ఈ గుణాలన్నీ ఉన్న నీవు శాస్త్రోక్తంగా పరలోక క్రియల్ని చేస్తే తప్పకుండా నాకీ ప్రేతజన్మ నుంచివిముక్తి కలుగుతుంది.

## నారాయణ (బలి) పూజా విధానం

రాజా! ప్రేతజన్మ నుంచివిముక్తి కలిగించే నారాయణ(బలి) పూజావిధానాన్ని చెబుతున్నా విను.

న్యాయంగా సంపాదించిన ధనంతో రెండు సవరసుల బంగారంతో విష్ణుమూర్తి ప్రతిమని తయారుచేయించాలి. ఆ ప్రతిమకి కొబ్బరినీళ్ళతో, పంచామృతాలతో స్నానం చేయించాలి. తరువాత పచ్చటి రెండు వస్త్రాల్ని తెచ్చి ఆ విగ్రహానికి కట్టాలి. చక్కగా ఆభరణాలని, పూలమాలల్ని స్వామికి అందంగా అలంకరించాలి. అలంకరించిన ప్రతిమని ఉన్నతమైన పీఠం మీదుంచాలి.

పీఠం మీద స్థాపించిన ప్రతిమకి తూర్పుభాగంలో శ్రీధరుణ్ణి, దక్షిణభాగంలో మధుసూదనుణ్ణి పశ్చిమ భాగంలో వామనుణ్ణి, ఉత్తర భాగంలో గదాధరుణ్ణి, అలాగే మధ్యలో బ్రహ్మదేవుణ్ణి సాంబమూర్తిని ఆవాహన చేయాలి. తరువాత గంధపుష్పాక్షతలతో, ధూప దీప నైవేద్యాలతో శాస్త్రంలో చెప్పిన విధంగా పూజించాలి. పూజానంతరం ఆమండపానికి ప్రదక్షిణ చేసి, హోమకుండం దగ్గరకి వెళ్ళాలి. చక్కగా ఏర్పర్చిన కుండంలో అగ్నిని వెలిగించి, శాస్త్ర పద్ధతిలో దేవతలకి, విశ్వేదేవతలకి, నెయ్యి, పాలు, పెరుగులతో ఆహుతులు సమర్పించాలి.

ఇలా చేసిన తరువాత యధావిధిగా స్నానంచేసి, ప్రశాంత చిత్తంతో కామక్రోధాది దుర్గుణాల్ని విడిచిపెట్టి వినయవిధేయతలతో పరలోకానికి

సంబంధించిన క్రియల్ని, ఇంతకుముందు పూజించిన–నారాయణుడి సన్నిధిలో యథావిధిగా ఆచరించాలి. ఈ విధంగా శ్రాద్ధం మొత్తం శ్రద్ధగా చేసి, అందులో భాగంగా వృషోత్సర్జనం చేసిన తరువాత శయ్యాదానం చేయాలి. చివరిగా ప్రేతానికి 'ఉదక కుంభాన్ని' దానం చేయాలి.

ప్రేతం చెప్పిన విధాన్నంతా విన్న బభ్రువాహనుడు "ప్రేతమా! 'జలకుంభా'(నీటికుండ)న్ని ఎలా దానం చేయాలి? అని ప్రశ్నించాడు, ఆ ప్రేతం ఇలా చెప్పటం ప్రారంభించింది.

రాజా! ప్రేతఘటాన్ని దానం చేయటం వల్ల ఆ ప్రేతకి సంబంధించిన అన్ని రకాల దుర్గతులూ తొలగిపోతాయి. 'బంగారంతోకానీ, (మట్టితోకానీ) ఒక కుండని తయారుచేసి, ఆ కుండలోకి పాలు, పెరుగు, నీళ్ళు, తేనె, నెయ్యి వేసి, అందులోకి బ్రహ్మ విష్ణు మహేశ్వరుల్ని అష్టదిక్పాలకుల్ని ఆవాహన చేసి, యోగ్యుడైన ఒక బ్రాహ్మణుడికి నమస్కారంచేసి, దక్షిణతో కలిపి ఆకుండాన్ని దానం చేయాలి. ఈ దానం ఇవ్వకుండా వేరే ఎన్ని రకాల దానాలు చేసినా ఫలితం ఉండదు.

మహారాజా నేను చెప్పిన ఈ జలకుంభాన్ని దానంచేసేముందు, పూర్తిగా నింపిన కుండకి మధ్యలో బ్రహ్మదేవుణ్ణి రెండువైపులా శివుణ్ణి, శ్రీహరిని, కంఠం భాగంలో తూర్పునుంచి ఎనిమిది దిక్కుల్లో ఇంద్రాది దిక్పాలకుల్ని క్రమంగా ఆవాహనం చేసి, ధూప దీప నైవేద్యాలు సమర్పించి ఆ ఘటాన్ని దానం చేయాలి. రాజా! ఈ దానం అన్ని దానాల కన్నా గొప్పది. ఇది సకల పాపాలనీ పోగొడుతుంది. కనుక నా ప్రేత రూపం తొలగిపోవటానికి ఈ ఘటదానం చేయాలి" అని చెప్పింది.

గరుత్మంతా! ప్రేతుడు మహారాజుతో ఈవిధంగా చెబుతుండగా, రాజుగారి కోసం వెతుకుతున్న పరివారం గుర్రం కాలిగుర్తుల్ని అనుసరించి బభ్రువాహనుడున్న చెట్టు దగ్గరకొచ్చారు. అంతమందీ వస్తుండటాన్ని దూరం నుంచే చూసిన ప్రేత స్వరూపుడు రాజుకి ఒక రత్నాన్నిచ్చి నమస్కరించి అదృశ్యుడయ్యాడు.

బభ్రువాహనుడు తిరిగి తన పరివారంతో కలిసి తిరిగి రాజ్యానికి వెళ్ళిపోయాడు. వెళ్ళిన తరువాత ప్రేతుడికిచ్చిన మాట ప్రకారం. అతడి పేరు గోత్రాలతో ఉత్తర క్రియలు యథావిధిగా జరిపాడు. తరువాత అతడు చెప్పిన విధంగానే జలకుంభాన్ని దానం చేసి ఆ పుణ్యఫలాన్నంతా ప్రేతానికే సమర్పించాడు. ఇలా శాస్త్ర బద్ధంగా ఉత్తర క్రియలు జరగటంతో ఆ ప్రేతం ప్రేత శరీరాన్ని విడిచి స్వర్గలోకానికి వెళ్ళిపోయింది.

గరుత్మంతా! ఈవిధంగా ఇతరులు చేసిన శ్రాద్ధంతోనే ఉత్తమ గతి కలుగుతుంటే ఇక స్వంత కుమారుడు చేసే పరలోక క్రియలు ఎంతటి పుణ్యఫలాన్నిస్తాయో చెప్పేదేముంది.

ఇతిహాసమిమం పుణ్యం శృణోతి శ్రావయేచ్ఛ యః ।
నతై ప్రేతత్వ మాయతః పాపాచారయుతావపి ॥

పవిత్రమైన ఈ బభ్రువాహనుడి కథని ఎవరు వింటారో, ఇతరులకి వినిపిస్తారో వారిద్దరూ పాపాలు చేసినప్పటికీ మరణించిన తరువాత ప్రేత శరీరాన్ని పొందక ఉత్తమలోకాల్ని చేరుకుంటారు.

## సుగతిని కలిగించే క్రియలు

పరంధామా! వాసుదేవా! మానవులకి సుగతిని కలిగించే పనులు ఏవి? వేటిని ఆచరించటం ద్వారా మానవుడు నరకబాధలనుంచి తప్పించుకోగలడు? దయచేసి చెప్పు స్వామీ! అని గరుత్మంతుడు నారాయణుణ్ణి అడిగాడు. అప్పుడు నారాయణుడు "గరుత్మంతా! మానవులందరికీ మేలు కలగాలనే సత్సంకల్పంతో నీవీ ప్రశ్నలు వేశావు. చాలామంచిది. నువ్వడిగిన ప్రశ్నలకి సమాధానం చెబుతున్నా విను.

పుణ్యాత్ముడైన వాడు తనకి వార్ధక్యం సమీపించగానే, శరీరం రోగాలతో నిండిపోయి వుంటుందని, ఇంద్రియాలన్నీ స్వాధీనంలో ఉండవని, ప్రాణవాయువు ధ్వని వినపడదని, తెలుసుకోవాలి. తనకి చివరికాలం దగ్గర పడిందని గ్రహించి

ఎలాంటి మృత్యుభయంలేకుండా ధైర్యంగా ఉండాలి. అప్పటిదాకా తాను తెలిసి, తెలియక చేసిన పాపాలకి తగిన ప్రాయశ్చిత్తం చేసుకోవాలి.

గరుత్మంతా! మానవుడికి ఉత్తమ గతులు కలిగించే క్రియల్లో ప్రధానమైనది భగవన్నామస్మరణ. ఇది చాలా సులభంగా అందరూ చేయతగింది. దీన్ని ఆచరించటం ద్వారా మానవుడు తానుచేసిన పాపాలకి తగిన ప్రాయశ్చిత్తం చేసుకోగలుగుతాడు.

## భగవన్నామ మహిమ

యదా స్యా దాతురః కాలస్తదా స్నానం సమాచరేత్ ।
పూజనం కారయే ద్విష్ణో స్సాలగ్రామస్వరూపిణః ॥ 1

అర్చయేద్గధపుష్పై శ్చ కుంకుమై స్తులసీదళైః ।
ధూపై ర్దీపైశ్చ నైవేద్యైర్బహుభి ర్మోదకాదిభిః ॥ 2

దత్వా చ దక్షిణాం విప్రాన్నైవేద్యాదపి భోజయేత్ ।
అష్టాక్షరం జపే న్మంత్రం ద్వాదశాక్షర మేవచ ॥ 3

సంస్మరేచ్ఛృణుయా చ్చైవ విష్ణోర్నామ శివస్య చ ।
హరేర్నామ హరేత్పాపం నృణాం శ్రవణగోచరమ్ ॥ 4

రోగిణోఽంతిక మాసాద్య శోచనీయం న బాంధవైః ।
స్మారణీయం పవిత్రం మే నామధేయం ముహుర్ముహుః ॥ 5

మత్స్యః కూర్మో వరాహశ్చ నారసింహశ్చ వామనః ।
రామో రామశ్చ కృష్ణశ్చ బుద్ధః కల్కీ తథైవ చ ॥ 6

ఏతాని దశనామాని స్మర్తవ్యాని సదా బుధైః ।
సమీపే రోగిణో బ్రూయుర్బాంధవా స్తేప్రకీర్తితాః ॥ 7

కృష్ణేతి మంగళం నామ యస్య వాచి ప్రవర్తతే ।
తస్య భస్మీభవంత్యాశు మహాపాతక కోటయః ॥ 8

మ్రియమాణో హరేర్నామ గృణన్పుత్రోపచారితం ।
అజామిళో ప్యగాద్ధామ కింపునశ్శ్రద్ధయా గృణన్ ॥ 9

హరిర్హరతి పాపాని దుష్టచిత్తైరపి స్మృతః ।
అనిచ్ఛయా ఽపి సంస్పృష్టో దహత్యేవ హి పావకః ॥ 10

హరేర్నామ్నశ్చ యా శక్తిః పాపనిర్హరణే ద్విజ! ।
తావత్కర్తుం సమర్థో న పాతకం పాతకీజనః ॥ 11

కింకరేభ్యో యమః ప్రాహ నయధ్వం నాస్తికం జనం ।
నై వానయత భో దూతా! హరినామస్మరన్నరమ్ ॥ 12

అచ్యుతం కేశవం రామ నారాయణం
కృష్ణదామెదరం వాసుదేవం హరిమ్ ।
శ్రీధరం మాధవం గోపికావల్లభం
జానకీనాయకం రామచంద్రం భజే ॥ 13

కమలనయనవాసుదేవ విష్ణో,
ధరణిధరాచ్యుత శంఖచక్రపాణీ ।
భవశరణ మితీరయంతిమేవైత్యజఛట
దూర తరేణ తానపాపాన్ ॥ 14

తా నానయధ్వ మసతో విముఖాన్ముకుంద
పాదారవింద మకరంద˘రసాదజస్రం ।
నిష్కించనైః పరమహంసకులై రసజ్ఞై
ర్జుష్టాన్గృహే నిరయవర్త్మని బద్ధతృష్ణాన్ ॥ 15

జిహ్వాన వక్తి భగవద్గుణనామధేయం
చేతశ్చన స్మరతి తచ్చరణారవిందమ్ ।
కృష్ణాయనో నమతి యచ్ఛిర ఏకదాపి
తానానయధ్వ మసతోఽకృత విష్ణుకృత్యాన్ ॥ 16

తస్మాత్సంకీర్తనం విష్ణోర్జగన్మంగళమంహసాం ।
మహతామపి పక్షీంద్ర! విద్ధ్యై కాంతిక నిష్కృతిమ్ ॥ 17

ప్రాయశ్చిత్తాని చీర్ణాని నారాయణపరాఙ్ముఖం ।
న నిష్పునంతి దుర్బుద్ధిం సురాకుంభమివాపగాః ॥ 18

కృష్ణనామ్నా న నరకం పశ్యంతి గతకిల్బిషాః ।
యమం చ తద్భటాంశ్చైవ స్వప్నేఽపి న కదాచన ॥ 19

మాంసాస్థి రక్తవత్కాయే వైతరణ్యాం పతేన్న సః ।
యోఽంతే దద్యాద్ద్విజేభ్యశ్చ నందనందన గామితి ॥ 20

అతః స్మరేన్మహావిష్ణోర్నామ పాపౌఘనాశనం ।
గీతాసహస్రనామాని పఠేద్వా శృణుయాదపి ॥ 21

ఏకాదశీవ్రతం గీతా గంగాంబు తులసీదళం ।
విష్ణోః పాదాంబు నామాని మరణే ముక్తిదాని చ ॥ 22

*(శ్లో॥5-26,అధ్యా-8)*

మరణకాలం సమీపించగానే మానవుడు స్నానంచేసి, శ్రీహరి స్వరూపమైన సాలగ్రామాన్ని పూజించాలి. గంధం, పుష్పం, అక్షతలు, కుంకుమ, తులసీదళాలతో పూజచేసి ధూపదీపాలు మధురమైన భక్ష్యాలతో నైవేద్యం సమర్పించాలి. తరువాత విప్రులకి దక్షిణ, తాంబూలాల్ని ఇచ్చి సగౌరవంగా సాగనంపాలి. వారు వెళ్ళిన తరువాత నారాయణ అష్టాక్షరీ 'ఓం నమోనారాయణాయ' మంత్రాన్ని గానీ, ద్వాదశాక్షరీ మహామంత్రం "ఓం నమో భగవతే వాసుదేవాయ" మంత్రాన్ని గానీ యథాశక్తి జపించి, స్వామికి నివేదించిన పదార్థాలని భుజించాలి.

శ్రీహరి పేరు వినపడితే చాలు మానవులు చేసిన సమస్త పాపాలూ నశిస్తాయి. కనుక శ్రీహరి నామాన్నిగానీ, శంకరుడి నామాన్ని గానీ స్మరించాలి. మానవుడు రోగగ్రస్తుడై మరణశయ్య మీదున్నప్పుడు బంధువులందరూ వెళ్ళి అతడి ముందు ఏడవకూడదు. ఆరోగి బాగా వినేలా మధురంగా హరినామ సంకీర్తన చేయాలి.

మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామన పరశురామ, రాముడు, కృష్ణుడు, బుద్ధ, కల్కి అనేవి శ్రీహరి దశావతారాలు. వీటి పేర్లని పెద్దలందరూ నిత్యం స్మరిస్తూ ఉంటారు. నిజమైన బంధువులెవరంటే మరణ శయ్యమీదున్న వాడి ముందు భగవన్నామ సంకీర్తన చేసేవాడే.

'కృష్ణా' అనే శబ్ద సకల శుభప్రదమైనది. ఈ కృష్ణనామాన్ని స్మరణ చేసేవాడు వినేవాడు, బ్రహ్మహత్య, మద్యపానం, బంగారం దొంగతనం చేయటం లాంటి మహాపాపాల నుంచి విముక్తి పొందుతాడు. పూర్వం అజామిళుడనే వాడు జీవితాంతం ఎన్నో పాపాలు చేసాడు. అయితే అవసాన కాలంలో తన కుమారుణ్ణి నారాయణా అని పేరు పెట్టి ఒక్కసారి పిలిచాడు. అంతే అప్పటిదాకా అతడు చేసిన పాపాలన్నీ క్షణంలో నశించిపోయాయి. వెంటనే విష్ణులోక దూతలు వచ్చి అతన్ని వైకుంఠానికి తీసుకుపోయారు. ఇక విష్ణునామాన్ని శ్రద్ధగా భజించేవాడికి ఎలాంటి పుణ్యఫలం దక్కుతుందో ప్రత్యేకంగా చెప్పేదేముంది.

వైనతేయా! సకలపాపాల్నీ పోగొట్టే శక్తి విష్ణునామానికి ఉందికాబట్టి, పాపాత్ములు తప్పనిసరిగా శ్రీహరినామాన్ని స్మరించాలి. యమధర్మరాజు తన భటులని ఇలా ఆదేశిస్తాడు" యమకింకరులారా! మీరు భూలోకం నుంచి హరినామస్మరణ చేయని పాపాత్ముల్ని మాత్రమే నరకానికి తీసుకురండి. అంతేకాని శ్రీహరి భక్తుల జోలికి వెళ్ళకండి"

అచ్యుత!కేశవా! రామా! నారాయణా! కృష్ణా! దామోదరా! వాసుదేవా! హరే!మాధవా! గోపికావల్లభా! జానకీ నాయకా! రామచంద్రా! అని భగవన్నామస్మరణ చేసేవారిని "పద్మాలలాంటి విశాలమైన నేత్రాలు కలిగినవాడా వాసుదేవా! విష్ణో! భూమిని ధరించినవాడా! అచ్యుతా! శంఖచక్ర గదాధరీ! నన్ను రక్షించు ప్రభూ! అని ఆర్తిగా శ్రీహరిని కొలిచేవారిని నిజమైన విష్ణుభక్తులుగా గుర్తించండి. అలాంటి పుణ్యాత్ముల జోలికి పోకండి.

కింకరులారా! విష్ణుమూర్తి దివ్యపాదారవిందాల మీద భక్తిలేనివారు, ఎంతో గొప్పజ్ఞానవంతుల ఇళ్ళలో జన్మించినప్పటికీ, వారిని తీసుకురండి.

అలాగే దైవచింతన వదిలేసి కేవలం సంసారం మీద వ్యామోహాన్ని పెంచుకున్న వాళ్ళని కూడా యమలోకానికి తరలించండి.

ఎవరి నాలుక శ్రీహరి గుణగణాల్ని కీర్తించదో, ఎవరి హృదయం శ్రీహరి పాదపద్మాలని ధ్యానం చేయదో, ఎవరి శిరస్సు శ్రీకృష్ణుడికి నమస్కరించదో! ఎవడు శ్రీహరికి సంబంధించి ఎలాంటి సత్కార్యాలూ చేయడో, అలాంటి పాపాత్ముల్ని నరకానికి తీసుకురండి.” అని చెబుతాడు.

గరుత్మంతా! యమకింకరులు సైతం శ్రీహరి భక్తులిజోలికి రారుకాబట్టి శ్రీహరి నామం ఎంత గొప్పదో తెలుసుకో! మానవులు చేసే పాపాలన్నిటికీ శ్రీహరినామమే ప్రాయశ్చిత్తం. భగవన్నామస్మరణ చేయకుండా ఎన్ని రకాల ప్రాయశ్చిత్తాలు చేసినా, కల్లుతో నిండిన కుండని నదులు పవిత్రం చేయలేనట్టే, భగవద్భక్తి లేని మూర్ఖుణ్ణి ఎలాంటి ప్రాయశ్చిత్తాలు పవిత్రుణ్ణి చేయలేవు. శ్రీకృష్ణ నామస్మరణ చేయటం ద్వారా మానవులు తమ పాపాలు పోగొట్టుకుని నరక బాధలు పొందరు. యమభటులు వారివంకకన్నెత్తైనా చూడరు.

మాసం, ఎముకలు, రక్తంతో నిండి ప్రవహించే వైతరణీనదిలో పడకుండా దాటిపోవటానికి ఆధారం శ్రీకృష్ణ నామస్మరణే అని తెలుసుకోవాలి. భగవద్గీత లేక విష్ణు సహస్రనామ పారాయణ చేయాలి. లేదా ఎవరైనా చేస్తుంటే వినాలి. అలాగే ఏకాదశీ వ్రతం, గంగాజలం, తులసీదళం, శ్రీహరి పాదతీర్థం ఇవన్నీ కూడా మరణకాలంలో మానవుడికి ముక్తిని ప్రసాదించేవే. కనుక ప్రయత్నించి వీటిని సేవించాలి.

ముక్తిని కోరుకునేవాడు అంత్యకాలం సమీపించిందని తెలిసినప్పుడు, యథాశక్తి అన్నదానం, సువర్ణదానం లాంటివి చేయాలి. వేదశాస్త్రం చదువుకున్న విప్రుడికి దూడతో సహా ఆవుని దానం చేయాలి. మరణకాలంలో చేసే ఏ కొద్ది దానమైనా అనంతమైన ఫలితాన్నిస్తుంది. తండ్రి సంకల్పించిన సత్కార్యానికి పుత్రుడు కూడా సంతోషంగా సహకరించాలి. అప్పుడే చేసిన సత్కార్యం అధికంగా ఫలిస్తుంది.

యోగ్యుడైన పుత్రుడు తన తండ్రి మరణానికి దగ్గర్లో ఉన్నాడని తెలిస్తే ఆయన చేత దాన ధర్మాలు చేయించాలి. ఇలాంటి పుణ్యకర్మలు చేయిస్తాడు కాబట్టే అందరూ పుత్రసంతానం కావాలని కోరుకుంటారు. తండ్రి అవసాన దశలో ఉన్నప్పుడు తనయులు అతడిచేత ధర్మ కార్యక్రమాలు చేయించే ప్రయత్నం చేయాలిగానీ, తండ్రి కష్టపడి సంపాదించిన ద్రవ్యాన్ని వాటాలు పంచుకోవటం కోసం కొట్లాడుకోకూడదు.

## అంత్యకాలంలో చేయాల్సిన దానాలు

గరుత్మంతా! ప్రాణం కోల్పోయే ముందు చేసే దానాలు విశేష ఫలితాన్నిస్తాయి. కనుక ఆ సమయంలో తిలదానం మొదలైన మహాదానాలు చేయాలి. ముఖ్యమైన దానాలు ఏవంటే!

**అష్టదానాలు :**

తిలలోహం హిరణ్యం చ కార్పాసో లవణం తథా ।
సప్తధాన్యం క్షితిర్గావ ఏకైకం పాపసంస్కృతం ॥

1.నువ్వులు 2.ఇనుము 3.బంగారం 4.పత్తి 5.ఉప్పు 6.ఏడురకాల ధాన్యాలు (గోధుమలు – కందులు – పెసలు – శనగలు – మినుములు – ఉలవలు బొబ్బర్లు అనేవి) 7. భూమి 8.ఆవు ఈ ఎనిమిదీ చేస్తే చాలా మంచిది లేకపోతే వీటిలో ఏ ఒక్కటి చేసినా అది మానవుడికి పుణ్యాన్ని కలిగిస్తుంది. ఈ అష్టమహాదానాల్ని మరణసమయంలో చేస్తే ఎలాంటి ఫలితాలు వస్తాయో చెబుతున్నా విను.

**1. నువ్వులు దానం :** గరుత్మంతా! నువ్వులు శ్రీహరినైన నాచెమట నుంచి ఉద్భవించాయి. అందుకే అవి చాలా పవిత్రమైనవి. అలాంటి నువ్వుల్ని దానం చేయటం వల్ల రాక్షసులు, దైత్యులు ఎంతో ఆనందిస్తారు. నువ్వుల్లో తెల్లవి–నల్లవి అని రెండు భేదాలుంటాయి. దూసరవర్గంలో కూడా నువ్వులుంటాయి. ఈ మూడు రకాల నువ్వులూ దానం చేయటం వల్ల మనస్సుతో మాటతో, చేతతో చేసిన పాపాలన్నీ నశిస్తాయి.

**2. ఇనుము దానం :** నేలని చేత్తో తాకుతూ ఇనుప వస్తువుల్ని దానం చేయాలి. అలాచేసిన వాడు యమలోకానికి వెళ్ళడు. గొడ్డలి, రోకలి, దండం, ఖడ్గం, కత్తి లాంటి ఆయుధాలు, పాపాత్ముల్ని శిక్షించటం కోసం యముడి చేతిలో ఉంటాయి. కనుక ఆ ఆయుధాల ప్రీతి కోసం, ఇనుప వస్తువుల్ని దానమివ్వాలి. ఇలా ఇనుప వస్తువుల్ని దానం చేసిన వాడికి యమలోకంలో ఎలాంటి బాధలు కలుగవు.

ఊరణ శ్శ్యామసూత్రశ్చ శుండామర్కో ప్యుదుంబరః ।
శేషం ఫలో మహాదూతా లోహదానా త్సుఖప్రదా ॥

ఉరణుడు, శ్యామసూత్రుడు, శుండామార్కుడు, ఉదుంబరుడు, శేషంవలుడు అనేపేర్లు కలిగిన వారు యమదూతల్లో ప్రధాన కింకరులు. ఇనుముని దానం చేయటం వల్ల వారు యమలోకం చేరిన మానవుడికి సుఖాన్నిస్తారు.

**3. సువర్ణ దానం :** సువర్ణదానం చేయటం వల్ల ముల్లోకాల్లో నివసించే భూతాలు ఎంతో సంతోషిస్తాయి. బ్రహ్మాది దేవతలు, యమధర్మరాజు, అతడి సభలో ఉండేవారు, సువర్ణదానం చేసినవాడిని చూసి సంతోషించి అనుగ్రహిస్తారు. సువర్ణదానం చేసినవాడు ప్రేత శరీరాన్ని పొందకుండా సరాసరి స్వర్గానికి చేరుకుంటాడు. సువర్ణదాన నిరతుడు సత్యలోకానికి వెళ్ళి అక్కడ సుఖంగా కాలం గడిపి, తిరిగి భూలోకంలో అందమైన మానవుడిగా లేక ధనవంతుడుగా, రాజుగా, జన్మిస్తాడు.

**4. ప్రత్తి దానం :** గరుత్మంతా! పత్తిని దానం చేసినవాడు యమదూతలచేత బాధించబడడు

**5. ఉప్పు దానం :** శ్రేష్ఠమైన ఉప్పుని యోగ్యుడైన విప్రుడికి దక్షిణతో సహాదానం చేసినవాడు, యమధర్మరాజు వల్ల ఎలాంటి కష్టాలూ పొందడు.

**6. ఏడురకాల ధాన్యాలు :** గోధుమలు, కందులు, మినుములు, ఉలవలు, శనగలు, బొబ్బర్లు, పెసలు, అనే ఏడురకాల తృణధాన్యాలని దానం చేస్తే యమధర్మరాజు అతడి పరివారం ఎంతో ఆనందిస్తారు.

**7. భూ దానం :** యోగ్యుడైన విప్రుడికి శక్తికొద్దీ తగినంత భూమిని దానం చేస్తే బ్రహ్మహత్యలాంటి మహాపాలన్నీ నశిస్తాయి. ఒకరాజ్యంలో రాజు చేసిన పాపాలు వ్రతాల వల్లగానీ, తీర్థయాత్రలు చేయటం వల్లగానీ, ఇతరుల దానాల వల్లగానీ నశించవు. కేవలం అవి భూదానం వల్ల మాత్రమే నశిస్తాయి. పైరుతో ఉన్న భూమిని దానం చేసినవాడు దేవతల చేతా, రాక్షసుల చేతా పూజించబడుతూ స్వర్గానికి చేరుకుంటాడు. ఇలా భూదానం వల్ల కలిగే పుణ్యఫలం ప్రతిరోజూ వృద్ధి చెందుతూనే ఉంటుంది.

**8. గో దానం :** భూదానం ఎంతో ఫలాన్నిస్తుందో 'గోదానం' కూడా అంతే ఫలాన్నిస్తుంది. భూదానం చేయాటానికి సమర్ధత లేనివాళ్ళు గోదానం చేయవచ్చు. గోదానం చేయాలనుకునే వారు మొత్తం మూడు గోవుల్ని దానం చేయాలి. 1.మృత్యుంజయుడైన రుద్రుడి కోసం ఒక గోవుని 2.తెలిసీ తెలియక చేసిన ఋణాలు వాటిద్వారా సంభవించిన పాపాలు తొలగిపోవటానికి ఒక గోవుని 3.మోక్షం పొందటం కోసం మూడో గోవుని దానం చేయాలి.

గోవులు మనస్సుతో, మాటతో, చేతలతో మానవులు చేసే పాపాల్ని నశింపచేస్తాయి కాబట్టి వైతరణీనదిని దాటింపచేసే గోదానాన్ని చేయాలి.

## వైతరణీ గోదానం

బాలత్వే యచ్చ కౌమారే య త్పాపం యౌవనే కృతం ।
వయః పరిణతౌ యచ్చ యచ్చ జన్మాంతరేష్వపి ॥ 1

య న్నిశాయాం తథా ప్రాతః యన్మధ్యాహ్నాపరాహ్ణయోః ।
సంధ్యయో ర్యత్కృతం పాపం కాయేన మనసా గిరా ॥ 2

దత్వా ధేనుం సకృద్వాపి కపిలాం క్షీరసంయుతాం ।
సోపస్కరాం సవత్సాం చ తపోవృత్త సమన్వితే ॥ 3

బ్రహ్మణే వేదవిదుషి సర్వపాపై ప్రబుచ్యతే ।
ఉద్ధరేదంతకాలే సాదాతారం పాపసంచాయత్ ॥ 4

*(శ్లో॥58-61)*

మానవుడు బాల్యంలో, కౌమారదశలో, యౌవనంలో, వార్ధక్యదశలో, పూర్వజన్మలో, రాత్రిపూట, ప్రాతః కాలంలో, మధ్యాహ్న కాలంలో, అపరాహ్ణ కాలంలో, ఉదయాస్తమాన సంధ్యా సమయాల్లో –మనసుతోకానీ, మాటతోకానీ, శరీరం చేతగానీ ఎలాంటి పాపాలు చేసాడో అలాంటి పాపాలన్నీ నశించటం కోసం, చక్కగా పాలిచ్చేది, లేగదూడతో ఉన్నది, అయిన ఆవుని బంగారు కొమ్ములు, వెండి డెక్కలతో సహా వేదాధ్యయనం చేసిన విప్రుడికి దానం చెయ్యాలి. ఆ గోవు కపిలవర్ణందైతే మరింత శుభప్రదం. ఆ గోదానం చేయటం వల్ల మానవుడికి నరకబాధలుండవు.

గోదానం ఎంతగొప్పదంటే! పవిత్రమైన పుణ్యస్థలాలకి వెళ్ళి అక్కడ ఒక్కో గోవుని దానం చేసినా అది పదిలక్షల గోవుల్ని దానం చేసిన ఫలితాన్నిస్తుంది.

ఒక్కే ఆవుని ఒక 'విప్రుడికే దానమివ్వాలి గానీ, ఒకే గోవుని మరింత మందికి ఇవ్వకూడదు. దానం స్వీకరించినవాడు ఆ గోవుని విక్రయించకూడదు. ఎవరికివ్వబడిన గోవుని వాడే స్వీకరించాలి. దీనికి వ్యతిరేకంగా చేసిన వారికి పాపం పట్టి ఏడుతరాల వారిని పీడిస్తుంది.

ధర్మాత్సంజాయతేఽ ర్థశ్చ ధర్మాత్కామోభిజాయతే ।
ధర్మఏవాప వర్గాయ తస్మాద్ధర్మం సమాచరేత్ ॥

ధర్మంవల్ల అర్థం, కామం, మోక్షం అనే మూడు కలుగుతున్నాయి. కనుక ధర్మాన్ని అందరూ ఆచరించాలి.

శ్రద్ధమాధార్యతే ధర్మో బహుభిర్నార్థరాశిభిః ।
నిష్కంచనాహి మునయ శ్ర్శద్ధానంతో దివంగతాః ॥

భక్తి శ్రద్ధలతో చేసిన ధర్మమే ఎవరికైనా సద్గతుల్ని కలిగిస్తుంది కానీ, భక్తి శ్రద్ధలు లేకుండా ఎంత ధనాన్ని వితరణ చేసినా ఫలితం ఉండదు. గరుత్మంతా! ఎవడైతే శ్రద్ధతో నాకు ఆకులు, పూల, ఫలాలు ఇస్తాడో అలాంటి వాటినే నేను ఎంతో ప్రీతితో స్వీకరిస్తాను.

# ఉత్తర క్షణంలో మృతి చెందేవాడికి చేయాల్సిన క్రియలు

గరుత్మంతా! మనిషికి కొద్దిక్షణాల్లో ప్రాణం పోతుందని తెలిసినప్పుడు, వెంటనే ఇంట్లో ఉన్న తలుసిచెట్టు దగ్గర ఆవుపేడతో కొంత ప్రదేశాన్ని బాగా అలకాలి. అలా అలికిన ప్రదేశంలో నువ్వులు చల్లి దర్భలు పరిచి ఒక్క ఆసనం ఏర్పర్చి, దానిమీద సాలగ్రామ శిలని ఉంచాలి. సకల పాపాల్నీ హరించే సాలగ్రామ శిల సమీపంలో మరణం పొందిన వారికి తప్పకుండా మోక్షం లభిస్తుంది.

**తులసి :** సకల భయాల్ని, తాపాల్ని పోగొట్టే తులసి చెట్టు నీడ ఎక్కడ వ్యాపించి ఉంటుందో, ఆప్రదేశంలో గనక మరణం సంభవిస్తే మృతి చెందిన వారికి ఎన్నో రకాల దానాలు చేసినా పొందలేని మోక్షం లభిస్తుంది. ఎవరి ఇంట్లో తులసి చెట్టు ఉంటుందో ఆ ఇల్లు సకల పుణ్యతీర్థాల స్వరూపం కలిగింది. కనుక ఆ ప్రదేశానికి యమకింకరులు రారు.

గరుత్మంతా! ఎవరైతే తులసీ దళాలమాలని ధరించి ప్రాణాలు కోల్పోతాడో, అలాంటి మానవుడు ఎలాంటి గొప్ప పాపాలు చేసినా సరే అతడి దగ్గరకి యమధర్మరాజు కూడా రాలేడు. ఎవరైతే తులసీదళాల్ని నోటిలో ఉంచుకుని, నువ్వులు, దర్భలు, పరిచిన ఆసనం మీద పడి మరణిస్తాడో అలాంటి వాడికి పుత్రసంతానం లేకపోయినా వైకుంఠానికి చేరుకుంటాడు. పరమ పవిత్రమైన మూడు రకాల నువ్వులు, దర్భలు, తులసి మరణించబోయేవాడికి దుర్గతులు కలగకుండా కాపాడతాయి.

**దర్భలు పవిత్రత :** గరుత్మంతా! దర్భలు, విభూతి నా వెంట్రుకల నుంచి పుట్టాయి కనుక అవి అత్యంత పవిత్రమైనవి. వాటిని కేవలం తాకితే చాలు మానవులు స్వర్గానికి చేరతారు.

కుశమూలే స్థితో బ్రహ్మా కుశమధ్యే జనార్ధనః ।
కుశాగ్రే శంకరో దేవ స్త్రయో దేవాః కుశౌ స్థితాః ॥
అతః కుశావహ్ని మంత్ర తులసీ విప్ర ధేనవః ।
నైతే నిర్మాల్యతాం యాంతి క్రియామాణాఃపునః పునః ॥

దర్భలు పరమపవిత్రమైనవి. వాటి మూలంలో బ్రహ్మదేవుడు, వాటి మధ్యలో విష్ణువునైన నేను వాటి చివర శంకరుడు కొలువుంటారు. అందువల్ల దర్భ త్రిమూర్త్యాత్మకంగా ప్రసిద్ధిచెందింది. దర్భలు, అగ్ని, మంత్రం, తులసి, బ్రాహ్మణులు, గోవులు, మాటిమాటికీ ఎన్నో పుణ్యకర్మల్లో వినియోగించ బడుతున్నప్పటికీ అవి నిరంతరం పవిత్రమైనవి. కనుక, ఎప్పుడూ వాటికి దోషం అంటదు.

పిండాల మీద ఉంచిన దర్భలు, ప్రేత శ్రాద్ధంలో భోజనం చేసిన బ్రాహ్మణులు, నీచుల గృహాలలో ఉండే ఆవు, తులసి, నీచులచేత ఉచ్ఛరించబడే మంత్రాలు, శ్మశానంలో వెలిగే అగ్ని త్యజించతగినవి.

**గోమయం :** ఆవుపేడతో బాగా అలికిన నేలమీద నువ్వులు, దర్భలు పరిచి దానిమీద మరణించిన వాడి శరీరాన్ని ఉంచాలి. బ్రహ్మవిష్ణు మహేశ్వరులు సమస్త దేవతలు, అగ్ని హోత్రుడు గోమయంతో అలికిన భూమి మీదుంటారు కనుక గోమయం చాలా ప్రశస్తమైనది. గోమయం ఉన్నచోట పిశాచాలు, రాక్షసులు, భూత, ప్రేతాలు ఉండలేవు. అందుకే అవన్నీ యమధర్మరాజుతో కలిసి గోమయంలేని ఆకాశమండలంలో నివసిస్తాయి.

గరుత్మంతా! మృతిచెందినవాడి శరీరాన్ని శుద్ధిచేయని భూమిమీద ఉంచకూడదు. పవిత్రంగా గోమయం(ఆవుపేడ)తో అలికిన నేలమీద పడుకోబెట్టిన మృతుడి ముఖంలో బంగారం, లేక రత్నాలుఉంచి సాలగ్రామం నుంచి తెచ్చిన విష్ణుపాదోదకాన్ని పోయాలి. ఆ తీర్థంలో ఒక్క చుక్క లోపలికి పోయినా ఆ మృతుడు వైకుంఠధామానికి చేరుకుంటాడు.

**గంగా ప్రాముఖ్యం :** గంగానది సమస్త పాపాలనీ పోగొట్టేది. సకల తీర్థాలలో స్నానంచేసిన ఫలం ఒక్క గంగా నదిలో చేస్తే చాలు వస్తుంది. గరుత్మంతా! దూది అగ్నిహోత్రంలో పడి ఏవిధంగా భగ్గుమని కాలిపోతుందో అలాగే గంగాజలం తాగినవాడి పాపం కూడా దూదిలానే కాలి నశిస్తుంది.

ఇతర నదులన్నీ కేవలం స్నానంచేస్తేనే మానవుల్ని పవిత్రం చేస్తాయి. గంగానది మాత్రం కేవలం చూడటం వల్ల తాకటం వల్ల, గంగా గంగా అని స్మరించటం వల్లనే మానవుల్ని పవిత్రం చేస్తోంది.

వైనతేయా! ప్రాణం పోయే సమయంలో జీవుడు గంగా గంగా అంటూ మరణిస్తే చాలు అతిడికి పునర్జన్మ వుండదు. ప్రాణం లోపల నుంచి పైకి లేచిపోయేడప్పుడు గంగా, గంగా అని శ్రద్ధగా మనసులో స్మరించినా చాలు, ఆ జీవి వైకుంఠాన్ని చేరుకుంటాడు. గంగానది పరమ పవిత్రమైనదికాబట్టే ఆనదిని ధ్యానించినా, స్మరించినా, అందులో స్నానంచేసినా మోక్షం కలుగుతుంది.

మరణావసాన కాలంలో భాగవతాన్ని కానీ, దానిలోని ఒక శ్లోకాన్ని కానీ, కనీసం ఒక పాదాన్ని కానీ పఠనం చేసిన, శ్రవణం చేసినా నరక బాధలు పొందరు. బ్రాహ్మణ క్షత్రియ, వైశ్య వర్ణాలవారు వేదాలు ఉపనిషత్తులు పఠనం శ్రవణం చేయటం వల్ల ముక్తి పొందుతారు.

**ఆతుర సన్యాసం :** గరుత్మంతా ప్రాణావసాన సమయంలో ఎలాంటి ఆహారం తీసుకోకూడదు. పూర్తి వైరాగ్యాన్ని పొందిన బ్రాహ్మణుడికి ఆతుర సన్యాసాన్ని ఇప్పించాలి. ప్రాణాలు కంఠం దాటి బైటికి వెళ్ళేలోపు సన్యాసాశ్రమానికి సంబంధించిన మంత్రాల్ని కనీసం ఒక్కటి ఉచ్ఛరించినా చాలు ఆ జీవి మృతి చెందగానే సరాసరి వైకుంఠానికి వెళతాడు. చివరి క్షణాల్లో సన్యాసం తీసుకుంటే అతడి ప్రాణాలు కంఠం దాకా వచ్చినప్పటికీ అవి అక్కడి నుంచి ఊర్ధ్వ ముఖంగా ప్రయాణించి బ్రహ్మరంధ్రాన్ని ఛేదించుకుని పైకిపోతాయి.

**ప్రాణం పోవటం :** నోరు, కళ్ళు, ముక్కు రంధ్రాలు, చెవులు వీటి నుంచి పుణ్యాత్ములు ప్రాణాలు బైటికి వెళ్ళిపోతాయి. అయితే యోగీశ్వరుల ప్రాణాలు మాత్రం బ్రహ్మరంధ్రం ద్వారా పైకి పోతాయి. ప్రాణ వాయువు – అపాన వాయువు ఈ రెండూ నాభిస్థానంలో కలిసి ఉంటాయి. అలాంటి ప్రాణవాయువు అపాన వాయువు నుంచి ఎప్పుడూ విడిపోతుందో, అప్పుడే ఆ ప్రాణం సూక్ష్మరూపంలో జీవుడి శరీరాన్ని విడిచి పైకి పోతుంది. మొదలంటా

నరికిన వృక్షం ఎలాగైతే ఆధారం లేకుండా భూమి మీద పడుతుందో అలాగే ప్రాణం పోయిన శరీరం కూడా కట్టెలా పడిపోతుంది.

**విగతజీవి స్థితి :** అప్పటిదాకా అందరిచేతా గౌరవించబడ్డ మానవుడు, ప్రాణాలు కోల్పోయి శవంలా పడిపోగానే, దుర్వాసన వచ్చి, అందరితో నిందించబడుతూ తాకకూడదని అనిపించుకుంటూ హీనమైన స్థితిని పొందుతాడు. మానవుడి శరీరం గర్భంలో ఉన్నప్పుడు పురుగుల స్వరూపంగా, జన్మించిన తరువాత మలస్వరూపంగా, మరణించిన తరువాత హినుగా, ఉండే ఇలాంటి దేహం మీదే మానవుడు ఎంతో వ్యామోహాన్ని పెంచుకుంటాడు.

వైనతేయా! మనిషి మరణించాక అతడి స్థూల శరీర సంబంధమైన పృధివీ భూతం భూమిలోపల, తేజోభూతం, తేజస్సులో, జలభూతం, నీటిలో, వాయుభూతం-గాలిలో, ఆకాశభూతం-గగనంలో లీనమైపోతాయి.

శరీరం, కళ్ళు, చెవులు లాంటి ఇంద్రియాలతో, శబ్ద, స్పర్శ, రూపాది విషయాలతో, కామ, క్రోధలోభ, మోహ, మద మాత్సర్యాలనే గుణాలతో, కర్మలతో, పంచకోశాలతో ఉన్న ఆత్మనే జీవుడు అంటారు. ఇల్లు కాలిపోతే మరో ఇల్లు నిర్మించుకుని దాన్లోకి గృహస్థుడు మారినట్టే, జీవుడు కూడా తను చేసిన పుణ్యకర్మల వల్ల ఒక శరీరాన్ని విడిచి మరో శరీరాన్ని పొందుతాడు.

ధర్మాన్ని ఆచరించి అనంతమైన పుణ్యాన్ని సంపాదించుకున్న ఉత్తముడు మరణించగానే అతడి కోసం దేవదూతలు దివ్యమైన విమానాన్ని తీసుకువస్తారు. ఆ విమానంలో అతన్ని స్వర్గలోకానికి తీసుకువెళతారు.

## ఉత్తరక్షణంలో మరణించేవాడు చేయాల్సిన క్రియలు

**(నవమాధ్యాయం మూలశ్లోకాలు)**

**గరుడ ఉవాచ**

కథితం భవతా సమ్యగ్దాన మాతురకాలికం ।
మ్రియమాణస్య యత్కృత్యం త దిదానీం వద ప్రభో ॥ 1

శ్రీ భగవానువాచ

శృణు తార్క్ష్య ! ప్రవక్ష్యామి దేహత్యాగస్య తం విధిం ।
మృతో యేన విధానేన సద్గతిం యాతి మానవః ॥ 2

కర్మయోగాద్యదా దేహీ ముంచత్యత్ర నిజం వపుః ।
తులసీసన్నిధౌ కుర్యాన్మండలం గోమయేన తు ॥ 3

తిలాంశ్చైవ వికీర్యాథ దర్భాంశ్చైవ వినిక్షిపేత్ ।
స్థాపయే దాసనే శుభ్రే సాలగ్రామశిలాం తదా ॥ 4

సాలగ్రామశిలా యత్ర పాపదోషభయాపహా ।
తత్సన్నిధానమరణా న్ముక్తిర్జంతో స్సునిశ్చితా ॥ 5

తులసీవిటపిచ్ఛాయా యత్రాఽస్తి భవతాపహా ।
తత్రైవ మరణాన్ముక్తి స్సర్వదా దానదుర్లభా ॥ 6

తులసీవిటపిస్థానం గృహే యస్యావ తిష్ఠతే ।
తద్గృహం తీర్థరూపం హి నాయాంతి యమకింకరాః ॥ 7

తులసీమంజరీయుక్తో యస్తు ప్రాణాన్ విముంచతి ।
యమస్తం నేక్షితుం శక్తో యుక్తం పాపశతై రపి ॥ 8

తస్యా దళం ముఖే కృత్వా తిలదర్భాసనే మృతం ।
నరో విష్ణుపురం యాతి పుత్రహీనోఽప్యసంశయః ॥ 9

తిలాః పవిత్రా స్త్రివిధా దర్భాశ్చ తులసీ తథా ।
నరం నివారయం త్యేతే దుర్గతిం యాంత మాతురమ్ ॥ 10

మమ స్వేదసముద్భూతా యత స్తే పావనా స్తిలాః ।
అసురా దానవాదైత్యా విద్రవంతి తిలై స్తతః ॥ 11

దర్భా విభూతి ర్మేతార్క్ష్య! మమ రోమసముద్భవాః ।
అత స్తత్స్పర్శనా దేవ స్వర్గం గచ్ఛంతి మానవాః ॥ 12

కుశమూలే స్థితో బ్రహ్మాకుశమధ్యే జనార్దనః ।
కుశాగ్రే శంకరో దేవ స్త్రయో దేవాః కుశేస్థితాః ॥ 13

అతః కుశా వహ్ని మంత్ర తులసీ విప్ర ధేనవః ।
నై తే నిర్మాల్యతాం యాంతి క్రియమాణాః పునఃపునః ॥ 14

దర్భాః పిండేషు నిర్మాల్యా బ్రాహ్మణాః ప్రేతభోజనే ।
మంత్రా గౌ స్తులసీ నీచే చితాయాం చ హుతాశనః ॥ 15

బ్రహ్మ విష్ణు శ్చ రుద్రశ్చ సర్వే దేవా హుతాశనః ।
మండలోపరి తిష్ఠంతి తస్మా త్కుర్వీత మండలమ్ ॥ 16

సర్వత్ర వసుధాపూతా లేపో యత్ర న విద్యతే ।
యత్ర లేపః కృత స్తత్ర పున ర్లేపేన శుధ్యతి ॥ 17

రాక్షసాశ్చ పిశాచాశ్చ భూతాః ప్రేతా యమానుగాః ।
అలి ప్తదేశే ఖట్వాయా మంతరిక్షే విశంతి చ ॥ 18

అతో ఽగ్నిహోత్రం శ్రాద్ధం చ బ్రహ్మభోజ్యం సురార్చనం ।
మండలేన వినా భూమ్యా మాతురం నైవ కారయేత్ ॥ 19

లిప్తభూమ్యా మతః కృత్వా స్వర్ణం రత్నం ముఖే క్షిపేత్ ।
విష్ణోః పాదోదకం దద్యా త్సాలగ్రామస్వరూపిణః ॥ 20

సాలగ్రామ శిలాతోయం యః పిబే ద్బిందుమాత్రకం ।
సర్వపాపవినిర్ముక్తో వైకుంఠ భువనం వ్రజేత్ ॥ 21

సర్వతీర్థ కృతస్నాన దానపుణ్య ఫలప్రదమ్ ।
చాంద్రాయణం చరేద్యస్తు సహస్రం కాయశోధనం ॥ 22

పిబేద్యశ్చైవ గంగాంభ స్సమౌ స్యాతా ముభా వపి ॥ 23

అగ్నిం ప్రాప్య యథా తార్క్ష్య! తూలరాశిర్వినశ్యతి ।
తథా గంగాంబు పానేన పాతకం భస్మ సాద్భవేత్ ॥ 24

యస్తు సూర్యాంశు సంత ప్తం గంగాయాస్సలిలం పిబేత్ ।
స సర్వయోనినిర్ముక్తః ప్రయాతి సదనం హరేః ॥ 25

సద్యో జలావగాహేన పావయం తీతరాన్ జనాన్ ।
దర్శనా త్స్పర్శనాత్పానా త్తథా గంగేతి కీర్తనాత్ ॥ 26

పునాత్య పుణ్యాన్పురుషా ఇ్ఛతశోఽథ సహస్రశః ।
గంగా తస్మాత్పిబే త్తస్య జలం సంసారతారకమ్ ॥ 27

గంగా గంగేతి యో బ్రూయాత్ప్రాణైః కంఠగతై రపి ।
మృతో విష్ణుపురం యాతి న పునర్జాయతే భువి ॥ 28

ఉత్క్రామద్భిశ్చ యః ప్రాణైః పురుష శ్రద్ధయాఽన్వితః ।
చింతయే న్మనసా గంగాం సోఽపి యాతి పరాం గతిమ్ ॥ 29

అతో ధ్యాయేన్న మే ద్గంగాం సంస్మరేత్తజ్జలం పిబేత్ ।
తతో భాగవతం కించి చ్ఛృణుయాన్మోక్షదాయకమ్ ॥ 30

శ్లోకం శ్లోకార్థ పాదం వా యోఽంతే భాగవతం పఠేత్ ।
న తస్య పునరావృత్తి ర్బ్రహ్మలోకా త్కదాచన ॥ 31

వేదోపనిషదాం పాఠాచ్ఛివ విష్ణుస్తవా దపి ।
బ్రాహ్మణ క్షత్రియ విశాం మరణం ముక్తిదాయకమ్ ॥ 32

ప్రాణప్రయాణసమయే కుర్యా దనశనం ఖగ ।
దద్యా దాతురసన్న్యాసం విరక్తస్య ద్విజన్మ నః ॥ 33

సంస్య స్తమపి యోబ్రూయా త్ప్రాణైః కంఠగతై రపి ।
మృతో విష్ణుపురం యాతి న పునర్జాయతే భువి ॥ 34

ఏవం జాత విధానస్య ధార్మికస్య తదా ఖగ! ।
ఊర్ధ్వచ్ఛిద్రేణ గచ్ఛంతి ప్రాణాస్తస్య సుఖేన హి ॥ 35

ముఖం చ చక్షుషీ నాసే కర్ణౌద్వారాణి సప్త చ ।
ఏభ్య స్సుకృతినో యాంతి యోగిన స్తాలురంధ్రతః ॥ 36

అపానా న్మిళితప్రాణో యదా హి భవతి పృథక్ ।
సూక్ష్మీభూత్వా తదా వాయుర్వినిష్క్రామతి పుత్తలాత్ ॥ 37

శరీరం పతతే పశ్చా న్నిర్గతే మరుతీశ్వరే ।
కాలాఽహతం పత త్యేవం నిరాధారో యథా ద్రుమః ॥ 38

నిర్విచేష్టం శరీరం తు ప్రాణైర్ముక్తం జుగుప్సితం ।
అస్పృశ్యం జాయతే సద్యో దుర్గంధం సర్వనిందితమ్ ॥ 39

త్రిధా వస్థా శరీరస్య క్రిమిఽవి ట్భస్మరూపతః ।
కిం గర్వః క్రియతే దేహే క్షణవిధ్వంసిభి ర్నరైః ॥ 40

పృథివ్యాం లీయతే పృథ్వీ అప శ్చైవ తథాఽప్సు చ ।
తేజ స్తేజసి లీయేత సమీరస్తు సమీరణే ॥ 41

ఆకాశశ్చ తథా ఽఽకాశే సర్వవ్యాపీ చ శంకరః ।
నిత్యముక్తో జగత్సాక్షీ ఆత్మా దేహే ష్వజోఽమరః ॥ 42

సర్వేంద్రియయుతో జీవ శ్శబ్దావిషయైర్వృతః ।
కామరాగాదిభి ర్యుక్తః కర్మః కోశసమన్వితః ॥ 43

పుణ్యవాసనయా యుక్తో నిర్మితే స్వేన కర్మణా ।
స ప్రవిశ్య నవే దేహే గృహే దగ్ధే యథా గృహీ ॥ 44

తదా విమాన మాదాయ కింకిణీజాలమాలి యత్ ।
ఆయాంతి దేవదూతాశ్చ లసచ్చామరశోభితాః ॥ 45

ధర్మతత్త్వవిదః ప్రాజ్ఞా స్సదా ధార్మికవల్లభాః ।
తథైనం కృతకృత్యం స్వర్విమానేన నయంతి తే ॥ 46

సుదివ్య దేహో విరజోంబర స్రక్సువర్ణ రత్నాభరణై రుపేత ।
దానప్రభావా త్సమహానుభావః ప్రాప్నోతి నాకం సురపూజ్యమానః ॥ 47

# దహన సంచయన విధానం

గరుత్మంతా! తల్లితండ్రులకి పుత్రుడు అంత్యక్రియలు సక్రమంగా చేస్తే, ఎన్నో దానాలు చేయాల్సిన అవసరం లేదు. అంత్యకర్మ చేయటం ద్వారా సకల యజ్ఞాలు చేసిన ఫలం అతడు పొందుతాడు.

★ తండ్రి మరణించగానే పుత్రుడు తీవ్రమైన దుఃఖాన్ని పొందకుండా సకల పాపాలూ పోవటం కోసం క్షౌరం చేయించుకుని బంధువుల సాయంతో మరణించిన తల్లి లేక తండ్రికి అంత్యక్రియలు చేయటం ప్రారంభించాలి.

★ తల్లి/తండ్రి మరణించినప్పుడు తనయుడు గుండు కొట్టించుకోకపోతే అలాంటివాడు సంసార సాగరాన్ని దాటిరాలేడు

★ అంత్యకర్మ చేసేవాడు గోళ్ళు, చంకలభాగం విడిచి మిగిలిన ప్రదేశాల్లో వపనం చేయించుకోవాలి.

★ ముందుగా పవిత్రమైన జలంతో శవానికి స్నానంచేయించి, మంచిగంధం, మూలికలు, గంగానదిలోని మట్టి మొదలైన వాటితో అలంకరించాలి.

★ శవానికి నూతన వస్త్రాలు కప్పి, అపసవ్యం చేసుకొని సంకల్పంచేసి గోత్రనామాలు చెప్పుకుని పిండాన్ని దక్షిణ సహితంగా సమర్పించాలి.

★ మనిషి మృతి చెందాక అతన్ని 'శవం' గా వ్యవహరిస్తారు. ఆ మానవుడు బ్రతికి ఉన్నప్పుడు ఏపేరు గోత్రాలతో వ్యవహరించబడేవాడో అవే పేరు గోత్రాలతో పిండాన్ని సమర్పించాలి. ఇలా ఇవ్వటం వల్ల శవానికి ఆధారంగా ఉన్న భూమి ఎంతో సంతోషిస్తుంది.

★ మరణించిన వాడిని దుర్గతి పాలుచేయటానికి ద్వారం బైట నికృష్టమైన జంతువులు కొన్ని కాచుకుని ఉంటాయి. అలాంటివన్నీ పిండం సమర్పించటం ద్వారా సంతృప్తి చెంది జీవుడికి ఎలాంటి హానీ చేయవు.

★ మృతిచెందినవాడికి పిండం ఇచ్చిన తరువాత పుత్రులు, కోడళ్ళు, బంధువులు నమస్కరించి శవం చుట్టూ ప్రదక్షిణ చేయాలి. తరువాత కుమారులు, బంధువులు శవాన్ని భుజంపై మోస్తూ శ్మశానానికి తీసుకుపోవాలి.

★ తండ్రి చిన్నతనంలో తన భుజాలమీదా, వీపుమీదా ఎక్కించుకుని ఎంతో ప్రేమగా లాలనగా చూస్తాడుకాబట్టి, తనయుడుకూడా, మరణించిన తండ్రి శరీరాన్ని భుజాలపై మోస్తూ సాగనంపాలి. ఇలా చేయటం వల్ల తండ్రి ఋణ తీర్చుకున్న వాడవుతాడు.

★ శ్మశానంలో శుభ్రంగా ఊడ్చి నీళ్ళు చల్లి పరిశుభ్రం చేయాలి. అలా చేయటం వల్ల ఆ ప్రేతానికి ఊర్ధ్వమార్గంలో విశ్రాంతి దొరుకుంది. ఇలా శుభ్రం చేసాక శవానికి స్నానంచేయించి భూతంగా మారిన ఆ ప్రేతానికి పిండాన్ని ఇవ్వాలి.

★ పిశాచాలు, యక్షులు శవాన్ని తాకితే అది దహనం చేయటానికి అర్హంకాదు కనుక, ఆ పిశాచాలు శవాన్ని తాకకుండా వుండటంకోసం పిండ ప్రదానం చేయాలి.

★ శ్మశానంలో శవానికి దహనసంస్కారం చేసేముందు "ఓ అగ్నిహోత్రుడా! ఈ సమస్తభూతాలనీ భరించేవాడివి నీవే ఈ ప్రపంచానికి కారణభూతుడివి, సకల భూతాలనీ పాలించేవాడివి నీవేకనుక మరణించిన ఈ జీవుణ్ణి స్వర్గలోకానికి చేర్చు" అని ప్రార్థించాలి.

★ అగ్నిహోత్రుణ్ణి ప్రార్థించిన తరువాత చందనం, తులసి, మోదుగ, రావి, కట్టెలతో చితిని ఏర్పరచాలి.

★ ప్రేతని (శవాన్ని) చితిమీద చేర్చి ఆ చితిలో ఒక పిండాన్ని, శవం చేతిలో మరో పిండాన్ని, ప్రేత శరీరుడి పేరు చెప్పి మరో రెండు పిండాల్ని చేతిలో ఉంచాలి. చితిమీదకి చేరిన దగ్గర నుంచీ జీవుడికి ప్రేతత్వం వస్తుంది.

★ అంత్యేష్ఠి విధానాన్ని అనగా ఉత్తర క్రియలు బాగా తెలిసిన పండితులు కొందరు శవాన్ని 'ప్రేతం' అనికాకుండా 'సాధక' అనే పేరుతో వ్యవహరిస్తారు. ఈ రెండు పేర్లలో ఏదో ఒక పేరు చెప్పి మరోపిండాన్ని శవంచేతిలో ఉంచాలి.

★ మొత్తం అయిదు పిండాలు చితిలో ఉంచితేగానీ శవం దహించటానికి యోగ్యంకాదు. అలా గనుక పిండాలు సమర్పించకపోతే భూతాలు, పిశాచాలు జీవుణ్ణి దర్గతి పాలుచేస్తాయి.

★ ప్రేత హస్తంలో పిండం ఉంచిన తరువాత శవం దహనయోగ్యమవుతుంది. అప్పుడు ధనిష్ఠాపంచకం లేకుండా చూసుకుని ఇంతకుముందు శ్మశానంలో చేసిన హోమాగ్ని నుంచి నిప్పుని తీసుకుని గడ్డితో సహా చితిని ముట్టించాలి.

★ ధనిష్ఠా పంచకంలో మరణించినవాడికి సద్గతులు కలుగవు. ధనిష్ఠా పంచకంలో మృతిచెందినవాణ్ణి దహనం చేయకూడదు. అలాచేసిన వాడికి అచిరకాలంలోనే మరణం కలుగుతుంది.

★ ధనిష్ఠా పంచకం అంటే ధనిష్ఠా నక్షత్రం పూర్వార్థం నుంచి రేవతీ నక్షత్రం దాకా వున్న అయిదు నక్షత్రాలు. ఇవి దహనానికి యోగ్యంకాని నక్షత్రాలు. ఇవి దుష్టనక్షత్రాలు. ఈ నక్షత్రాలలో మరణించిన వాడి ఇంట్లో కీడు సంభవిస్తుంది. వారి సంతానానికి గానీ, జ్ఞాతులకి గానీ కష్టాలు కలుగుతాయి.

## ధనిష్ఠా నక్షత్ర శాంతి

★ ధనిష్ఠా పంచకంలో మరణించిన వాణ్ణి దహనం చేయాల్సివస్తే, దర్భలతో నాలుగు బొమ్మలు తయారుచేసి, వాటిని 'ఋక్ష' మంత్రాలతో అభిమంత్రించి, శవానికి దగ్గర్లో ఉంచాలి. "ప్రేతయత' అనే మంత్రాన్ని ఉచ్చరించి తిరిగి హోమం చేయాలి. తరువాత ఆ దర్భల బొమ్మలతో సహా దహనం చేయాలి.

★ ఈదోష పరిహారం కోసం సపిండీకరణ కార్యక్రమంలో శాంతిని జరపాలి.

★ నువ్వులు నింపిన పాత్రని, బంగారం, వెండి, రత్నాలు, నేతితో నింపిన కంచుపాత్రని విప్రులకి దానం ఇవ్వాలి. దీని ద్వారా ధనిష్ఠా పంచక దోషం నశిస్తుంది. ఈవిధంగా శాంతిని చేస్తే ప్రేత ఎలాంటి విఘ్నాలూ కలగకుండా ఉత్తమలోకాలు చేరుకుంటాడు.

## దహనం జరిగేడప్పుడు తరువాత చేయాల్సిన విధులు

★ శరీరం సగం దహనమైన తరువాత గానీ, పూర్తిగా దహనమైన తరువాత గానీ శవం తలని భేదించాలి (పగలకొట్టాలి) ఆవిధంగా బ్రహ్మరంధ్రాన్ని భేదించిన తరువాత మాత్రమే జీవుడు పితృలోకానికి చేరుకుంటాడు.

గృహస్థుల్ని భేదించేడప్పుడు ఇతర కొయ్యల్ని యతీంద్రులకైతే మారేడు కొయ్యని ఉపయోగించాలి.

★ దహనం జరిగిన తరువాత కుమారుడు తండ్రి గురించి ఆజ్యహోమం చేయాలి.

★ ఓ అగ్నిహోత్రుడా! నీవు నారాయణ స్వరూపుడివి. నీవల్ల ఈ జీవుడు దివ్యమైన శరీరాన్ని పొంది స్వర్గలోకానికి చేరుకునేలా చేయి. ఈ జీవుడి స్థూల శరీరం నీకు సమర్పించబడుతోంది. దీన్ని సంపూర్ణంగా దహించి ఈజీవుడికి అద్వితీయమైన శరీరాన్ని ప్రసాదించు" అనే అర్థం వచ్చే మంత్రాల్ని పఠిస్తూ హోమం చేయాలి.

★ నెయ్యి నువ్వులు కలిపి ప్రేతం కోసం హోమంచేసిన తరువాత బాగా ఏడవాలి. ఆవిధంగా చేస్తే జీవుడికి ఎంతో సుఖం: కలుగుతుంది.

★ శవదహనం అయిపోయాక స్త్రీలు స్నానం చేయాలి. తరువాత కుమారుడు స్నానంచేసి, తండ్రిపేరు గోత్రాలు చెప్పి తిలోదకాలు విడవాలి

★ తిలోదకాలు ఇచ్చిన తరువాత కొద్దిగా వేపాకు తినాలి. మరణించిన వ్యక్తి గుణగణాల్ని ప్రశంసించాలి.

★ మానవుడు మరణించిన ప్రదేశంలో దక్షిణ ముఖంగా పేడతో చక్కగా అలికి రాత్రి పగలు వెలిగేలా దీపారాధన చేయాలి

★ సూర్యాస్తమయం సమయంలో ఒక మట్టి ముంతలో పాలుగానీ, నీళ్ళుగానీ ఉంచి దాన్ని శ్మశానంలోగానీ, నాలుగు వీధులు కలిసిన ప్రదేశంలో కానీ, మూడు రోజుల పాటు వరుసగా వుంచాలి.

★ మట్టిపాత్రలో పాలు/నీళ్ళు ఉంచి, అయ్యా నీవు శ్మశానంలో అగ్నిద్వారా దహించబడ్డావు. బంధువులందరూ నిన్ను వదిలేసి వెళ్ళారు. కాబట్టి ఈ పాత్రలో ఉంచిన పాలను/ నీళ్ళను త్రాగు అని చెప్పాలి.

★ శ్మశానానికి వెళ్ళి స్నానం చేసి పరిశుద్ధుడైన పుత్రుడు నూలుపోగుతో చుట్టిన పవిత్రాన్ని ధరించి శ్మశానంలో ఉండే భూతాలకి మినుములతో

చేసే గారెల్ని బలిగా సమర్పించి 'యమాయత్వా' అనే మంత్రాన్ని చదువుతూ మూడుసార్లు ప్రదక్షిణ చేయాలి.

## అస్థి సంచయనం

★ శవాన్ని దహనంచేసిన ప్రదేశంలో ముందుగా పాలు చల్లి తరువాత నీళ్ళు చల్లి అక్కడున్న ఎముకల్ని తీయాలి.

★ తీసిన ఎముకల్ని మోదుగ ఆకుల్లో ఉంచి, వాటిని పాలతో నీళ్ళతో కడిగి మట్టిముంతలో ఉంచాలి. ఆ తరువాత యధావిధిగా శ్రాద్ధాన్ని నిర్వహించాలి.

★ ఒక ప్రదేశంలో మూడుకోణాలు కలిసేలా శుభ్రంచేసి, గోమయంతో అలికి, దక్షిణాభిముఖంగా కూర్చుని మూడు దిక్కులా మూడు పిండాల్ని ఉంచాలి.

★ ఉత్తర దిక్కుగా పదిహేనుఅడుగులు వెళ్ళి అక్కడొక గొయ్యి త్రవ్వి అందులో ఎముకలు వేసిన కుండని ఉంచాలి.

★ గోతిలో ఉంచిన ఎముకల ముంతమీద ఒక పిండాన్ని సమర్పించాలి. తరువాత ఆముంతని తీసుకుని ఒక చెరువు దగ్గరకి వెళ్ళాలి. అక్కడ పాలతో, నీళ్ళతో ఎముకల్ని బాగా కడిగి, మంచిగంథం, కుంకుమ పూయాలి.

★ ఎముకలుంచిన ముంతని తలమీద ఉంచుకుని చెరువులోకి దిగి వాటిని నిమజ్జనం చేయాలి.

## గంగానదిలో అస్థినిమజ్జన ఫలం

అంతర్దశాహం యస్యాస్థి గంగాతోయే నిమజ్జతి ।
న తస్య పునరావృత్తి ర్బ్రహ్మలోకాత్కదాచన ॥ 1

యావదస్థి మనుష్యస్య గంగాతోయేషు తిష్ఠతి ।
తావద్వర్ష సహస్రాణి స్వర్గలోకే మహీయతే ॥ 2

గంగాజలోర్మి సంస్పృశ్య మృతకం పవనో యథా ।
స్పృశతే పాతకం తస్య సద్యఏవ వినశ్యతి ॥ 3

ఆరాధ్య తపసోగ్రేణ గంగా దేవీం భగీరథః ।
ఉద్ధారార్థం పూర్వజానా మానయ ద్బ్రహ్మలోకతః ॥ 4

త్రిషు లోకేషు విఖ్యాతం గంగాయాః పావనం యశః ।
యాపుత్రా స్సగర స్యైతా న్భస్మాఖ్యా ననయ ద్దివమ్ ॥ 5

పూర్వే వయసి పాపాని యే కృత్వా మానవా మృతాః ।
గంగాయా మస్థిపతనా త్స్వర్గలోకే ప్రయాంతి తే ॥ 6

కశ్చిద్వ్యాధో మహారణ్యే సర్వప్రాణిహింసకః ।
సింహేన నిహతో యావ త్ప్రయాతి నరకాలయే ॥ 7

తావత్కాలేన తస్యాస్థి గంగాయాం పాతితం తదా ।
దివ్యం విమాన మారుహ్య స గతో దేవమందిరమ్ ॥ 8

అతస్స్వమేవ సత్పుత్రో గంగాయా మస్థి పాతయేత్ ।
అస్థిసంచయనా దూర్ధ్వం దశరాత్రం సమాచరేత్ ॥ 9

అథ కశ్చి ద్విదేశేవా వనే చోరభయే మృతః ।
న లబ్ధ స్తస్య దేహ శ్చే చ్ఛ్రుణుయా ద్యద్దినేతదా ॥ 10

దర్భపుత్తలకం కృత్వా పూర్వవ త్కేవలం దహేత్ ।
తస్య భస్మ సమాదాయ గంగాతోయే వినిక్షిపేత్ ॥ 11

దర్భపుత్తలకం కృత్వా పూర్వవ త్కేవలం దహేత్ ।
దశరాత్రాదికం సమాదాయ గంగాతోయే వినిక్షిపేత్ ॥ 12

తస్య భస్మ సమాదాయ గంగాతోయే వినిక్షిపేత్ ।
స ఏవ దివసో గ్రాహ్య శ్శ్రాద్ధే సాంవత్సరాదికే ॥ 13

గంగాతీరే మృతం బాలం గంగాయామేవ పాతయేత్ ।
అన్యదేశే క్షిపే ద్భూమౌ సప్తవింశతి మాసజమ్ ॥ 14

అతః పరం దహేత్తస్య గంగాయా మస్థి నిక్షిపేత్ ।
గర్భేనష్టే క్రియా నా స్తి దుగ్ధం దేయం మృతే శిశౌ ॥ 15

★ ఎవరి ఎముకలైతే మరణించిన పదిరోజుల్లో గంగా నదిలో నిమజ్జనం చేయబడతాయో, అలాంటివాడు సరాసరి బ్రహ్మలోకానికి చేరుకుంటాడు.

యావదస్థి 'మనుష్యస్య గంగాతోయేషు తిష్ఠతి ।
తావద్వర్ష సహస్రాణి స్వర్గలోకే మహీయతే ॥

మరణించిన మానవుడి ఎముకలు గంగాజలాలలో ఎంతకాలం వుంటాయో, అన్ని వేల సంవత్సరాలు ఆ జీవుడు స్వర్గలోకంలో సుఖంగా వుంటాడు.

★ గంగానదిమీద నుంచి విసిరిన గాలి మరణించిన వాడి శరీరాన్ని తాకినా చాలు వాడి పాపాలన్నీ తక్షణమే నశిస్తాయి.

★ పూర్వం భగీరథుడు తన పూర్వీకులందర్నీ తరింపచేయాలని గంగని భూమిమీదకి తెచ్చాడు

★ సగరుడి కుమారులు అవివేకంతో కపిలమహర్షి ఆ గ్రహానికి గురై భస్మ రాశులుగా మిగిలారు. అలాంటి పాపాత్ముల భస్మరాశుల మీద ప్రవహించి వారందర్నీ తరింపచేసేంది కాబట్టి గంగకి ముల్లోకాల్లో ఎంతో గొప్పనదిగా పేరు వచ్చింది.

★ ఏ మానవుడైనా తానుజీవించి ఉన్నప్పుడు ఎన్ని పాపాలుచేసినా, మరణించాక అతడి ఎముకలు గంగలోకలిపితే చాలు అతడు చేసిన పాపాలన్నీ నశిస్తాయి.

★ పూర్వం ఒక కిరాతుడు సింహం చేతిలో చంపబడ్డాడు. కిరాతుడి మాంసాన్నంతా తిని వెళ్ళిపోయింది సింహం. అంతలో అక్కడికొక కాకి వచ్చి కిరాతుడి ఎముకని నోటకరుచుకుంది. అది గంగానదిమీదుగా ఎగురుతూదాన్ని ఆనదిలోకి విడిచిపెట్టింది. అంతే! ఆ పుణ్యఫలితంగా ఒక దివ్యవిమానం దేవలోకం నుంచి వచ్చి కిరాతుణ్ణి ఎక్కించుకుని వెళ్ళిపోయింది.

ఇదీ గంగానదికున్న ప్రాముఖ్యం.

★ ఇంత గొప్ప పుణ్యఫలాలు కలిగిస్తుంది. కనుకే పుత్రుడు తండ్రి / తల్లి ఎముకల్ని గంగానదిలో నిమజ్జనం చేయాలి.

★ ఎవరైనా ఇతర ప్రదేశాల్లో మరణించినా, శవందొరకని సందర్భాలలో, అవ్యక్తి మరణవార్తని ఎప్పుడు వింటారో ఆ రోజే దర్భలతో ఒక మనిషి

ఆకారాన్ని తయారుచేసి, యధావిధిగా శవదహనం చేసినట్టే చేసి ఆ బూడిదని గంగలో కలపాలి.

## శిశువుల స్త్రీల శిశువుల దహన విధానం

★ ఎవరైనా స్త్రీ పూర్తి గర్భిణిగా ఉండి మరణిస్తే, ఆమె ఉదరాన్ని చీల్చి లోపలున్న శిశువుని బైటికి తీసి ఆ తరువాతే ఆమె శరీరాన్ని దహనం చేయాలి.

★ గంగా తీరంలో మరణించిన శిశువుని గంగలోనే నిమజ్జనం చేయాలి.

★ గర్భం సంపూర్ణం కాకుండా గర్భస్రావం జరిగితే ఏ రకమైన జలకుంభ దానం చేయక్కర్లేదు.

★ శిశువు జన్మించిన ఆరునెలల్లోగా మరణిస్తే పాలని దానం చెయ్యాలి.

★ ఐదు సంవత్సరాలలోపు పిల్లలు మరణిస్తే అదే వయసుగల పిల్లలకి భోజనం పెట్టాలి. అలాగే పదిసంవత్సరాలలోపు బాలుడు మరణిస్తే, అదే వయసు కలిగిన బాలురచేత భుజింప చేయాలి.

★ ఉపనయనం సంస్కారం జరిగిన బాలుడు మరణిస్తే ఉపనయనం జరిగినవాడికే భోజనం పెట్టాలి.

★ ఉపనయనం అయినా, కాకపోయినా అయిదు సంవత్సరాలు దాటిన బాలుడు మృతి చెందితే, పరమాన్నంతోగానీ, బెల్లంతోగానీ, పదిపిండాల్ని క్రమంగా పెట్టాలి.

★ స్త్రీలు, శూద్రులు ఉపనయన సంస్కార యోగ్యులుకారు. స్త్రీలకి వివాహం జరిగితేనే కర్మ చేయటానికి అర్హులౌతారు. ఉపనయనం కానప్పుడు అన్ని వర్ణాలవారికీ ఉత్తర క్రియలు వయసుననుసరించి జరపాలి.

★ పదినుంచి పదహారు సంవత్సరాలు వయసు వరకూ ఉన్నవాడు యౌవన దశలోకి వచ్చిన వాడిగా పరిగణించబడతాడు. ఆ వయసులో ఉన్న వ్యక్తి మరణిస్తే, వృషోత్సర్జనం, శయ్యాదానం, పాదుకాదానం, గోదానం, షోడశ మహాదానాలు చేయించాలి.

# యతుల ఉత్తర క్రియలు

యతీనాం చైవ సర్వేషాం న దాహో నోదకక్రియా ।
దశరాత్రాదికం తేషాం న కర్తవ్యం సుతాదిభిః ॥ 1

దండగ్రహణమాత్రేణ నరో నారాయణో భవేత్ ।
త్రిదండగ్రహనా త్తేషాం ప్రేతత్వం నైవ జాయతే ॥ 2

జ్ఞానినస్తు సదా ముక్తా స్స్వరూపానుభవేన హి ।
అత స్తేతు ప్రదత్తానాం పిండానాం నైవ కాంక్షిణః ॥ 3

తస్మాత్పిండాదికం తేషాం న తు నోదక మాచరేత్ ।
తీర్థశ్రాద్ధం గయాశ్రాద్ధం పితృభక్త్యా సమాచరేత్ ॥ 4

హంసం పరమహంసం చ కుటీచక బహూదకౌ ।
ఏతాం త్సన్న్యాసినాం తార్క్ష్య! పృథివ్యాం స్థాపయేన్మృతాన్ ॥ 5

గంగాదీనా మభావేఽపి పృథివ్యాం స్థాపనం స్మృతం ।
యత్ర సంతి మహానద్య స్తదా తాస్వేవ నిక్షిపేత్ ॥ 6

★ నాలుగు విధాల యతీశ్వరులకి దహనం, ఉదకదాన విది చేయాల్సిన అవసరంలేదు. వారికి దినదిన కర్మ కూడా చేయక్కర్లేదు.

★ మానవుడు విధివిధానంగా సన్యసించి, దండాన్ని గ్రహించిన వెంటనే విష్ణు స్వరూపుడౌతాడు. కనుక సన్యాసం పొందిన వారికి ప్రేత స్వరూపం కలగదు.

★ జ్ఞానులైన యతులు స్వస్వరూపాన్ని తెలుసుకున్న వారుకాబట్టి వారు ఎప్పుడూ మోక్షాన్ని పొందే వుంటారు.

★ నిత్యముక్తులైన యతులకి పిండప్రదానాలు ఏమాత్రం ఉపయోగపడవు. తీర్థశ్రాద్ధాలు, గయాశ్రాద్ధాలు ప్రేమతో చేసినప్పటికీ వారికీ వాటి అవసరమే ఉండదు.

★ యతుల్లో హంస, పరమహంస, కుటీచక, బహూదకులని నాలుగు రకాల వారుంటారు. వీరందరికీ మరణం సంభవించినప్పుడు, వారికి దహన

సంస్కారాలు చేయకూడదు. భూమిలో ఖననం చేయాలి. వారికొక సమాధి నిర్మించాలి.

★ యతీశ్వరుల పార్థివ శరీరాన్ని గంగాది నదులు లేని ప్రదేశంలోనైతే భూమిలో సమాధి చెయ్యాలిగానీ, గంగాది పుణ్యనదుల సమీపంలో మరణిస్తే వారిని జలసమాధి చేయటం ఉత్తమం.

## దశరాత్ర విధానం

"గరుత్మంతా! యోగ్యుడైన విప్రుడు దశరాత్ర కర్మని ఆచరించి పితృఋణం తీర్చుకుంటాడు. ఆ దశరాత్ర కర్మవిధానం ఎలా ఆచరించాలో చెబుతున్నా విను"

★ తండ్రి మరణించాక కుమారుడు దుఃఖాన్ని దిగమింగుకుని, ధైర్యంతో తల్లి/తండ్రులకి పిండ ప్రదానం చేయాలి, అంతేకానీ అదేపనిగా ఏడవకూడదు.

★ బంధువులందరూ భోరున విలపించటం వల్ల, ఆ బాధ మొత్తం ప్రేత అనుభవిస్తాడు కాబట్టి అధికంగా విలపించకూడదు. సంయమనంతో ఉండాలి.

యదివర్ష సహస్రాణి శోచతేஉ హర్నిశం నరః ।
తథాపినైవ నిధనం గతో దృశ్యేత కర్హిచిత్ ॥

★ గరుత్మంతా! జన్మించినవాడికి మరణం తప్పదు. మరణించిన జీవికి తిరిగి జన్మించటం తప్పదు. ఇవి రెండూ తప్పించుకోలేనివి. వీటికోసం ఎంత ఏడ్చినా ప్రయోజనముండదు.

★ మృత్యువుని తప్పించుకోవటం దేవతలకి సాధ్యంకానీ మానవజన్మ ఎత్తిన వాడికది సాధ్యంకాదు. మరణించిన వ్యక్తి తిరిగి భూమ్మీద ఏదో రూపంలో జన్మించాల్సిందే.

★ ఈ విషయాన్ని గ్రహించిన పుత్రుడు ధైర్యంగా ఎలాంటి దుఃఖాన్ని పొందకుండా ప్రేతకర్మని ఆచరించాలి.

# సంతానం లేనివారికి ఉత్తర క్రియలు

★ మరణించిన వాడికి పుత్రులు లేకపోతే అతడిభార్య ఉత్తర క్రియలు చేయాలి. భార్య లేకపోతే సోదరుడు అతడు కూడా లేకపోతే సోదరుడి కుమారుడుగానీ, జ్ఞాతిగానీ, శిష్యుడుగానీ, అన్నదమ్ముల పుత్రులు కానీ, మనుమలు గానీ దశదిన కర్మ చేయవచ్చు

★ ధర్మశాస్త్రం ప్రకారం అన్నదమ్ముల్లో ఒకడికి సంతానం కలగితే వారందరికీ కలిగినట్టే. ఇది మనువు చెప్పిన మాట

★ ఒకడికి ఎంతోమంది భార్యలుండి వారిలో ఒక్కతెకే పుత్రుడు జన్మిస్తే వారంతా సంతానవతులే అవుతారు

★ సంతానం లేనివారికి స్నేహితుడు శ్రాద్ధం పెట్టవచ్చు. ఎవరూ దొరకకపోతే పురోహితుడైనా శ్రాద్ధం పెట్టవచ్చు. అంతేకానీ మానేయకూడదు. అనాథప్రేత సంస్కారా త్కోటియజ్ఞఫలం లభేత్॥ (శ్లో॥18.అధ్యా 11)

★ గరుత్మంతా అనాథ ప్రేతాలకి సంస్కారం చేస్తే ఎన్నో యజ్ఞాలు చేసిన ఫలం లభిస్తుంది.

★ తండ్రి మరణిస్తే కుమారుడు పదిరోజుల కర్మచేయాలి. అదే పెద్దకుమారుడు ముందుగా మరణిస్తే తండ్రి ఎక్కువగా విచారపడకూడదు.

★ తండ్రికి ఎంతోమంది పుత్రులు ఉన్నప్పటికీ వారిలో ఒక్కడే కర్మని మొత్తం చేయాలి. పుత్రులందరూ తండ్రి ఆస్తిని పంచుకుని వేరుగా వున్నప్పటికీ, దశదిన కర్మని, షోడశశ్రాద్ధాన్ని, సపిండీకరణని, పెద్దకుమారుడు ఒక్కడే ఆచరించాలి. అయితే వేరుగా వున్న కుమారులు, ఆబ్దికాలు, మాసికాలు వేరుగా పెట్టుకోవచ్చు.

★ కర్మమొత్తం చేసే బాధ్యత పెద్ద కుమారుడే వహిస్తాడు కాబట్టి, నియమాలన్నీ అతడే శ్రద్ధగా పాటించాలి.

★ కర్మచేసినన్ని రోజులూ ఒకపూటే భోజనం చేసి, నేలమీదే నిద్రపోవాలి. మిగిలిన పుత్రులు కూడా ఏకభుక్తాన్ని పాటించాలి.

★ ఏ పుత్రుడైతే తల్లి తండ్రులకి కర్మని శాస్త్ర బద్ధంగా చేస్తాడో అతడు భూమికి ఏడుసార్లు ప్రదక్షిణ చేసిన ఫలితాన్ని పొందుతాడు.

తస్మాదాది దివాదూర్ధ్వం ప్రాక్సపిండీ విధానతః ।
యోషితః పురుషస్యాపి ప్రేతశబ్దం సముచ్చరేత్ ॥

★ మొదటిరోజు నుంచి సపిండీకరణం వరకూ కర్మచేసేడప్పుడు, స్త్రీలకి గానీ, పురుషులకి గానీ 'ప్రేత' శబ్దాన్ని ఉచ్చరిస్తూనే పిండాల్ని సమర్పించాలి. ఎందుకంటే ప్రేతశబ్దం విశేషమైన ఫలాన్నిస్తుంది కనక.

★ మొదటిరోజు ఏవిధంగా పిండాన్ని సమర్పిస్తారో, అదేవిధంగా తొమ్మిదోరోజు కూడా తొమ్మిది పిండాల్ని ఇవ్వాలి. అనగా మొదటిరోజు అన్నంతో పిండాలు పెడితే తొమ్మిదోరోజు అన్నంతో, పాయసంతో చేస్తే, అదేపాయసంతో, పిండప్రదానం చేయాలి.

★ తొమ్మిదోరోజు మరణించిన వ్యక్తికి స్వర్గం లభించాలని కోరుకుంటూ నూనెతో స్నానం చేయాలి(నూనె రాసుకుని)

★ గృహానికి బైటే ఏ నదీ/చెరువులోనో స్నానం చేసి గరికని, పేలాలని తీసుకుని, సువాసినీ స్త్రీలని ముందు నడవమని మరణించిన వాడింటికి జ్ఞాతులు రావాలి.

★ తాముతెచ్చి గరికలు వృద్ధిచెందేవిధంగా అతడి కులం వృద్ధి చెందాలని, పేలాలు విజృంభించినట్టుగా, అతడి వంశంకూడా విస్తరించాలని కోరుకుంటూ, గరికెని, పేలాలని మృతుడి ఇంట్లో చల్లాలి.

★ గరుత్మంతా పదోరోజు పిండప్రదానాన్ని మాంసంతో చేయాలి. అయితే కలియుగంలో మాంసాన్ని నిషేధించారు కనుక మాంసంతో సమానమైన మినుములతో సమర్పించాలి.

★ పదోరోజు జ్ఞాతులందరూ క్షౌరం చేయించుకోవాలి.

★ కర్మచేసే పుత్రుడు మాత్రం సపిండీకరణ పూర్తయిన తరువాతే చేయించుకోవాలి.

★ పదోరోజు ఒక బ్రాహ్మణుడికి షడ్రసోపేతంగా భోజనం పెట్టాలి. తరువాత రెండు చేతులూ జోడించి మృతి చెందిన వ్యక్తికి ప్రేత శరీరం నశించాలని ఇలా ప్రార్థించాలి.

అతసీపుష్ప సంకాశం పీతవాస సమచ్యుతం ।
యే నమస్యంతి గోవిందం నతేషాం విద్యతే భయం ॥
అనాది విభవో దేవ శృంఖచక్ర గదాధరః ।
అక్షయః పుండరీకాక్ష ప్రేత మోక్ష ప్రదోభవ ॥

*(శ్లో॥41-42,అధ్యా-11)*

అవిశపువ్వుతో సమానమైన శరీరం కలిగినవాడు పచ్చని వస్త్రాలు ధరించేవాడు, నాశనమన్నదేలేనివాడు, అయిన విష్ణుమూర్తికి నమస్కరిస్తున్నాను. జననమరణాలు లేనివాడివి, దేవదేవుడివి, శంఖచక్ర గదాది ఆయుధాలు ధరించినవాడివి, నాశనరహితుడివి, పద్మాల్లాంటి విశాలమైన నేత్రాలు కలిగిన వాడివి అయిన ఓ నారాయణా! నా తండ్రికి ప్రేత జన్మ నుంచి విముక్తి ప్రసాదించు.

ఈ మంత్ర రూపశ్లోకాల్ని ప్రతిరోజూ శ్రాద్ధ కర్మ ముగిసిన తరువాత పఠించాలి.

## పదకొండో రోజు చేయాల్సిన విధులు

గరుత్మంతా! దశదినకర్మని శ్రద్ధగా పూర్తిచేసిన తరువాత పదకొండోరోజు ఉదయాన్నే లేచి నదీ తీరానికి వెళ్ళి ఊర్ధ్వదేహ సంబంధమైన పనులన్నీ విధిగా చేయాలి.

★ కర్మచేసేవాడు, వేదశాస్త్రాల్ని చదువుకున్న బ్రాహ్మణుణ్ణి భోక్తగా పిలిచి రెండు చేతులూ జోడించి ఆయనకి భక్తిగా నమస్కరించి తన తండ్రి/తల్లికి ప్రేత విముక్తి కలిగించమని ప్రార్థించాలి.

★ కర్మని చేయించే ఆచార్యుడు నిత్యం స్నాన సంధ్యావిధుల్ని ఆచరించి పరిశుద్ధుడుగా ఉండాలి.

★ పదిరోజుల పాటు ప్రేత పేరు గోత్రం మాత్రం చెప్పి మంత్రాలు లేకుండా శ్రాద్ధంచేయాలి. పదకొండో రోజు మాత్రం మంత్రాల్ని ఉచ్ఛరిస్తూ ప్రేతకి పిండప్రదానం చేయాలి.

## దేవతా తర్పణ విధి

★ విష్ణుమూర్తి ప్రతిమని బంగారంతో, బ్రహ్మదేవుడి ప్రతిమని వెండితతో, పరమేశ్వరుడి ప్రతిమని రాగితో యమధర్మరాజు ప్రతిమని ఇనుముతో చేయించాలి.

★ ఒక మండపాన్ని ఏర్పర్చి, వమండపానికి పడమరభాగంలో గంగాజలంతో నింపిన ఒక రాగి కలశాన్ని ఉంచి దానమీద పచ్చటి వస్త్రాలతో చుట్టిన శ్రీహరి ప్రతిమని ఉంచి ఆవాహనం చేయాలి.

★ మండపానికి తూర్పుభాగంలో కొద్దిగా పాలు, కొద్దిగా నీళ్ళతో నింపిన ఒక కలశాన్ని ఉంచాలి. దానిమీద తెల్లటి వస్త్రాలు చుట్టిన బ్రహ్మదేవుడి ప్రతిమని స్థాపించి, బ్రహ్మని ఆవాహన చేయాలి.

★ మండపానికి ఉత్తర దిశలో నెయ్యితో కలిపిన ఒక కలశాన్ని స్థాపించి, దానిమీద పరమేశ్వరుడి ప్రతిమని ఉంచి, పరమేశ్వరుణ్ణి ఆవాహన చేయాలి.

★ మండపానికి దక్షిణ దిశలో గంధం కలిపిన నీళ్ళని ఒక కలశంలో పోసి ఆ కలశాన్ని స్థాపించాలి. దానిమీద నల్లటి వస్త్రాలతో చుట్టిన యముడి ప్రతిమని ఆవాహన చేయాలి.

★ ఈ నాలుగు కలశాల మధ్యలో కౌశికమండపాన్ని ఏర్పరచి ఆయన్ని ఆవాహన చేయాలి. తరువాత ఆ మండపానికి దక్షిణాభిముఖంగా కూర్చుని, అపసవ్యం (జంధ్యం) చేసుకుని తర్పణం విడవాలి.

★ శ్రీహరికి, బ్రహ్మదేవుడికి, సాంబమూర్తికి, యమధర్మరాజుకి తర్పణాలు ఇచ్చి, హోమంచేసి, తరువాత ఆ కలశాల్ని దానం చేయాలి.

## దానాలు

★ కర్మని చేసినవాడు, పితృదేవతల్ని తలుచుకుని వారు తరించటం కోసం గోదానం చేయాలి.

★ గోదానం చేసేడప్పుడు "నారాయణా! నీవు ప్రీతిచెందటం కోసం ఈ గోదానం చేస్తున్నాను" అని చెప్పి దానం ఇవ్వాలి.

★ ప్రేత మరణించక ముందు అతడు వాడుకున్న వస్త్రాలు ఆభరణాలు, వాహనాలు, నెయ్యితో నింపిన కంచుపాత్ర సప్తధాన్యాలు, మృతుడికి ఏవి ఇష్టమో అని నువ్వులు మొదలైన మహాదానాలు మరణావస్థలో ఉన్నప్పుడు గనుక చేయకపోతే జీవి మరణించిన తరువాత గోదానం చేయాలి.

★ బ్రాహ్మణుడికి కాళ్ళు కడిగి, వస్త్రాలు ఆభరణాలు ఇచ్చి, షడ్రసోపేతంగా అతడికి భోజనం పెట్టాలి.

★ కర్మకాండ చేసిన పుత్రుడు, బంగారంతో ఒక పురుషాకారాన్ని తయారు చేయించి, ఆ ప్రతిమని కొత్తమంచం మీద ఉంచి, ఆ మంచాన్ని ప్రతిమతో సహా ఆయనకి దానం చేయాలి.

ప్రేతస్య ప్రతిమాయుక్తా సర్వోపకరణైర్వృతా ।
ప్రేత శయ్యా మయాహ్యేషా తుభ్యం విప్రనివేదితా ॥

*(శ్లో॥18,అధ్యా-12)*

"ఓ విప్రుడా! ప్రేత బంగారు ప్రతిమతో సహా ఈ శయ్యని నీకుదానం ఇస్తున్నాను" అని చెప్పి గృహస్థుడైన విప్రుడికి శయ్యాదానం చేయాలి. ఆయనకి ప్రదక్షిణలు చేసి నమస్కరించి పంపాలి.

ఈవిధంగా శయ్యాదానం చేయటం వల్ల శ్రద్ధగా శ్రాద్ధం పెట్టటం వల్ల, ఆబోతుని అచ్చేసి వదలటం వల్ల మృతి చెందినవాడు ఉత్తమలోకాలకి చేరుకుంటాడు.

**వృషోత్సర్జనం :** ఎర్రటి కళ్ళని కలిగింది, గోరోచనం లాంటి రంగు కలిగింది, కొమ్ములు, డెక్కలు, మెడ మీద సన్నటి ఎరుపురంగు కలిగినది. తెల్లటి ఉదరంతో ఉన్నది. నల్లటి వీపుతో వుండేది అయిన వృషభాన్ని అచ్చువేసి స్వేచ్ఛగా విడిచిపెట్టాలి. దీన్నే వృషోత్సర్జనం అంటారు.

★ ఆవిధంగా అచ్చు వేసి వదిలేసిన వృషభాన్ని బండిలాగటానికి, భూమి దున్నటానికి ఉపయోగించకూడదు. స్వేచ్ఛగా దాన్ని వదిలేయాలి.

★ తండ్రికి ఉత్తమగతులు కలగటం కోసం వృషోత్సర్జం, గయాశ్రాద్ధం పెట్టిన పుత్రుడే నిజమైన పుత్రుడు.

రౌరవాదిఘ యే కేచిత్పచ్యంతే యస్య పూర్వికాః ।
వృషోత్సర్గేణ తాం త్సర్వాం స్తారయే దేకవింశతిః ॥

*(శ్లో॥33,అధ్యా-12)*

గరుత్మంతా! ఎవరివంశీకులు నరకంలో తీవ్రమైన దుఃఖాన్ని పొందుతున్నారో! వారి వంశంలో పుట్టినవాడు వృషోత్సర్జనం (ఆంబోతుని అచ్చేసి వదిలేయటం) చేసినట్లైతే, ఇరవై ఒక్క తరాలు వారు తరిస్తారు.

★ బాల్యంలో, యౌవనంలో, వార్ధక్యంలో చేసిన పాపాలన్నీ అంబోతుని అచ్చేసి వదిలేయటం ద్వారా నశిస్తాయి

★ వృషోత్సర్గం చేసినవాడికి సంతానభాగ్యం కలుగుతుంది. వాడి కోరికలన్నీ తీరతాయి.

## షోడశ శ్రాద్ధం

★ షోడశశ్రాద్ధం అంటే పదహారు పిండాలతో చేసేది. అది మూడు రకాలుగా ఉంటుంది. ఆరు స్ధానాల్లో ఆరుపిండాలు పదిరోజుల్లో పెట్టే పది పిండాలు కలిపి మొత్తం పదహారు పిండాలతో కూడి ఈ శ్రాద్ధం మొదటిది.

★ వీటిలో మొదటి పిండాన్ని విష్ణువుకి, రెండో పిండాన్ని శివుడికి, మూడో పిండాన్ని పరివారంతో కూడిన యమధర్మరాజుకి ఇవ్వాలి. అంటే ఆయా దేవతల పేర్లు చెప్పి క్రమంగా పిండ ప్రదానం చేయాలి. నాలుగో పిండాన్ని

సోమరాజు అనే చంద్రుడికి, అయిదో పిండాన్ని దేవతలకి, యజ్ఞయాగాది కార్యాలలో హవ్యాన్ని అందించే అగ్నికి ఆరోపిండాన్ని, శ్రాద్ధాది కర్మలలో పితృదేవతలకి కవ్యాన్ని అందించే అగ్నికి ఏడోపిండాన్ని, విడిచిపెట్టాలి. రుద్రుడికి ఎనిమిదో పిండాన్ని, పురుషుడికి తొమ్మిదో పిండాన్ని, ప్రేతకి పదోపిండాన్ని, విష్ణుమూర్తికి పదకొండో పిండాన్ని నమస్కరించి సమర్పించాలి. ఇక పన్నెండో పిండాన్ని బ్రహ్మదేవుడికి, పదమూడో పిండాన్ని తిరిగి విష్ణువుకి, పద్నాలుగో పిండాన్ని శివుడికి, పదిహేనో పిండాన్ని యమధర్మరాజుకి, పదహారో పిండాన్ని తత్పురుషుడికి సమర్పించాలి. ఈ పదహారు పిండాలతో చేసే శ్రాద్ధాన్నే షోడశ పిండ శ్రాద్ధం అంటారు.

★ కర్మచేసేవారు పితృదేవతకి సంతృప్తి కలగటం కోసం, పన్నెండు మాసాల్లో పన్నెండు పిండాల్ని, పక్షశ్రాద్ధాల్లో పిండాన్ని, ఊషణ్మాసిక సంబంధమైన పిండాన్ని న్యూనాబ్దిక సంబంధమైన పిండాన్ని తప్పకుండా సమర్పించాలి.

★ పదకొండో రోజు హవిస్తుతో పచనం చేసి హోమం చేయాలి.

★ ఒక్కో షోడశపిండ ప్రదానానికీ 16 పిండాలు చొప్పున మొత్తం మూడు షోడశ పిండకర్మలకీ కలిపి 48 పిండాలు ప్రేతని ఉద్దేశించి చేయాలి ఈవిధంగా చేసినవాడి ప్రేతరూపంలోని తండ్రి, పితృదేవతా రూపుడుగా మారి పోతాడు. ఈ మూడు శ్రాద్ధాలు చేయకపోతే ప్రేత ఎప్పటికీ ప్రేతగానే ఉండిపోతాడు.

## స్త్రీలు చేసే పిండ ప్రదానాలు

★ గరుత్మంతా మృతిచెందిన వాడికి, భార్య తప్ప మరెవరూ లేకపోతే, ఆమె తన భర్తకి ఊర్ధ్వదేహానికి సంబంధించిన పిండ ప్రదానాల్ని, ప్రత్యాబ్దికాల్ని, ఆశ్వయుజ బహుళపక్షంలో చేయాలి, అలాగే పక్ష శ్రాద్ధాల్ని కూడా చేయాలి. ఈవిధంగా చేస్తే ఆమె భర్త పాపాల నుంచి విముక్తి పొంది భయం లేని వాడై మోక్షమార్గాన్ని చేరుకుంటాడు.

★ నిజమైన పతివ్రత ఎవరంటే! మరణించిన భర్తకి శ్రద్ధగా ఆబ్దికాలు నిర్వహించేది.

★ ప్రారబ్ధవశాన లోకంలో ఎవడైనా అగ్నిప్రమాదాలు, జలప్రమాదాలు వల్ల మరణిస్తే అలాంటి వాడికి నారాయణ బలి మొదలైన కర్మకాండనంతా అతడి పేరుగోత్రంతో యథావిధిగా చేయాలి.

★ ఎవరైనా సర్పంకాటుకి గురై మరణిస్తే వాడికి శాంతి కలగటం కోసం శుక్ల, బహుళ పక్షాలలో రెండు పంచమీ తిథుల్లో సర్పదేవతల్ని పూజించాలి.

★ సర్పపూజ ఎలా చేయాలంటే పాముపడగ ఆకారంలో పిండితో నేలమీద ఒక చిత్రంగీసి, దాన్ని సుగంధ భరితమైన పుష్పాలతో అక్షింతలతో పూజించాలి. మరణించిన వాడిపేరు గోత్రం చెప్పి, ధూపదీపాలు సమర్పించి, నైవేద్యంగా నువ్వులు, బియ్యం, పాలు, నివేదించాలి. తరువాత శక్తి కొద్దీ బంగారం లేక వెండితో ఒక సర్పాన్ని తయారుచేయించి దాన్ని ఒక ఆవుతో సహా యోగ్యుడైన విప్రుడికి దానం చేయాలి. తరువాత సర్పంకాటు వల్ల మరణించిన వాడు స్వర్గానికి వెళ్ళాలని కోరుకుంటూ భక్తిగా సర్పానికి నమస్కరించాలి. ఈవిధంగా చేసిన తరువాత నారాయణ బలిని యథావిధిగా ఆచరిస్తే, పాముకాటుకి గురై మరణించిన ప్రేత సకల పాపాలనుంచీ విముక్తి పొంది స్వర్గాన్ని చేరతాడు.

★ ఈవిధంగా పదకొండో రోజు కర్మకాండనంతా చేసిన తరువాత, సూతకం వెళ్ళిపోగానే మంచం, ఇతరవస్తువులు దానం చేయాలి.

## సూతకం-శుద్ధి

★ పితామహుడు, ప్రపితామహుడు, ప్రప్రపితామహుడు అనే ముగ్గురూ వసు, రుద్ర, ఆదిత్య స్వరూపులు అలాంటివారిని శ్రాద్ధ కర్మల్లో గౌరవించాలి.

★ తండ్రి మరణించిన పుత్రుడు ఎప్పుడూ అశుచిగానే (మైలతో) ఉంటాడు. సపిండీకరణ కార్యక్రమం చేసిన తరువాతే అతడికి సూతకం తొలగిపోతుంది.

బ్రహ్మణస్తు దశేహే చ క్షత్రియో ద్వాదశ హవి ।
వైశ్వ పంచదశాహేన శూద్రో మాసేన శుద్ధ్యతి ॥

గరుత్మంతా! బ్రాహ్మణులకి పదోరోజు, క్షత్రియులకి పన్నెండోరోజు, వైశ్యులకి పదిహేనోరోజు, శూద్రులకి నెలరోజులో మైల తొలగిపోతుంది.

★ జ్ఞాతులకి పదిరోజులకి ఏడు అంతరాలున్నజ్ఞాతులకి మూడు రోజులకి, పది పురుషాంతరాలున్న జ్ఞాతులకి కేవలం స్నానంతో శుద్ధి జరుగుతుంది.

★ ఎవడైనా దేశాంతరంలో (విదేశాల్లో) మరణిస్తే ఆవార్త తెలిసిన రోజు నించి (పదిరోజుల్లోపు) ఎన్ని రోజులు మిగిలి ఉంటే అన్ని రోజులు మైలపట్టాలి.

★ జ్ఞాతులు మరణించిన పదిరోజూజులకి ఆవార్త తెలిస్తే మూడురోజులు మైలపట్టాలి.

★ దంతాలు రాకుండానే శిశువు మరణిస్తే స్నానం చేస్తే శుద్ధి అవుతుంది.

★ మూడు సంవత్సరాలలోపు వయసువారు మరణిస్తే మూడు రోజులు మైలపాటించాలి.

★ ఉపనయనం అయిన తరువాత ఎవరైనా మరణిస్తే వారికి పదిరోజులు మైలపాటించాలి.

★ పుట్టిన దగ్గర్నుంచి మొదటి మూడు సంవత్సరాలలోపు స్త్రీ మరణిస్తే అన్ని వర్గాలవారికీ తత్కాలంలో స్నానం చేస్తే శుద్ధి జరుగుతుంది.

★ స్త్రీకి వివాహం జరిగాక ఆమె మరణిస్తే ఆమె భర్తకి వారి బంధువులకి సంతానానికి అశౌచం ఉంటుంది కానీ తండ్రి తరుపువారికి మైల వుండదు.

★ ఆరునెలల్లో గర్భస్రావం జరిగితే అన్ని నెలలు తల్లికి సూతకం వుంటుంది.

★ ఆరుమాసాలు దాటిన తరువాత గర్భస్రావం జరిగితే ఆ తల్లులకి వారి వారి వర్గాలకి చెప్పిన విధంగా సూతకం ఉంటుంది

సర్వేషామేవ వర్ణానాం సూతకే మృతికేపివా ।
దశాహోచ్ఛుద్ధి రిత్యేషకలే శాస్త్రస్య నిశ్చయః ॥

గరుత్మంతా! కలియుగంలో అన్ని వర్ణాలవారికీ జాతాశౌచంగానీ మృతాశౌచంగానీ 10 రోజుల వరకూ ఉంటుందని పదోరోజు శుద్ధి అవుతుందని ధర్మశాస్త్ర వేత్తలు చెప్పారు.

## అశౌచం ఉన్నప్పుడు చేయకూడని పనులు

ఆశీర్వాదం దేవపూజాం ప్రత్యుత్థానాభివందనం ।
పర్యంకే శయనం స్పర్శం నకుర్యా స్మృత సూతకే ॥
సంధ్యాదానం జపం హోమం స్వాధ్యాం పితృతర్పణం ।
బ్రహ్మభోజ్యం వ్రతం నైవ కర్తవ్యం మృత సూతకే ॥

జాతాశౌచంలో ఉన్నవారు ఆశీర్వాదం చేయటం, దేవతాపూజ చేయటం, పెద్దలకి ఎదురుగా వెళ్ళి గౌరవించటం, నమస్కరించటం, మంచం మీద పడుకోవటం, ఇతరుల్ని తాకటం, లాంటివి చేయకూడదు.

మృతాశౌచంలో ఉన్నవాళ్ళు సంధ్యావందనం, జపం, దానం, హోమం, వేదాధ్యయనం, పితృతర్పణం, బ్రాహ్మణులకి అన్నదానం చేయటం లాంటి పనులు చేయకూడదు.

★ సంధ్యావందనం లాంటి నిత్య కర్మలు, ప్రత్యాబ్దికం లాంటి నైమిత్తిక కర్మలు, వ్రతాలు మొదలైన కామ్య కర్మలు ఎవరైనా మృతాశౌచం సమయంలో చేస్తే, సూతకానికి ముందు అతడు చేసిన పుణ్యకర్మ మొత్తం నశిస్తుంది.

★ బ్రహ్మచారికి, మంత్రాలు జపించేవారికి, అగ్నిహోత్రం చేసేవారికి, బ్రహ్మజ్ఞానికి, యతీశ్వరుడికి, రాజుకి అశుచిలేదు.

★ వివాహాది మహోత్సవాలలో, యజ్ఞాలు చేసే సమయాలలో, జాతా మృతా శౌచాలు సంభవించినప్పుడు అంతకుముందు తయారుచేసిన ఆహార పదార్థాలు భుజించవచ్చు.

★ సూతకం ఉన్నవాళ్ళ దగ్గర్నుంచి అన్నాన్ని తెలియక స్వీకరించినవాడికి దోషం ఉండదు. సూతకంలో ఉన్నాడని తెలిసి అన్నం పెట్టమని కావాలని పెట్టించుకునేవాడు దోషం పొందుతాడు.

★ తనకి మైల ఉందని తెలిసీ ఇంకో బ్రాహ్మణుడికి అన్నం పెట్టేవాడు, పెట్టేవాడికి మైల ఉందని తెలిసీ అన్నం పెట్టించుకుని తినేవారు ఇద్దరూ పాపాన్ని పొందుతారు.

## సపిండీకరణ ఫలం

★ పుత్రుడు తండ్రికి సపిండీకరణం చేసిన తరువాత సూతకం తొలగిపోతుంది. సపిండీకరణ చేసిన తరువాతే తండ్రి పితృలోకానికి వెళతాడు.

★ పన్నెండో రోజుగానీ మూడో పక్షంలోగానీ, ఆరోనెలలోగానీ, సంవత్స రాంతంలో గానీ సపిండీకరణ చేయవచ్చు.

★ నాలుగు వర్ణాలవాళ్ళు పన్నెండో రోజు సపిండీకరణ చేయవచ్చని ధర్మశాస్త్రాలు చెబుతున్నాయి.

★ కర్మల్ని వదిలిపెడితే అది మహాదోషం కనుక, అగ్నిహోత్రం ఉన్నవాళ్ళు కానీ, లేనివాళ్ళు కానీ పన్నెండో రోజు తప్పనిసరిగా సపిండీకరణ చేయాలి.

★ గృహస్థాశ్రమంలో ఉన్నవాళ్ళు మృతి చెందితే ఉపనయనం, యజ్ఞం, వ్రతం, లాంటి కర్మలు చేయకూడదు.

యత్ఫలం సర్వతీర్థేషు సర్వయజ్ఞేషు యత్ఫలం ।
తత్ఫలం సమావాప్నోతి ద్వాదశాహే చ పిండవాత్ ॥

*(శ్లో॥34-అధ్యా 13)*

గంగనదిలాంటి సకల పుణ్యతీర్థాలు, సమస్త యజ్ఞాలు సేవిస్తే ఎలాంటి పుణ్యఫలం లభిస్తుందో, పన్నెండోరోజు సపిండీకరణ చేస్తే అలాంటి ఫలే లభిస్తుంది.

## సపిండీకరణ విధి

★ సపిండీకరణ చేసేవాడు స్నానం చేసి మరణించిన ప్రదేశంలో ఆవుపేడతో శుభ్రంగా అలకాలి. ముందుగా పాద్యం అర్ఘ్యం, ఆచమనీయం సమర్పించి విశ్వేదేవుల్ని పూజించాలి.

★ వసు–రుద్ర–ఆదిత్య స్వరూపులైన తాత–ముత్తాత–అతడి తండ్రికి వరుసగా మూడు పిండాల్ని, తన తండ్రికి ఒక పిండాన్ని ఇవ్వాలి. పిండాల్ని గంధం, అక్షతలు, తులసీదళాలతో పూజించి ధూప దీప నైవేద్యాలు సమర్పించాలి.

★ ఒక బంగారు కడ్డీతో ప్రేతకి సమర్పించిన పిండాన్ని మూడు భాగాలుగా చేసి ఆమూడు భాగాలనీ తాత, ముత్తాత, అతడి తండ్రి ఈ ముగ్గురికీ సమర్పించిన పిండాలతో వేరువేరుగా కలపాలి.

★ ఈ పిండాల్ని తల్లికి పెట్టేడప్పుడు నాయనమ్మ, వాళ్ళ అమ్మవాళ్ళ అమ్మ పిండాలకి కలపాలి.

★ ఒకవేళ మరణించిన వాడి తండ్రి అనగా తాత, బ్రతికి ఉంటే మూడు పిండాలనీ తాత తండ్రినుంచి పై ముగ్గురికీ సమర్పించాలి.

★ భార్యా భర్తలిద్దరూ ఒకేసారి మరణిస్తే, కుమారుడు మొదట తండ్రికి పిండప్రదానం చేసి, తరువాత తల్లికి చేయాలి.

★ సపిండీకరణ చేసిన తరువాత పితృతర్పణం చేయాలి.

★ పితృతర్పణం చేసిన తరువాత పదహారు ముద్దలతో అన్నాన్ని అతిథికి పెట్టాలి. ఈ కార్యక్రమాన్ని చేయటం ద్వారా పితృదేవతలు, మునులు, రాక్షసులు, దేవతలు తృప్తి చెందుతారు.

★ ఒక్క కబళంతో ఉండే అన్నాన్ని భిక్ష అంటారు. నాలుగు కబళాల అనాన్ని పుష్కలం అంటారు. పదహారు కబళాల అన్నాన్ని 'హంతకారం' అంటారు.

★ సపిండీకరణలో బ్రాహ్మణుడికి పాదాల్నిగంధపుష్పాక్షతలతో పూజించి అతడు తృప్తి పడేలా దానమివ్వాలి.

★ సపిండీకరణ పూర్తయిన తరువాత షడ్రసోపేతమైన భోజనాన్ని పన్నెండు మంది బ్రాహ్మణులకి పెట్టి, దక్షిణ తాంబూలాలతో సంతృప్తి పరచాలి.

వార్యాయుధం ప్రతోదస్తు దండస్తు ద్విజభోజనాత్ ।
స్పృష్టవ్యోనంతరం వర్ణై శ్శుద్యేరంస్తే తతః క్రమాత్ ॥

గరుత్మంతా ఈవిధంగా విప్రుల్ని భోజనంతో సంతృప్తి పరిచాక బ్రాహ్మణులు నీళ్ళని, క్షత్రియులు ఆయుధాన్ని, వైశ్యులు త్రాసుని, (కాటా) శూద్రులు కర్రని తాకితే మైల తొలగిపోయి పవిత్రులవుతారు.

ఈవిధంగా సపిండీకరణ కర్మ చేసి పరిశుభ్రమైన వస్త్రాలు ధరించి, శయ్యాదానం చేయాలి.

**శయ్యాదానం :**

శయ్యాదానం ప్రశంసంతి సర్వేదేవా స్సవాసవా ।
తస్మాచ్ఛయ్యా ప్రదాతవ్యా మరణే జీవితేపి వా ॥ *(శ్లో॥59,అధ్యా-13)*

గరుత్మంతా! ఇంద్రాది సమస్త దేవతలూ శయ్యాదానం ఎంతో గొప్పదని చెప్పారు. కనుక మరణించినా, బ్రతికున్నా శయ్యాదానం తప్పక చేయాలి.

విశాలంగా అందంగా దృఢంగా ఉండేలా శయ్యని తయారు చేయించి, దాన్ని చక్కగా పూలమాలలతో అలంకరించాలి. నేలమీద తెల్లటి వస్త్రాన్ని పరిచి శయ్యని దానిమీద ఉంచాలి. తరువాత బంగారంతో లక్ష్మీనారాయణుల ప్రతిమని శక్తికొద్దీ తయారు చేయించి ఆమంచం మీద ఉంచాలి. తరువాత గృహస్థుడైన బ్రాహ్మణ దంపతుల్ని పిలిచి లక్ష్మీనారాయణుల ప్రతిమ ముందు కూర్చోబెట్టాలి.

పసుపు, కుంకుమ, అక్షతలతో లక్ష్మీనారాయణుల్ని ముందుగా పూజించి, ఉత్తరాభిముఖంగా బ్రాహ్మణుడి ముందునుంచొని దోసిలిలో పూలు వుంచుకుని

యథా కృష్ణ ద్వితీయాస్తి శయ్యా క్షీరోదసాగరే ।
తథా భూయాదశూన్యేయం మమజన్మని జన్మని ॥

కృష్ణభగవానుడా! పాలసముద్రంలో నీ అందమైన శేషపాన్పు ఏవిధంగా లక్ష్మీదేవితో కొలువై వుంటుందో, అదేవిధంగా నా శయ్యకూడా ఎప్పుడూ నా భార్యతో కళకళలాడుతూ ఉండేలా ప్రతిజన్మలో నన్ను అనుగ్రహించు" అని ప్రార్థించాలి. ఇలా ప్రార్థించి దోసిలిలో ఉన్న పూలని విప్ర దంపతుల మీద, లక్ష్మీ నారాయణుల మీద చల్లి, ఆ శయ్యని ప్రతిమతో సహా దానమివ్వాలి.

**పద దానం :** గరుత్మంతా! శయ్యాదానం చేసిన తరువాత పితృదేవతలకి శాంతి సౌఖ్యాలు కలగటం కోసం 'పదదానం'చెయ్యాలి. పద దానం అంటే

ఛత్రోపానహ వస్త్రాణి ముద్రికా చ కమండులుః ।
ఆసనం పంచపాత్రాణి పదం సప్తవిధం స్మృతం ॥

గొడుగు, పాదకలు, వస్త్రాలు, ఉంగరం, కమండలం, పీట, పంచపాత్రలు ఈ ఏడు రకాల వస్తువుల్ని పదములు అంటారు. ఈ పదదానం చేయటం వల్ల సద్గతి కలుగుతుంది. మరణించి యమలోకానికి వెళ్ళినవాడు సుఖాన్ని పొందుతాడు.

★ ఛత్రదానం చేస్తే పరలోకంలో ఎండవేడితో బాధలుపడే జీవుడికి నీడ లభిస్తుంది.

★ పాదుకలు దానం చేస్తే యమలోకంలో ముళ్ళదారిలో నడిచేడప్పుడు ఆ జీవుడికి బాధకలగకుండా గుర్రం మీద వెళ్ళే అవకాశం లభిస్తుంది.

★ వస్త్రదానం చేయటం వల్ల జీవుడికి నరకంలో అతిశీతలత్వ బాధనుంచి విముక్తి కలుగుతుంది.

★ ఉంగరాన్ని దానం చేయటం వల్ల యమదూతలు జీవిని ఎక్కువగా భాదించరు.

★ కమండలం దానం చేస్తే నరకంలో గాలి, నీరు, లేని ప్రదేశంలో నడిచే జీవుడికి జలం లభించి దాహం తీరుతుంది.

★ రాగి పంచపాత్రని దానం చేస్తే వెయ్యి చలివేంద్రాలు స్థాపించిన ఫలం లభిస్తుంది.

★ కూర్చునే పీట, విప్రుడికి దానం చేస్తే నరకంలో సంచరించే జీవికి దారిలో భోజనం లభిస్తుంది.

★ ఈ విధంగా సపిండీకరణలో భాగంగా అన్నిరకాల దానాలూ శ్రద్ధా భక్తులతో చేసి అందిరకీ శక్తికొద్దీ భోజనాలు పెట్టాలి.

## గయా శ్రాద్ధం

గరుత్మంతా పితరులకి అక్షయలోకాలు కలగాలంటే పుత్రుడు గయాశ్రాద్ధాన్ని ఆచరించాలి. అయితే తండ్రి మరణించిన సంవత్సరంలోపు చేయకూడదు. సంవత్సరీకం అయిన తరువాతే గయాశ్రాద్ధం పెట్టాలి.

గయాశ్రాద్ధా త్ప్రముచ్యంతే పితరోభవ సాగరాత్ ।
గదాధరానుగ్రహేణ తేయాంతి పరమాంగతి ॥

గయలో శ్రాద్ధంపెట్టటం వల్ల పితృదేవతలు సంసార సాగరం నుంచి విడిపోయి, అక్షయ లోకాల్ని చేరుకుంటారు. వారికి మరోజన్మ ఉండదు. గయాశ్రాద్ధం ద్వారా దేవతల అనుగ్రహాన్ని పొందిన పితరులు ఉత్తమ స్థానాన్నిచేరుకుంటారు.

★ గయాక్షేత్రంలో శ్రీహరి పాదాలుంటాయి. వాటిని తులసీ దళాలతో పూజించాలి.

★ గయలో ఉన్న తీర్థాలన్నిటిలో క్రమంగా పిండ ప్రదానాలు చేయాలి.

★ గయాసురుడి శిరస్సుఉన్న గయాక్షేత్రంలో జమ్మి ఆకంత పిండాన్ని ఉంచి నాచాలు ఏడుతరాల వారు తరిస్తారు.

తస్మాత్సర్వ ప్రయత్నేన పితృభక్తో భవేన్నరః ।
ఇహలోకే పదేవాపి పితృభక్త్యా సుఖీభవేత్ ॥

మానవుడికి ఎన్ని కష్టాలు వచ్చినా తట్టుకుని తల్లితండ్రుల మీద భక్తి ప్రపత్తులు కలిగి ఉండాలి. అలా భక్తి కలిగిన ఉత్తమ పుత్రులు ఈ లోకంలో పరలోకంలో కూడా ఎన్నో సుఖాలు పొందుతారు.

## యమలోక వైభవం

గరుత్మంతా! అన్ని లోకాలకన్నా విశిష్ఠమైనది యమలోకం. నారదాది మునులు వెళ్ళతగిన ఆలోకాన్ని విశేషమైన పుణ్యం చేసినవారు కూడా దర్శిస్తారు.

దక్షిణ దిక్కుకి నైరృతీ దిక్కుకీ మధ్యలో యమలోకం వుంది. అది మొత్తం వజ్రమయం దాన్ని జయించటం, రాక్షసులకి కూడా సాధ్యం కాదు. ఆ పట్టణం నలుచదరంగా, నాలుగు ద్వారాలతో, ఎత్తైన ప్రాకారాలతో, ఎటుచూసినా వెయ్యి ఆమడల విస్తీర్ణంతో ఉంటుంది.

**చిత్రగుప్తుడి నివాసం :** యమలోకంలో ఇరవై ఆమడల పొడవు వెడల్పుతో ఎంతో అందంగా చిత్రగుప్తుడి నివాసం ఉంటుంది. ఆయన గృహం ఎంతో పటిష్ఠంగా చుట్టూ ఇనుపప్రాకారాలతో, ఎన్నో వాహనాలతో ప్రాకారాల మీద అందమైన జండాలతో వైభవంగా కనిపిస్తుంది. ఆ గృహంలో అద్భుతమైన చిత్రాలు, రకరకాల సంగీతవాద్యాలు, ఉద్యానవనాలు, తోటలు, రకరకాల పక్షులతో శోభాయమానంగా విరాజిల్లుతుంటుంది.

యమసభలో అందమైన ఆసనంమీద చిత్రగుప్తుడు కూర్చుని మానవుల ఆయుర్ధాయాల్ని లెక్కపెడుతూ ఉంటాడు. పాప పుణ్యాలు చేసే జీవుల మీద చిత్రగుప్తుడికి ఎలాంటి ప్రేమాభిమానాలు, ద్వేషాలు ఉండవు.

చిత్రగుప్తుడి ఇంటికి తూర్పు దిశలో 'జ్వరం' అనే రోగ గృహం, దక్షిణ దిశలో 'లూత' అనే రోగాల గృహాలు, పడమర దిశలో 'కాలపాశం' 'అజీర్ణం' 'అరుచి' అనే రోగాలు ఇళ్ళు ఉన్నాయి. ఉత్తరాన పాండురోగం రాజరోగం, అలాగే ఈశాన్య భాగంలో 'శిరో రోగం' ఆగ్నేయభాగంలో 'మూర్ఛ రోగం' అనే రెండు రోగాలు ఉంటాయి. ఇలా వివిధరకాల రోగాలు గృహాలు చిత్రగుప్తుడి నివాసం చుట్టూ ఉంటాయి.

**యమరాజు నివాసం :** చిత్రగుప్తుడి నివాసానికి ముందు ఇరవై ఆమడల దూరంలో ధర్మరాజు నివాసగృహముంది. అదిరత్నఖచితమైన కాంతులతో, సూర్యుడిలా, మెఱుపుల్లా ప్రకాశిస్తోంది. ఎంతో గొప్పగా వెలుగొందే ఆయమ నగరంలో యమరాజు నివాసగృహం రెండు వందల ఆమడల విస్తీర్ణంలో ఏభై ఆమడల ఎత్తుతో ఎంతో ఉన్నతంగా నెలకొంది.

ఆ గృహం వెయ్యి స్తంభాలతో, వైఢూర్య మణులతో ప్రకాశిస్తూ, బంగారంతో అలంకరించబడ్డ ఎన్నో మేడలతో, స్ఫటికశిలలతో కూడిన భవనాలతో, వజ్రాలతిన్నెలతో, బంగారపుతోరణాలతో, దివ్యంగా కనిపించే సన్నని అందమైన లతలతో, తీగలతో ప్రకాశిస్తోంది.

**యమసభ :** యమరాజు నివాసంలో గొప్పదైన యమసభ ఒకటుంది. అదికూడా వందయోజనాల పొడవుతో సూర్యుడిలా వెలుగొందుతూ ఉంటుంది. ఆ సభగా, వేడిగా, చల్లగా ఉండక సమశీతోష్ణంగా వుంటుంది. మనసుకి చాలా ఆనందాన్ని కలిగిస్తుంది. ఆ సభలో ఉన్నవాళ్ళకి, వార్ధక్యం, సుఖం, దుఖం, ఆకలి దప్పికలేవీ ఉండవు. యమరాజు సభలో మానవసంబంధమైన దైవసంబంధమైన సమస్తకోరికలూ సిద్ధిస్తాయి. అక్కడ సకల ఆహార పదార్థాలూ రుచిగా, శుచిగా లభిస్తాయి. దేవశిల్పి విశ్వకర్మ ఎంతోకాలం తపస్సుచేసి ఆలోకాన్ని నిర్మించాడు.

తాముగ్రతపసోయాంతి సువ్రతా స్సత్యవాదినః ।
శాంతా సవ్యాపినస్సిద్ధాం పూతాః పూర్వేణ కర్మణా ॥ *(శ్లో॥29,అధ్యా-14)*

గరుత్మంతా విశేషమైన పుణ్యం చేసినవాళ్ళు, తపస్సంపన్నులు, వ్రతనిష్ఠ కలిగినవాళ్ళు, సత్యవంతులు, ప్రశాంతమైన చిత్తం కలిగినవాళ్ళు, యతీశ్వరులు, యోగసిద్ధులు పూర్వ పుణ్యం వల్ల పవిత్రమైనవాళ్ళు మాత్రమే ఈ సభని చేరగలరు.

★ భగవత్సరూపుడు, సత్పురుషుల్లో గొప్పవాడు, తలమీద తెల్లటి గొడుగుతో ప్రకాశించేవాడు, మకర కుండలాలు ధరించినవాడు, గొప్ప కిరీటాన్ని సకలాభరణాల్ని ధరించిన వాడు, నల్లటి మేఘంలాంటి శరీర వర్ణం కలిగినవాడు, చేతిలో వింజామరలు కలిగిన అప్సరస స్త్రీలతో సేవించబడేవాడు, అయిన యమధర్మరాజు ఆదివ్యమైన సభలో సాటిలేనిది పదియోజనాల విస్తీర్ణం కలిగింది వివిధ రత్నాలతో ప్రకాశిస్తున్నది అయిన దివ్యసింహాసనం మీద కూర్చుని ఉంటాడు.

★ గంధర్వులు, దేవవేశ్యలు, యమధర్మరాజు చుట్టూ, సంగీత, వాద్య, నృత్యాల్నీ ప్రదర్శిస్తూ ఆయన్ని ఆనందంగా సేవిస్తుంటారు.

★ చేతిలో పాశం అనే మృత్యువుతో, బలవంతుడైన కాలంచేత, చిత్రగుప్త, చిత్రకేత కృతాంతుల చేతా ఆయన సేవించబడుతుంటాడు.

★ యమధర్మరాజు చుట్టూ పాశం, దండం లాంటి ఆయుధాలు ధరించి ఆయన ఆజ్ఞప్రకారం నడుచుకునే వారు, తనతో సమానమైనవారు అయిన భటులు ఎంతోమంది ఉంటారు.

★ అత్రి, వశిష్ఠుడు, పులహుడు, దక్షుడు, క్రతువు, అంగిరసుడు, జమదగ్ని, భృగువు, పులస్త్యుడు, అగస్త్యుడు, నారదుడు తదితర ఋషీశ్వరులు ఆయన సభలో వుంటారు.

★ ఆ సభలోని మునీశ్వరులంతా ధర్మశాస్త్రాల్ని. వ్యాఖ్యానిస్తూ బ్రహ్మదేవుడి ఆజ్ఞప్రకారం యమరాజుని సేవిస్తుంటారు.

★ మనువు, దిలీపుడు, మాంధాత, సగరుడు, భగీరథుడు, అంబరీషుడు, అనరణ్యుడు, మంచికుందుడు, నిమి పృధువు, యయాతి, నహుషుడు, పూరువు, దుష్యంతుడు, శిబి, నలుడు, భరతుడు, శంతనుడు, పాండురాజు, కార్తవీర్యార్జునుడు లాంటి చక్రవర్తులు, సార్వభౌములు ఎన్నో యజ్ఞయాగాలు, పుణ్యకర్మలు ఆచరించి దేవతల్ని సంతోషపరిచి యమరాజు సభలో సభ్యులయ్యారు.

**యమలోక ద్వారాలు :** గరుత్మంతా యమరాజు నగరానికి చేరటానికి మొత్తం నాలుగు దిక్కులూ నాలుగు ప్రధాన ద్వారాలున్నాయి. దక్షిణదిశలో పాపులు ప్రవేశించే ద్వారం గురించి నీకింతకు ముందే వివరించాను.

గౌరవించేవాళ్ళు, ఉత్తమమైన దానధర్మాలు చేసినవాళ్ళు ఈ ఉత్తరద్వారం నుంచి యమలోకాన్నిచేరతారు.

**3 పడమరదిశ :** ఇది రత్నఖచితమైన గృహాలతో ప్రకాశిస్తూ ఉంటుంది. అద్భుతమైన రసాలతో కూడిన దిగడు బావులు, మదించిన ఏనుగుల గుంపులతో, శ్రేష్ఠమైన గుర్రాలతో ఆ మార్గం రమ్యంగా విరాజిల్లుతుంటుంది.

ఆత్మతత్త్వజ్ఞులు, యోగశాస్త్రాన్ని అభ్యసించినవారు, ఇతర దేవతల మీద కాక శ్రీమహావిష్ణువుమీదే అచంచలమైన భక్తి కలిగినవాళ్ళు గాయత్రీ మంత్రాన్ని శ్రద్ధగా జపించేవాళ్ళు, త్రికాల సంధ్యావందనం చేసేవాళ్ళు, ఇతరుల సొమ్ము అపహరించని వాళ్ళు, సత్పురుషుల్ని సేవించేవాళ్ళు, మట్టిని బంగారాన్ని సమానంగా చూసేవాళ్ళు, దేవ, పితృఋణాల్ని తీర్చుకునేవాళ్ళు, దుర్మార్గుల సావాసం చేయనివాళ్ళు. బ్రహ్మచర్యవ్రతాన్ని శ్రద్ధగా పాటించేవాళ్ళు పరమ పవిత్రమైన ఈ పడమర ద్వారం నుంచి యమలోకాన్ని చేరతారు.

ఈవిధంగా మూడు ద్వారాల నుంచీ తన సభలోకి ప్రవేశించిన పుణ్యాత్ముల్ని చూసి యమరాజు సింహాసనం నుంచి పైకిలేచి స్వాగతం పలుకుతాడు. పుణ్యాత్ముల్ని కుశల ప్రశ్నలు వేసి వారిని మంచి ఆసనం మీద కూర్చోబెట్టి, మంచి, గంధం, పుష్పాలతో పూజిస్తాడు. తరువాత సభాసదులందరితో "సభికులారా! ఈ వచ్చిన పుణ్యాత్ములు నా స్థానాన్ని కూడా భేదించుకుని సరాసరి ఇక్కణ్ణుంచి బ్రహ్మలోకానికి వెళుతున్నారు. మీరంతా వీరిని అభినందించండి" అని చెబుతాడు. తిరిగి వారితో –

మానుషం దుర్లభం ప్రాప్య నిత్యం యస్తున సాధయేత్ ।
సయాతి నరకం ఘోరం కోప్యస్తస్మాదచేతయః ॥

"పుణ్యపురుషులారా! ఎవరు అత్యంత దుర్లభమైన మానవజన్మ పొంది, పుణ్యకార్యక్రమాలు చేసి, పుణ్యలోకాల్ని పొందటానికి ఎలాంటి ప్రయత్నం చేయకుండా వుంటారో అలాంటి వాళ్ళు భయంకరమైన నరకాన్ని పొందుతారు. మీరంతా జ్ఞానులు ఈ సత్యం గ్రహించి ఎన్నో పుణ్యకర్మలు ఆచరించి పునీతులయ్యాడు. అనిఅంటారు.

గరుత్మంతా యమరాజు మాటలువిని ఎంతో ఆనందించిన పుణ్యాత్ములు ఆయనకి, సభలో ఉన్నవాళ్ళందరికీ నమస్కరించి, దేవతలచేత, మునులచేతా పూజించబడుతూ దివ్యవిమానంలో ఉత్తమలోకాలకి వెళ్ళగా. వారిలో కొందరు యమరాజు సభలోనే ఉండాలని నిశ్చయించుకున్నారు. యమసభలో ఉన్న

ఆ పుణ్యాత్ములు కల్పం వరకూ దేవతా సంబంధమైన భోగాలు అనుభవించి, తిరిగి మానవలోకంలో పుణ్యాత్ములుగా జన్మిస్తారు.

## పుణ్యాత్ముల జననం

గరుత్మంతా! యోగీశ్వరులు యోగధారణ చేయటానికి తగిన శరీర స్వరూపం గురించి, అలాగే యోగులు శరీరంలోని షట్చక్రాల విచారణ బ్రహ్మ రంధ్రంలో వారు పరమాత్మని ఏవిధంగా ధ్యానం చేస్తారో చెబుతాను విను

★ స్త్రీలకి ఋతుదర్శనం అయిన రోజు నుంచి నాలుగు రోజులు వదిలిపెట్టాలి. ఆ సమయంలో వారి శరీరం మలినంగా ఉంటుంది. కనుక ఋతు దినాల్లో స్త్రీ ముఖాన్ని కూడా చూడకూడదు.

★ ఋతుమతి అయిన స్త్రీ నాలుగోరోజు కట్టుకున్న బట్టలతోనే స్నానం చేయాలి. అయితే దేవ కార్యాలు, పితృకార్యాలు చేయటానికి ఏడోరోజు గానీ ఆమె పవిత్రురాలు కాలేదు.

★ ఏడు, ఎనిమిది రోజుల మధ్య ఆమె గర్భాన్ని ధరిస్తే పుత్ర సంతానం కలుగుతుంది.

★ స్త్రీ ఋతుమతి అయిన తరువాత, నాలుగు, ఆరు, ఇలా సరిరోజుల్లో భర్తతో కలిస్తే స్త్రీ సంతానం కలుగుతుఇది. కనుక సంతానం కోరుకునేవారు, ఋతుమతి అయిన ఏడురోజుల తరువాత సరిరోజుల్లో కలవాలి.

★ స్త్రీలకి సాధారణంగా ఋతుదినాలు పదహారు అని అంటారు. పద్నాలుగో రోజులో ఆమె గర్భాన్ని ధరిస్తుంది.

★ పద్నాలుగో రోజు గర్భం ధరించిన స్త్రీకి సకల సద్గుణవంతుడైన పుత్రుడు జన్మిస్తాడు. అది పరమపుణ్యాత్మురాలైన తల్లికి మాత్రమే లభించే వరం.

★ గ్రహాలు ఉచ్ఛస్థానంలో ఉన్నప్పుడు పుణ్యాత్ములు జన్మిస్తారు. ఆసమయంలో బ్రాహ్మణులు దానాలు స్వీకరించటం వల్ల శుభఫలితాలు పొందుతారు.

**పంచభూతాల గుణాలు :** గరుత్మంతా సమస్త భూతాల్లో వ్యాపించిన పరమాత్మ తత్త్వాన్ని తెలుసుకోవటానికి నీకు పంచ భూతాది జడపదార్ధాల గుణాలు చెబుతున్నా విను

1. **భూమి :** చర్మం, ఎముకలు, నరాలు, వెంట్రుకలు, మాంసం, ఈ అయిదూ భూమికి సంబంధించిన గుణాలు.
2. **జలం :** చొంగ, మూత్రం, వీర్యం, ఎముకల్ని పరస్పరం కలిపి ఉంచే మజ్జ, నెత్తురు ఈ అయిదూ జలానికి సంబంధించిన గుణాలు.
3. **తేజస్సు :** ఆకలి, దాహం, మందబుద్ధి, నిద్ర, కాంతి ఈ ఐదు గుణాలు తేజస్సుకి సంబంధించినవి.
4. **వాయువు :** ముచుకోవటం, చాచటం, పరుగెత్తటం, దాటటం, వ్యాపారం చేయటం, అనే ఈ అయిదు గుణాలు వాయువుకి సంబంధించిన గుణాలు.
5. **ఆకాశం :** ధ్వని, ఏరకమైన ఆలోచనాలేకపోవటం, భ్రమ, సందేహం అనే ఈ అయిదు గుణాలు ఆకాశానికి సంబంధించినవి.

## శరీర స్వరూపం

గరుత్మంతా! మానవులకి రెండు రూపాలుంటాయి. వాటిలో ఒకదాన్ని వ్యవహారికం అని రెండోదాన్ని పారమార్ధిక స్వరూపమైనదని అంటారు. వ్యవహారిక శరీరం మీద మూడు కోట్ల ఏభైలక్షల రోమాలు, తలమీద ఏడులక్షల కేశాలు ఉంటాయి.

సాధారణంగా ప్రతిమనిషికి 32 దంతాలుంటాయి. వెయ్యి పలాలు మాంసం వందపలాల రక్తం ఉంటుంది. పది పలాల మెదడు డెబ్భైపలాల చర్మం, మూడు పలాలు మంచిరక్తం ఉంటుంది. శరీరంలో 50 గురుగింజల ఎత్తు వీర్యం, 360 ఎముకలు ఉంటాయి. శరీరంలో కొన్ని నాడులు పెద్దవిగా కొన్ని నాడులు చాలా సూక్ష్మంగా వుంటాయి. అలాగే ఏభై పలాలు పైత్యం, ఇరవై అయిదుపలాలు శ్లేష్మం ఉంటుంది.

**పారమార్థిక శరీరం :** పారమార్ధిక శరీరంలో సమస్తలోకాలు, పర్వతాలు, నదులు, దీవులు, లోయలు, సూర్యాది నవగ్రహాలు ఉంటాయి. పరమార్ధ సంబంధమైన ఈ శరీరంలో మూలాధారం నుంచి ఆరుచక్రాలుంటాయి. ఈ బ్రహ్మాండంలో ఎన్ని గుణాలుంటాయో అవన్నీ పారమార్ధిక శరీరంలో ఉంటాయి.

పారమార్ధిక శరీరంలో పాదాల క్రింద బాగంలో 'అతని'లోకం పాదాలపైన 'వితల'లోకం. మోకాళ్ళ 'సుతల' లోకం, తొడలతో మహాతలలోకం పారమార్ధపురుషుడికి నాభిలో 'భూలోకంలో', బొడ్డుకిపైభాగంలో 'భువర్లోకం', హృదయ స్థానంలో 'స్వర్లోకం', కంఠంలో 'మహర్లోకం', ముఖంలో 'జనోలోకం', నుదుటి మీద 'తపోలోకం', బ్రహ్మ రంధ్రంలో 'సత్యలోకం' ఉంటాయి.

## షట్చక్రాలు

మూలాధారం స్వాధిష్ఠానం మణిపూరకమేవ చ ।
అనాహతం విశుద్ధాఖ్య మజ్ఞా షట్చక్ర ముచ్యతే ॥

*(శ్లో॥ 72, అధ్యా-15)*

1.మూలాదారం 2.స్వాధిష్ఠానం 3.మణిపూరకం 4.అనాహతం 5.విశుద్ధం 6.ఆజ్ఞా అని పరమార్ధ శరీరంలో ఆరుచక్రాలుంటాయి.

లింగ గుద స్థానాల మధ్యలో మూలాధార చక్రం, లింగ ప్రదేశంలో స్వాధిష్ఠాన చక్రం, నాభిప్రదేశంలో మణిపూరక చక్రం, హృదయం దగ్గర అనాహత చక్రం, కంఠభాగంలో విశుద్ధ చక్రం, కనుబొమల మధ్య ఆజ్ఞా చక్రం వుంటాయి.

**1. మూలాధార చక్రం :** దీనిలో నాలుగు దళాలు అగ్నిలాంటికాంతితో మెరుస్తూంటాయి. ఇక్కడ 'వ' నుంచి 'స' వరకు అక్షరాలుంటాయి.

**2. స్వాధిష్ఠాన చక్రం :** ఇది సూర్యుడిలాంటి రంగుతో ప్రకాశిస్తూ ఆరుదళాలతో ఉంటుంది. ఇందులో 'బ' నుంచి 'ల' వరకూ వర్ణాలుంటాయి.

**3. మణిపూరక చక్రం :** ఇది పది దళాలతో ఎర్రగా ప్రకాశిస్తూ ఉంటుంది. దీనిలో 'ద' నుంచి 'ఫ' వరకూ వర్ణాలుంటాయి.

**4. అనాహత చక్రం :** ఇది పన్నెండు దళాలతో బంగారం లాంటి రంగుతో ప్రకాశిస్తూ ఉంటుంది. దీనిలో 'క' నుంచి 'ర' వరకూ వర్ణాలుంటాయి.

**5. విశుద్ధ చక్రం :** ఇది చంద్రుడిలాంటి కాంతితో తెల్లగా మెరిసిపోయే పదహారు దళాలతో ఉంటుంది. దీనిలో 'అ' నుంచి 'ఐ' వరకూ వర్ణాలుంటాయి.

**6. ఆజ్ఞా చక్రం :** రెండు దళాలతో ఎర్రటి కాంతితో ప్రకాశిస్తుంది ఈ చక్రం. ఈ చక్రం కన్నా పైభాగంలో సహస్రారం ఉంటుంది. అదివెయ్యి దళాలతో సచ్చిదానంద స్వరూపంతో విరాజిల్లుతూ ఉంటుంది.

## షట్చక్రాలు అధిష్ఠాన దేవతలు

**1. మూలాధార చక్రం :** విఘ్నేశ్వరుడు దీనికి అధిష్ఠాన దేవత.

**2. స్వాధిష్ఠాన చక్రం :** బ్రహ్మదేవుడు దీనికి అధిష్ఠాన దేవత.

**3. మణిపూరక చక్రం :** శ్రీహరి దీనికి అధిష్ఠాన దేవత.

**4. అనాహత చక్రం :** శంకరుడు దీనికి అధిష్ఠాన దేవత.

**5. విశుద్ధ చక్రం :** బృహస్పతి దీనికి అధిష్ఠాన దేవత.

**6. ఆజ్ఞా చక్రం :** దేవేంద్రుడు దీనికి అధిష్ఠాన దేవత.

గరుత్మంతా! ఈ ఆరుగురు దేవతలనీ మూలాధారం నుంచి ఆరుచక్రాలకీ అధిష్ఠాన దేవతలుగా భావించి నిత్యం ధ్యానం చేయాలి. వీటన్నిటికీ పైన ఉన్న 'సహస్రార' చక్రానికి అధిష్ఠాన దేవతగా 'పరబ్రహ్మ'ని ధ్యానించాలి.

తపో యోగాదయో మోక్షమార్గాస్సంతి తథాపి చ ।
సమీచీన స్తుమద్భక్తి మార్గ స్సంతత రతామిహ ॥

*(శ్లో॥62,అధ్యా-15)*

తపస్సు, యోగంలాంటి ఎన్నో మార్గాలు మోక్షాన్ని పొందటం కోసం చెప్పబడ్డాయి. అయితే సంసార సాగరాన్ని దాటాలని తపించేవారికి భక్తి ఒక్కటే ప్రధానమైన మార్గం.

# మోక్ష మార్గం

గరుత్మంతా! పరబ్రహ్మ స్వరూపుడు, మంగళకరమైనవాడు, సమస్తం తెలిసినవాడు, ఈ సమస్తాన్నీ సృష్టించినవాడు, ఈ సమస్తానికీ అధిపతి, ఆద్యంతాలు లేనివాడు, తనకు తానే ప్రకాశించేవాడు, ఎలాంటి వికారాలూ లేనివాడు, సచ్చిదానంద స్వరూపుడు అయిన పరమాత్మ ఒకడున్నాడు. ఆ పరమాత్మ అంశతోనే పుట్టినవాడినే జీవుడు అంటారు.

సుఖదుఖాల్ని కలిగించే పుణ్యపాపకర్మలతో వుండే జీవులు తమ కర్మఫలితాలకనుగుణంగా శరీరాన్ని, ఆయుర్దాయాన్ని, భోగాల్ని పొందుతుంటారు. మానవులకి బాహ్యాశరీరంలోపల ఒక సూక్ష్మ శరీరంకూడా వుంటుంది. అది వాడు మోక్షం పొందేవరకూ నశించకుండా వుంటుంది.

★ మానవుడు స్థూల, సూక్ష్మ, కారణ, తుర్య శరీరాల్ని ధరించి ఎన్నో జన్మలెత్తి ఏదో ఒక పుణ్యవిశేషం వల్ల దుర్లభమైన మానవజన్మ ఎత్తుతాడు. మానవుడుగా పుట్టినవాడు జ్ఞానవంతుడైతే మోక్షాన్ని పొందగలుగుతాడు.

★ మానవుడు 84 లక్షల శరీరాల్ని ధరించినప్పటికీ మానవశరీరంలో ధరించకపోతే అతడు జ్ఞానవంతుడు కాలేడు.

★ జీవుడు ఎన్నో కోట్ల జన్మలు ఎత్తితేగానీ మానవజన్మ పొందలేడు.

★ మోక్షాన్ని పొందటానికి గొప్ప అవకాశం ఈ మానవజన్మ. ఇలాంటి మానవజన్మని వ్యర్థం చేసుకునేవాడు ఎంతో మూర్ఖుడు పాపి అవుతాడు

★ మానవుడు పూర్వజన్మ విశేషంతో దుర్లభమైన మానవ జన్మని పొంది, అదీ విప్రుడిగా జన్మించి, ఇంద్రియ నిగ్రహం లేకుండా, సంసారాన్ని దాటించే ఆత్మజ్ఞానం పొందకుండా, జీవితాన్ని వ్యర్థం చేసుకున్నవాడు, ఆత్మ హత్య చేసుకున్నవాడే అవుతాడు.

★ శరీరం అనేది లేకుండా, ధర్మార్థకామ మోక్షాలనే చతుర్విధ పురుషార్థాల్ని సాధించటానికి వీలుండదు, కనుక, రోగాలు రాకుండా శరీరాన్ని కాపాడుకోవాలి.

★ తాను సంపాదించిన ధనాన్ని పుణ్యకార్యాల కోసం వెచ్చించాలి.

★ గ్రామాలు, భూమి, బంగారం ఇవన్నీ పోతే తిరిగి సంపాదించుకోవచ్చు కానీ మానవశరీరం నశించిపోతే తిరిగి తెచ్చుకోలేం.

★ ధనాన్ని ధర్మంకోసం, ధర్మాన్నిజ్ఞానం కోసం, జ్ఞానాన్ని భగవంతుణ్ణి ధ్యానించటం కోసం,ఉపయోగిస్తే మోక్షం పొందవచ్చు.

★ తన మోక్షాన్ని, తానే అరిషడ్వర్గాలు జయించి, పరమాత్మని చింతిస్తూ, ధార్మిక కార్యక్రమాల ద్వారా పొందే ప్రయత్నం చేయాలిగానీ, వేరే ఎవరూ తన మోక్షానికి సాయపడలేరని గ్రహించాలి.

★ వార్ధక్యం పులిలాగా కనిపెట్టుకుని దూకాలని వుంటుంది. ఆయుర్దాయం అనేది పగిలిన కుండలో నీళ్ళలాగా ఒక్కసారిగా జారిపోతుంది. రోగాలు మనిషిని శత్రువుల్లా బాధిస్తాయి. కాబట్టి వార్ధక్యం రాకుండా, రోగాలు కలగక ముందే ముక్తిని కలిగించే ధర్మకార్యాలు చేయాలి.

★ ప్రతి మానవుడు సంసారంలో పడిపోయి ఎన్నో సుఖదుఖాలు అనుభవిస్తూ ఉంటాడు. ఈ స్థితిలో తనకి ఆయుర్దాయం తగ్గిపోతోందని గ్రహించడు. అలాగే తన ఆత్మకి మోక్షం ఎలా కలుగుతుంది? అని కనీసం ఆలోచించడు. ఇదెంతో విచారకర విషయం.

★ గరుత్మంతా! మోక్షోపాయాన్ని గురించి ప్రయత్నించనివాడు, తెలుసుకోదగిన పరబ్రహ్మాని గురించి తెలుసుకోక మూర్ఖంగా వుండేవాడు, భయంకరమైన సంసార సముద్రాన్ని చూసి భయపడనివాడు యముడి చేత చిత్రహింసలకి గురౌతాడు.

★ గాలిని బంధించవచ్చు, ఆకాశాన్ని కత్తితో ఖండించవచ్చు, జలతరంగాల్ని మాలగా కూర్చవచ్చుగానీ ఆయుర్ధాయాన్ని స్థిరంగా ఎవరూ ఉంచలేరు.

★ కాలం అనేది ప్రతిక్షణం మనకి తెలియకుండానే గడిచిపోతుంటుంది. ఈ శరీరం కూడా నీళ్ళలో ముంచిన పచ్చికుండలా నశించిపోతుంది. కానీ ప్రకాశిస్తూ ఉండదని తెలుసుకోవాలి.

★ మానవుడు తన సంసారానికి సంబంధించిన అన్ని అన్ని పనులగురించీ ఆలోచిస్తూ విచారిస్తూ కాలాన్ని ఖర్చుచేస్తే గతించిన కాలం తిరిగిరాదు. ఇక వయసుమీద పడ్డాక మోక్షం గురించి ఆలోచించి ఏదో చేయాలనుకునే లోపు మృత్యువుమీద పడుతుంది

★ నిద్ర, మైథునం, ఆహారం, భయం అనేవి అన్ని జీవులకీ సమానమే. వీటిలో జ్ఞానం కలిగిన వాణ్ణే మనిషిగా చెప్పాలి. జ్ఞానం లేనివాడు పశువుతో సమానం.

★ అందరూ అజ్ఞానంతో మోహించబడి నా శరీరం, నా భార్య నా పిల్లలు, అనే భ్రమలోపడి పుడుతూ చస్తూ ఉంటారు.

★ మోహాన్ని విడిచిపెట్టి సత్పురుషులు సాంగత్యం పొందినట్లైతే మానవుడు మోక్షాన్ని పొందవచ్చు.

★ కొందరు డాంబికులు జడలు, కృష్ణాజినం, విభూతి రుద్రాక్షలు ధరించి జ్ఞానుల్లాగా తిరుగుతూ తాము ఖహంలో పడటమే కాక ఇతరుల్ని కూడా మోహంలో పడేస్తుంటారు.

★ గరుత్మంతా ఎన్నో వేదాలు, శాస్త్రాలు చదివినంత మాత్రాన ముక్తి కలగదు. కేవలం జ్ఞానం ద్వారా మాత్రమే మోక్షం లభిస్తుంది.

★ సన్యాసం స్వీకరించటం, ఆశ్రమాలు, పుణ్యక్షేత్రాలు దర్శించటం, దివ్యతీర్థాల్లో మునగటం మోక్షాన్ని ఇవ్వలేవు. జ్ఞానం మాత్రమే మానవుడికి మోక్షాన్ని ప్రసాదించగలదు.

★ గురూపదేశం లేకుండా, అనాయాసంగా ఎవరికీ అద్వైత సిద్ధి కలగదు.

★ కొందరు ద్వైతం అని ఇంకొందరు అద్వైతమని భేదభావాన్ని చూస్తుంటారు. కానీ సర్వమతాలకీ సమానమైన భావాన్ని ఎవరూ తెలుసుకోలేరు.

★ గరుత్మంతా! ఆత్మజ్ఞానం కలిగేంతవరకూ తపస్సు వ్రతాలు, తీర్థయాత్రలు, జపాలు, హోమాలు పూజలు వేదపఠనాలు, శాస్త్రాలు, పురాణ శ్రవణాలు చేస్తూ వుండాలి.

★ జ్ఞానం పొందినవాడు మృత్యువు సమీపించగానే భయపడకూడదు. తన భార్యా పుత్రుల మీద ప్రేమని విడిచి వైరాగ్యభావంలో నిరపేక్షంగా ఉండాలి.

★ మోక్షాన్ని పొందాలనుకునేవాడు ఇల్లు వదిలి పుణ్యక్షేత్రాలకి వెళ్ళి గంగాది పుణ్యనదీ జలాల్లో స్నానం చేసి పరిశుద్ధుడై ఒక నిర్జన ప్రదేశంలో దర్భాసనం జింక చర్మం ఆసనంగా వేసుకుని కూర్చోవాలి. అలా నిశ్చలంగా కూర్చున్న తరువాత అకార ఉకార, మకార త్రయమైన 'ఓం' కారాన్ని మనస్సులో స్మరిస్తూ ప్రాణాయామం ద్వారా మనస్సుని స్థిరంగా ఉంచుకుని ఓంకార ధ్యానం చేయాలి.

పరబ్రహ్మ స్వరూపుడిని, నేనే అనిభావిస్తూ పరబ్రహ్మలో తన ఆత్మని లయంచేసినట్టు భావించి ఆ పరబ్రహ్మ స్వరూపమైన ఓంకారాన్ని స్మరిస్తూ, నారాయణ పరబ్రహ్మనైన నామీదే ధ్యాసఉంచి ఎవడైతే ప్రాణాన్ని విడిచి పెడతాడో అలాంటివాడే ఉత్తమలోకాలకి చేరతాడు.

## మోక్షధర్మం - మూలశ్లోకాలు

## (షోడశోధ్యాయం)

**గరుడపురాణంలో అత్యంత ప్రధానమైనది షోడశోధ్యాయం. ఇందులో మానవుడు మోక్షాన్ని పొందటానికి ఎలాంటి క్రియలు చేయాలో సవివరంగా చెప్పబడ్డాయి. అందుకే ఈ అధ్యాయానికి సంబంధించిన మూలశ్లోకాలని పూర్తిగా అందిస్తున్నాము.**

**గరుడ ఉవాచ**

శ్రుతా మయా దయాసింధో! హ్యజ్ఞానాజ్జీవసంసృతిః ।
అధునా శ్రోతుమిచ్ఛామి మోక్షోపాయం సనాతనమ్ ॥ 1

భగవ! న్దేవ! దేవేశ! శరణాగతవత్సల!
అసారే ఘోరసంసారే సర్వదుఃఖ మలీమసే ॥ 2

నానావిధ శరీరస్థా అనంతా జీవరాశయః ।
జాయంతే చ మ్రియంతే చ తేషామంతో న విద్యతే ॥ 3

సదా దుఃఖాతురా ఏవ న సుఖీ విద్యతే క్వచిత్ ।
కేనోపాయేన మోక్షేశ! ముచ్యం తే వద మే ప్రభో! ॥ 4

**శ్రీ భగవానువాచ**

శృణు తార్క్ష్య! ప్రవక్ష్యామి యన్మాం త్వం పరిపృచ్ఛసి ।
యస్య శ్రవణమాత్రేణ సంసారాన్ముచ్యతే నరః ॥ 5

అస్తి దేవః పరబ్రహ్మస్వరూపీ నిష్కళశ్శివః ।
సర్వజ్ఞస్సర్వకర్తా చ సర్వేశ నిర్మలో ఽద్వయః ॥ 6

స్వయం జ్యోతి రనాద్యంతో నిర్వికారః పరాత్పరః ।
నిర్గుణస్సచిదానంద స్తదంశాజ్జీవసంజ్ఞకః ॥ 7

అనాద్యవిద్యోపహితాద్యథా ఽగ్నౌ విస్ఫులింగకాః ।
దేహాద్యు పాధిసంభిన్నాస్తే కర్మభిరనాదిభిః ॥ 8

సుఖదుఃఖప్రదైః పుణ్యపాపరూపైర్నియన్త్రితాః ।
తత్తజ్జాతియుతం దేహమాయుర్భోగం చ కర్మజమ్ ॥ 9

ప్రతిజన్మ ప్రపద్యంతే తేషా మపి పరం పునః ।
సుసూక్ష్మలింగశారీర మామోక్షా దక్షరం ఖగ! ॥ 10

స్థావరాః క్రిమయశ్చాబ్జాః పక్షిణః పశవో నరాః ।
ధార్మికాస్త్రిదశా స్తద్వ న్మోక్షిణశ్చ యథాక్రమమ్ ॥ 11

చతుర్విధశరీరాణి ధృత్వా ముక్త్వా సహస్రశః ।
సుకృతా న్మానవో భూత్వా జ్ఞానీ చే న్మోక్ష మాప్నుయాత్ ॥ 12

చతురశీతిలక్షేషు శరీరేషు శరీరిణాం ।
న మానుషం వినా ఽ న్యత్ర తత్త్వజ్ఞానం తు లభ్యతే ॥ 13

అత్ర జన్మసహస్రాణాం సహస్రై రపి కోటిభిః ।
కదాచిల్లభతే జంతు ర్మానుష్యం పుణ్యసంచయాత్ ॥ 14

సోపానభూతం మోక్షస్య మానుష్యం ప్రాప్య దుర్లభం ।
య స్తారయతి నా ఽ త్మానం తస్మా త్పాపతరో ఽ త్రకః ॥ 15

నరః ప్రాప్యోత్తమం జన్మ లబ్ధ్వా చేంద్రియసౌష్టవం ।
న వేత్త్యాత్మహితం యస్తు సభవే దాత్మ ఘాతుకః ॥ 16

వినా దేహేన కస్యాపి పురుషార్థో న విద్యతే ।
తస్మా ద్దేహం ధనం రక్షే త్పుణ్యకర్మాని సాధయేత్ ॥ 17

రక్షయే త్సర్వదా ऽ ऽ త్మాన మాత్మా సర్వస్య భాజనం ।
రక్షణే యత్న మాతిష్ఠే జ్జీవ న్భద్రాణి పశ్యతి ॥ 18

పునర్గ్రామః పునః క్షేత్రం పునర్విత్తం పునర్గృహం ।
పున శ్శుభాశుభం కర్మ న శరీరం పునః పునః ॥ 19

శరీరరక్షణోపాయాః క్రియంతే సర్వదా బుధైః ।
నేచ్ఛంతి చ పునస్త్యాగ మపి కుష్ఠాదిరోగిణః ॥ 20

త ద్గోపితం స్యా ద్ధర్మార్థం ధర్మో జ్ఞానార్థ మేవ చ ।
జ్ఞానం తు ధ్యానయోగార్థ మచిరాత్ప్రవిముచ్యతే ॥ 21

ఆత్మైవ యది నాత్మాన మహితేభ్యో నివారయేత్ ।
కోऽన్యో హితకర స్తస్మా దాత్మానం తారయిష్యతి ॥ 22

ఇహైవ నరకవ్యాధే శ్చికిత్సాం న కరోతి యః ।
గత్వా నిరౌషధం దేశం వ్యాధిస్థః కిం కరిష్యతి ॥ 23

వ్యాఘ్రీ వాऽస్తే జరా చాయు ర్యాతి భిన్నఘటాంబువత్ ।
నిఘ్నంతి రిపువ ద్రోగా స్తస్మా చ్ఛ్రేయ స్సమభ్యసేత్ ॥ 24

యావ న్నాశ్రయతే దుఃఖం యావ న్నాయాంతి చాపదః ।
యావ న్నేంద్రియవైకల్యం తావ చ్ఛ్రేయ స్సమభ్యసేత్ ॥ 25

యావత్తిష్ఠతి దేహోऽయం తావ త్తత్త్వం సమభ్యసేత్ ।
సందీప్తే కోణభవనే కూపం ఖనతి దుర్మతిః ॥ 26

కాలో న జ్ఞాయతే నానాకార్యై స్సంసారసంభవైః ।
సుఖం దుఃఖం జనో హంత న వేత్తి హిత మాత్మనః ॥ 27

జాతా నార్తాన్మృతా నాపద్గ్రస్తా న్దృష్ట్వా చ దుఃఖితాన్ ।
లోకో మోహసురాం పీత్వా న బిభేతి కదాచన ॥ 28

సంపద స్స్వప్నసంకాశా యౌవనం కుసుమోపమం ।
తటిచ్చపల మాయుష్యం కస్య స్యా జ్ఞానతో ధృతిః ॥ 29

శతం జీవిత మత్యల్పం నిద్రాలస్యై స్తదర్ధకం ।
బాల్యరోగజరాదుఃఖై రల్పం తదపి నిష్ఫలమ్ ॥ 30

ప్రారబ్ధవ్యే నిరుద్యోగో జాగర్తవ్యే ప్రసుప్తకః ।
విశ్రస్తవ్యో భయస్థానే హా నరః కో న హన్యతే ॥ 31

తోయఫేనసమే దేహే జీవేనా ఽక్రమ్య సంస్థితే ।
అనిత్యే ప్రియసంవాసే కథం తిష్ఠతి నిర్భయః ॥ 32

అహితే హితసంజ్ఞ స్స్యా దధ్రువే ధ్రువసంజ్ఞకః ।
అనర్థే చార్థవిజ్ఞానః స్వ మర్థం యో న వేత్తి సః ॥ 33

పశ్య న్నపి ప్రస్ఖలతి శృణ్వ న్నపి న బుధ్యతి ।
పఠన్నపి న జానాతి దేవమాయా విమోహితః ॥ 34

త న్నిమజ్జ జ్జగదిదం గంభీరే కాలసాగరే ।
మృత్యురోగజరాగ్రాహై ర్న కశ్చి దపి బుధ్యతే ॥ 35

ప్రతిక్షణ మయం కాలః క్షీయమాణో న లక్ష్యతే ।
ఆమకుంభ ఇవాంభస్థో ఽథ విశీర్ణో న విభావ్యతే ॥ 36

యుజ్యతే వేష్టనం వాయో రాకాశస్య చ ఖండనం ।
గ్రథనం చ తరంగాణా మాస్థా నాయుషి యుజ్యతే ॥ 37

పృథివీ దహ్యతే యేన మేరుశ్చాపి విశీర్యతే ।
శుష్యతే సాగరజలం శరీరస్య చ కా కథా ॥ 38

అపత్యం మే కళత్రం మే ధనం మే బాంధవా శ్చ మే ।
జల్పంతమితి మర్త్యాజం హంతి కాలవృకో బలాత్ ॥ 39

ఇదం కృత మిదం కార్య మిద మన్య త్కృతాకృతం ।
ఏవ మీహాసమాయుక్తం కృతాంతః కురుతే వశమ్ ॥ 40

శ్వః కార్య మద్య కుర్వీత పూర్వాహ్ణే చాపరాహ్ణికం ।
న హి మృత్యుః ప్రతీక్షేత కృతం వా పృథవాఽకృతమ్ ॥ 41

జరాదర్శితపంథానం ప్రచండవ్యాధిసైనికం ।
మృత్యుశత్రు మధిష్ఠోఽసి త్రాతారం కిం న పశ్యపి ॥ 42

తృష్ణాసూచీ వినిర్భిన్నం సిక్తం విషయసర్పిషా ।
రాగద్వేషానలే పక్వం మృత్యు రశ్నాతి మానవమ్ ॥ 43

బాలాంశ్చ యౌవనస్థాంశ్చ వృద్ధా న్గర్భగతా నపి ।
సర్వానావిశతే మృత్యు రేవం భూత మిదం జగత్ ॥ 44

స్వదేహ మపి జీవో ఽయం ముక్త్వా యాతి యమాలయం ।
స్త్రీమాతృపితృపుత్రాది సంబంధః కేన హేతునా ॥ 45

దుఃఖమూలం హి సంసార స్స యస్యాస్తి స దుఃఖితః ।
తస్య త్యాగః కృతో యేన స సుఖీ నాపరః క్వచిత్ ॥ 46

ప్రభవం సర్వదుఃఖానా మాలయం సకలాపదాం ।
ఆశ్రయం సర్వపాపానాం సంసారం వర్జయేత్క్షణాత్ ॥ 47

లోహదారుమయైః పాశైః పుమాన్బద్ధో విముచ్యతే ।
పుత్రదారమయైః పాశైర్ముచ్యతే న కదాచన ॥ 48

యావతః కురుతే జంతు స్సంబంధా న్మనసః ప్రియాన్ ।
తావంతో ఽస్య నిఖన్యంతే హృదయే శోకశంకవః ॥ 49

వంచితాశేషవిత్తై స్తై ర్నిత్యం లోకో వినాశితః ।
హా హంత విషయాహారై ర్దేహస్థేంద్రియతస్కరైః ॥ 50

మాంసలుబ్ధో యథా మత్స్యో లోహశంకుం న పశ్యతి ।
సుఖలుబ్ధస్తథా దేహీ యమబాధాం న పశ్యతి ॥ 51

హితాహితం నజానంతో నిత్యాము న్మార్గగామినః ।
కుక్షిపూరణనిష్ఠా యే తే నరా నారకాః ఖగ! ॥ 52

నిద్రాదిమైథునాహారా స్సర్వేషాం ప్రాణినాం సమాః ।
జ్ఞానవాన్మానవః ప్రోక్తో జ్ఞానహీనః పశుః స్మృతః ॥ 53

ప్రభాతే మలమూత్రాభ్యాం క్షుత్తృ డ్భ్యాం మధ్యగే రవౌ ।
రాత్రౌ మదననిద్రాభ్యాం బాధ్యంతే మూఢమానవాః ॥ 54

స్వదేహధనదారాది నిరతా స్సర్వజంతవః ।
జాయంతే చ మ్రియంతే చ హా హంతాజ్ఞానమోహితాః ॥ 55

తస్మాత్సంగ స్సదా త్యాజ్య స్సర్వ స్త్యక్తుం న శక్యతే ।
మహద్భి స్సహ కర్తవ్య స్సంగ స్సంగస్య భేషజమ్ ॥ 56

సత్సంగ శ్చ వివేక శ్చ నిర్మలం నయనద్వయం ।
యస్య నాస్తి నర స్సోంధః కథం న స్యా దమార్గగః ॥ 57

స్వస్వవర్ణాశ్రమాచారనిరతా స్సర్వమానవాః ।
న జానంతి పరం ధర్మం వృథా నశ్యంతి దాంభికాః ॥ 58

క్రియాయాసపరాః కేచి ద్వ్రతచర్యాది సంయుతాః ।
అజ్ఞానసంవృతాత్మాన స్సంచరంతి ప్రతారకాః ॥ 59

నామమాత్రేణ సంతుష్టాః కర్మ కాండరతా నరాః ।
మంత్రోచ్చారణహోమాద్యై ర్భ్రామితాః క్రతువిస్తరైః ॥ 60

భుక్తోపవాసాద్యై ర్నియమైః కాయశోషణైః ।
మూఢాః పరోక్ష మిచ్ఛంతి మమ మాయావిమోహితాః ॥ 61

దేహదండనమాత్రేణ కా ముక్తి రవివేకినాం ।
వల్మీకతాడనాదేవ మృతః కుత్ర మహోరగః ॥ 62

జటాభారాజినై ర్యుక్తా దాంభికా వేషధారిణః ।
భ్రమంతి జ్ఞానివ ల్లోకే భ్రామయంతి జనా నపి ॥ 63

సంసారజసుఖాసక్తం బ్రహ్మజ్ఞోఽస్మీతివాదినం ।
కర్మ బ్రహ్మోభయభ్రష్టం తంత్యజే దంత్యజం యథా ॥ 64

గృహారణ్యసమా లోకే గతవ్రీడా దిగంబరాః ।
చరంతి గర్దభాద్యాశ్చ విరక్తా స్తే భవంతి కిమ్? ॥ 65

మృద్భస్మోద్ధూళనా దేవ ముక్తా స్స్యుర్యది మానవాః ।
మృద్భస్మవాసీ నిత్యం శ్వాసకిం ముక్తో భవిష్యతి ॥ 66

తృణపర్ణోదకాహారా స్సతతం పనవాసినః ।
జంబుకాఽఖుమృగాద్యాశ్చ తాపసా స్తే భవంతి కిమ్ ॥ 67

ఆజన్మ మరణాంతం చ గంగాదితటి నీస్థితాః ।
మండూకమత్స్యప్రముఖాః యోగిన స్తే భవన్తి కిమ్ ॥ 68

పారావతా శ్శిలాహారాః కదాచి దపి చాతకాః ।
నపిబంతి మహీతోయం వ్రతిన స్తే భవంతికిమ్ ॥ 69

తస్మా దిత్యాదికం కర్మ లోకరంజనకారకం ।
మోక్షస్య కారణం సాక్షాత్తత్త్వజ్ఞానం ఖగేశ్వర! ॥ 70

షడ్దర్శనమహాకూపే పతితాః పశవః ఖగ! ।
పరమార్థం న జానంతి పశుపాశనియంత్రితాః ॥ 71

వేదశాస్త్రార్ణవే ఘోరే ఉహ్యమానా ఇతస్తతః ।
షడూర్మినిగ్రహగ్రస్తా స్తిష్ఠంతి హి కుతార్కికాః ॥ 72

వేదాగమపురాణజ్ఞః పరమార్థం న వేత్తియః ।
విడంబకస్య తస్యైవ తత్సర్వం కాకభాషితమ్ ॥ 73

ఇదం జ్ఞాన మిదంజ్ఞేయ మితి చింతాసమాకులాః ।
పఠంత్యహర్నిశం శాస్త్రం పరతత్త్వ పరాఙ్ముఖాః ॥ 74

వాక్యఛందోనిబంధేన కావ్యాలంకారశోభితాః ।
చింతయా దుఃఖితా మూఢా స్తిష్ఠంతి వ్యాకులేంద్రియాః ॥ 75

అన్యథా పరమం తత్త్వం జనాః క్లిశ్యంతి చాన్యథా ।
అన్యథా శాస్త్రసద్భావో వ్యాఖ్యాం కుర్వంతి చాన్యథా ॥ 76

కథయం త్యున్మనీభావం స్వయం నానుభవంతి చ ।
అహంకారరతాః కేచి దుపదేశాదివర్జితాః ॥ 77

పఠంతి వేదశాస్త్రాణి బోధయంతి పరస్పరం ।
న జానంతి పరం తత్త్వం దర్వీ పాకరసం యథా ॥ 78

శిరో వహతి పుష్పాణి గన్ధం జానాతి నాసికా ।
పఠంతి వేదశాస్త్రాణి దుర్లభో భావబోధకః ॥ 79

తత్త్వ మాత్మస్థ మజ్ఞాత్వా మూఢ శ్శాస్త్రేషు ముహ్యతి ।
గోపః కుక్షిగతే ఛాగే కూపే పశ్యతి దుర్మతిః ॥ 80

సంసారమోహనాశాయ శబ్దబోధో న హి క్షమః ।
న నివర్తేత తిమిరం కదాచి ద్దీపవార్తయా ॥ 81

ప్రజ్ఞాహీనస్య పఠనం యథాఽంధస్య చ దర్పణం ।
అతః ప్రజ్ఞావతాం శాస్త్రం తత్త్వజ్ఞానస్యలక్షణమ్ ॥ 82

ఇదం జ్ఞాన మిదం జ్ఞేయం సర్వం తచ్ఛ్రోతు మిచ్ఛతి ।
దివ్య వర్షసహస్రాయు శ్శాస్త్రాంతం నైవ గచ్ఛతి ॥ 83

అనేకాని చ శాస్త్రాణి స్వల్పాయుర్విఘ్న కోటయః ।
తస్మా త్సారం విజానీయాత్క్షీరం హంస ఇవాంభసి ॥ 84

అభ్యస్య వేదశాస్త్రాణి తత్త్వం జ్ఞాత్వాఽథ బుద్ధిమాన్ ।
పలాలమివ ధాన్యార్థీ సర్వశాస్త్రాణి సంత్యజేత్ ॥ 85

యథామృతేన తృప్తస్య నా ఽహారేణ ప్రయోజనం ।
తత్త్వజ్ఞస్య తథా తార్క్ష్య! న శాస్త్రేణ ప్రయోజనమ్ ॥ 86

న వేదాధ్యయన న్ముక్తి ర్న శాస్త్రపఠనా దపి ।
జ్ఞానాదేవ హి కైవల్యం నాన్యథా వినతాత్మజ ॥ 87

నా(శ్రమః కారణం ముక్తేర్దర్శనాని నకారణమ్ ।
తథైవ సర్వకర్మాణి జ్ఞాన మేవ హి కారణమ్॥ 88

ముక్తిదా గురువా గేకా విద్యా సర్వా విడంకా ।
కాష్ఠభారసహ(స్రేషు హ్యేకం సంజీవనం పరమ్ ॥ 89

అద్వైతం హి శివం (ప్రోక్తం (క్రియాయాస వివర్జితం ।
గురువక్త్రేణ లభ్యేత నాధీతాగమకోటిభిః ॥ 90

ఆగమోక్తం వివేకోత్థం ద్విధా జ్ఞానం (ప్రచక్షతే ।
శబ్దబ్రహ్మాగమమయం పరబ్రహ్మవివేకజమ్ ॥ 91

అద్వైతం కేచి దిచ్ఛంతి ద్వైత మిచ్ఛంతి చాపరే ।
సమతత్త్వం నజానంతి ద్వైతాద్వైత వివర్జితమ్ ॥ 92

ద్వేపదే బంధమోక్షాయ మమేతి న మమేతి చ ।
మమేతి బధ్యతే జంతు ర్న మమేతి (ప్రముచ్యతే ॥ 93

తత్కర్మ యన్న బంధాయ సా విద్యా యా విముక్తిదా ।
ఆయాసాయపరం కర్మ విద్యా ఽ న్యా శిల్పనైపుణమ్ ॥ 94

యావత్కర్మాణి దీప్యంతే యావ త్సంసారవాసనా ।
యావ దింద్రియచాపల్యం తావత్తత్త్వకథా కుతః ॥ 95

యావ ద్దేహాభిమానశ్చ మమతా యావ దేవ హి ।
యావ (త్ప్రయత్న వేగోస్తి యావత్సంకల్పకల్పనా ॥ 96

యావ న్నో మనస స్థైర్యం న యావ చ్ఛాస్త్రచింతనం ।
యావ న్న గురుకారుణ్యం తావ త్తత్త్వకథా కుతః ॥ 97

తావత్తపో (వ్రతం తీర్థం జప హోమార్చనాదికం ।
వేదశా(స్త్రాగమకథా యావ త్తత్త్వం నవిందతి ॥ 98

తస్మా త్సర్వ (ప్రయత్నేన సర్వావస్థాసు సర్వదా ।
తత్త్వనిష్ఠో భవే త్తార్క్ష్య! య దీచ్ఛే న్మోక్షమాత్మనః ॥ 99

ధర్మజ్ఞాన ప్రసూనస్య స్వర్గమోక్ష ఫలస్య చ ।
తస్మా జ్ఞానే నాత్మతత్త్వం విజ్ఞేయం శ్రీగురోర్ముఖాత్ ॥ 100

తత్త్వజ్ఞస్యాంతిమం కృత్యం శృణు వక్ష్యామి తే ఽధునా ।
యేన మోక్ష మవాప్నోతి బ్రహ్మ నిర్వానసంజ్ఞకమ్ ॥ 101

అంతకాలే తు పురుషో హ్యాగతే గత సాధ్వసః ।
ఛింద్యా దసంగశస్త్రేణ స్పృహాం దేహే ఽను యే చ తమ్ ॥ 102

గృహా త్ప్రవ్రజితో ధీరః పుణ్యతీర్థ జలప్లుతః ।
శుచౌ వివిక్త ఆసీనో విధివ త్కల్పితాసనే ॥ 103

అభ్యసే న్మనసాశుద్ధం త్రివృ ద్బ్రహ్మాక్షరం పరం ।
మనో యచ్ఛే జ్జితశ్వాసో బ్రహ్మబీజ మవిస్మరన్ ॥ 104

నియచ్ఛే ద్విషయే భ్యోక్షా న్మనసా బుద్ధి సారథిః ।
మనః కర్మభి రాక్షిప్తం శుభార్థే ధారయే ద్ధియా ॥ 105

అహం బ్రహ్మ పరం ధామబ్రహ్మాహం పరమం పదం ।
ఏవం సమీక్ష్య చాత్మానమాత్మ న్యాధాయ నిష్కళే ॥ 106

ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహర న్మా మనుస్మరన్ ।
యః ప్రయాతి త్యజ న్దేహం స యాతి పరమాం గతిమ్ ॥ 107

న యత్ర దాంభికా యాంతి జ్ఞానవైరాగ్యవర్జితాః ।
సుధియ స్తాం గతిం యాంతి తా నహం కథయామితే ॥ 108

నిర్మానమోహా జితసంగదోషా
అధ్యాత్మనిత్యావినివృత్తకామాః ।
ద్వంద్వైర్విముక్తా స్సుఖదుఃఖ సంజ్ఞై
ర్గచ్ఛంత్యమూఢాః పదమవ్యయం తత్ ॥ 109

జ్ఞానహ్రదే సత్యజలే రాగద్వేషమలాపహే ।
య స్స్నాతి మానసే తీర్థే స వై మోక్ష మవాప్నుయాత్ ॥ 110

ప్రౌఢం వైరాగ్య మాస్థాయ భజతే మా మనన్యభాక్ ।
పూర్ణదృష్టిః ప్రసన్నాత్మా సవై మోక్ష మవాప్నుయాత్ ॥ 111

త్యక్త్వా గృహం చ య స్తీర్థే నివసస్మరణోత్సుకః ।
మ్రియతే ముక్తి క్షేత్రేషు సవై మోక్ష మవాప్నుయాత్ ॥ 112

అయోధ్యా మధురా మాయా కాశీ కాంచీ హ్యవంతికా ।
పురీ ద్వారవతీ జ్ఞేయా స్సప్తై తా మోక్షదాయకాః ॥ 113

ఇతి తే కథితం తార్క్ష్య! మోక్షధర్మం సనాతనం ।
జ్ఞానవైరాగ్యసహితం శ్రుత్వా మోక్ష మవాప్నుయాత్ ॥ 114

మోక్షం గచ్ఛంతి తత్త్వజ్ఞాః ధార్మికా స్స్వర్వగతిం నరాః ।
పాపినో దుర్గతం యాంతి సంసరంతి ఖగాదయః ॥ 115

ఇత్యేవ సర్వశాస్త్రాణాం సారోద్ధారో నిరూపితః ।
మయా తే షోడశాధ్యాయైః కిం భూయః శ్రోతు మిచ్ఛసి ॥ 116

సూత ఉవాచ

ఏవం శ్రుత్వా వచో రాజన్ గరుడో భగవన్ముఖాత్ ।
కృతాంజలి రువా చేదం తం ప్రణమ్య ముహుర్ముహుః ॥ 117

భగవ! న్దేవ! దేవేశ! శ్రావయిత్వా వచోఽమృతం ।
తారితో ఽహం త్వయా నాథ! భవసాగరతః ప్రభో! ॥ 118

స్థితోఽస్మి గత సందేహః కృతార్థో ఽస్మిన సంశయః ।
ఇత్యుక్త్వా గరుడ స్తూష్ణీం స్థిత్వా ధ్యానపరో ఽభవత్ ॥ 119

## దశదాన మంత్ర శ్లోకాలు

దేశకాలౌ సంకీర్త్య మమ పితః పాపక్షయర్థం
దశదానాని కరిష్యేనమః । ఇతి సంకల్ప్య ॥
ప్రత్యేకం బ్రాహ్మణమభ్యర్చ్య ॥

## గోదానం

శ్లో॥ గవామంగేషు తిష్ఠంతి భువనాని చతుర్ధశ ।
యస్మా త్తస్మాచ్ఛివం మేస్యా దశశ్శాంతిం ప్రయచ్ఛమే॥

## భూదానం

శ్లో॥ సర్వసస్యాశ్రయాభూమిర్వరాహేణ సముద్ధృతా ।
అనంత పుణ్యఫలదా అతశ్శాంతిం ప్రయచ్ఛమే ॥

## తిలదానం

శ్లో॥ తిలాఃపాపహరానిత్యం విష్ణో చేహ సముద్భవాః ।
పాపంహరంతు మే క్షిప్ర మతశ్శాంతిం ప్రయచ్ఛమే ॥

## హిరణ్యదానం

శ్లో॥ హిరణ్యగర్భస్థం హేమబీజం విభావసోః ।
అనంతపుణ్యఫలద మతశ్శాంతిం ప్రయచ్ఛమే ॥

## ఆజ్యదానం

శ్లో॥ కామధేనో స్సముద్భూతం సర్వక్రతుషు సంస్థింత ।
దేవానామాజ్యమాహార మతశ్శాంతిం ప్రయచ్ఛమే ॥

## వస్త్రదానం

శ్లో॥ శీతవాతోష్ణ సంత్రాణం లజ్జాయా లక్షణం పరం ।
దేహాలంకరణం వస్త్ర మతశ్శాంతిం ప్రయచ్ఛమే ॥

## ధాన్యదానం

శ్లో॥ ధాన్యం కరోషిదాతార మిహలోకే పరత్రచ ।
యస్మా త్తస్మాచ్ఛివం మేస్యా దతశ్శాంతిం ప్రయచ్ఛమే ॥

## రజితదానం

శ్లో॥ ఇక్షుకాండ సముద్భూతో గుడో మధువిరాజితః ।
యస్మాత్త స్మాచ్ఛివం మేస్యాదతశ్శాంతిం ప్రయచ్ఛమే గుడందద్యాల్॥

## గుడదానం

శ్లో॥ పితృప్రీతికరం త్వంహి రౌప్యం చంద్రసముద్భృతే ।
త్వద్దానాదిహచాముత్ర శ్రేయస్యాద్రజితం మమ ॥

## లవణదానం

శ్లో॥ రసానామగ్రజం శ్రేష్ఠం లవణం బలివర్ధనం ।
యస్మాత్తస్మోచ్ఛినం మేస్యా దతశ్శాంతిం ప్రయచ్ఛమే ॥
ఇతి దశదానాని బ్రాహ్మణేభ్యో దద్యాత్ ॥

## విశేష దాన మంత్రాలు

**హిరణ్యదానం** : హిరణ్యగర్భగర్భస్థం హేమబీజం విభావసోః ।
అనంతపుణ్య ఫలదమతశ్శాంతింప్రయచ్ఛమే ॥

**తిలపాత్రదానం** : తిలాః పాపహరాం నిత్యం విష్ణోర్దేహసముద్భవాః ।
తిలపాత్రప్రదానేన ప్రియతాం కమలాపతిః ॥

**ఛత్రదానం** : ఇహాముత్రాతిపాత్రాణాం కురుకేశవమేప్రభో ।
ఛత్రంత్వత్ప్రీతయేదత్తం విష్ణుప్రీతికరం శుభమ్ ॥

**పాదుకదానం** : కంటకోచ్ఛిష్ఠ పాషాణ వృశ్చికాది నివారణే ।
పాదుకే సంప్రయచ్ఛామి గృహాణత్వంద్విజోత్తమ ॥

**కటదానం** : కటందాస్యామి విప్రేంద్ర గృహాణత్వం సుఖప్రదం ।
అనేక కటదానేన ప్రియంతా పితరస్సదా ॥

**చందనఖండదానం** : మలయావాస మందార సుఖబృందార ।
కార్చిత చందనత్వత్ప్రవాదాన్మే సాంద్రానందం ప్రవర్ధయ ॥

**దీపదానం** : దీపందాస్యామి విప్రేంద్ర తుభ్యంధ్వాంత నివాకరం ।
అస్యప్రదానా త్సకలా ఉదోషాః నాశయ కేశవ ॥

**ఘంటాదానం** : దేవానామిష్టదా ఘంటా సర్వచైత్య నివాసినీ ।
తస్మాద్దాస్యామి తే ఘంటాం తదానేన సుఖంకురు ॥

**చామరదానం** : శశాంక కర సంకాశ హిమడిండీరపాండుర।
ప్రోత్సారయాశుదురితం చామరా నురవల్లభ ॥

**శయ్యాదానం** : యథానకృష్ణశమనం శూన్యం సాగరజాతయా ।
శయ్యామమాప్య శూన్యాస్తు తథాజన్మని జన్మని ॥

**<u>సప్తధాన్యదానం</u>** : తృప్తింకరోతి భూతాని ఇహలోకే వరత్రచ ।
తస్మాత్ప్రదీయతేధాన్య మత్రశ్శాంతింప్రయచ్ఛమే ॥

**<u>సువర్ణదానం</u>** : సర్వపాప క్షయకరం సువర్ణలోకభూషణం ।
అగ్నేర్బీజంప్రదాస్యామి తస్మాచ్ఛాంతిం ప్రయచ్ఛమే ॥

**<u>తండులదానం</u>** : జీవనంసర్వభూతానాం బలపుష్టి వివర్ధనం ।
తండులందీయ తేయస్మా దతశ్శాంతిం ప్రయచ్ఛమే ॥

**<u>సరస్వతీదానం</u>** : సరస్వతీ జ్ఞానధాత్రీ విద్యానా మధిదేవతా ।
విద్యాసాధికకోశస్య దానాన్ముక్తింసమాప్నుయాత్ ॥

**<u>వేణుదానం</u>** : వేణుదండశ్శుభకరో దశావస్థా సురక్షకః ।
వేణు దండస్యదానేన తృప్తిర్దండధరస్యవై ॥

**<u>యజ్ఞోపవీతదానం</u>** : యజ్ఞోపవీతం పరమం పవిత్రం కర్మసాధకం ।
యజ్ఞోపవీతదానేన తుష్టాస్సర్వామరాస్సదా ॥

## గరుడ పురాణ ఫలశ్రుతి

**భగవానువాచ**

ఇత్యాఖ్యాతం మయా తార్క్ష్య! సర్వమే వౌర్ధ్వ దైహికం ।
దశాహాభ్యంతరే కృత్వా సర్వపాపైః ప్రముచ్యతే ॥ 1

ఇదం చాముష్మికం కర్మ పితృముక్తి ప్రదాయకం ।
పుత్రవాంఛితదం చైవ పరత్రేహ సుఖప్రదమ్ ॥ 2

ఇదం కర్మన కుర్వంతి యే నాస్తికనరాధమాః ।
తేషాం జల మపేయం స్యా త్సు రాతుల్యం న సంశయః ॥ 3

దేవతాః పితర శ్చైవనైవ పశ్యంతి తద్గృహం ।
భవంతి తేషాం కోపేన పుత్రాః పౌత్రా శ్చ దుర్గతాః ॥ 4

బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యా శ్శూద్రాశ్చైవేతరేఽపి చ ।
తే చాండాలసమా జ్ఞేయా స్సర్వే ప్రేతక్రియాం వినా ॥ 5

ప్రేతకల్ప మిదం పుణ్యం శృణోతి శ్రావయే చ్చ యః ।
ఉభౌ తౌ పాపనిర్ముక్తౌ దుర్గతిం నైవ గచ్ఛతః ॥ 6

మాతాపిత్రోశ్చ మరణే సౌపర్ణం శృణుతే తు యః ।
పితరౌ ముక్తి మాపన్నౌ సుత స్సంతతిమా న్భవేత్ ॥ 7

న శ్రుతం గారుడం యేన గయాశ్రాద్ధం చ నో కృతం ।
వృషోత్సర్గః కృతో నైవ నవమాసికవార్షికే ॥ 8

స కథం కథ్యతే పుత్రః కథం ముచ్చే దృణత్రయాత్ ।
మాతరం పితరం చైవ కథం తారయితం క్షమః ॥ 9

తస్మాత్సర్వప్రయత్నేన శ్రోతవ్యం గారుడం కిల ।
ధర్మార్థ కామమోక్షాణాం దాయకం దుఃఖనాశనమ్ ॥ 10

పురాణం గారుడం పుణ్యం పవిత్రం పాపనాశనం ।
శృణ్వతాం కామనాపూరం శ్రోతవ్యం సర్వదైవహి ॥ 11

బ్రాహ్మణో లభతే విద్యాం క్షత్రియః పృథివీం లభేత్ ।
వైశ్యో ధనికతా మేతి శూద్ర శ్శుధ్యతి పాతకాత్ ॥ 12

శ్రుత్వా దానాని దేయాని వాచకాయాఖిలాని చ ।
పూర్వోక్తశయనాదీని నాన్యథా సఫలం లభేత్ ॥ 13

పురాణం పూజయే త్పూర్వం వాచకం తదనంతరం ।
వస్త్రాలంకారగోదానై ర్దక్షిణాభి శ్చ సాదరమ్ ॥ 14

అన్నాశ్వహేమదానై శ్చ భూమిదానైశ్చ భూరిభిః ।
పూజయే ద్వాచకం భక్త్యా బహుపుణ్యఫలాప్తయే ॥ 15

వాచక స్యార్చనే నైవ పూజితోఽహం న సంశయః ।
సంతుష్టే తుష్టతాం యామి వాచకే నాత్ర సంశయః ॥ 16

భగవంతుడైన నారాయణుడు స్వయంగా ప్రబోధించిన దివ్యపురాణం ఇది. ఇందులో శ్రీహరి చెప్పిన విధంగా ఉత్తర క్రియల్ని మరణించిన వ్యక్తికి పదిరోజుల్లోగా చేస్తే ఆ జీవుడు పాపాలన్నీ నశింప చేసుకుంటాడు.

ప్రేత కృత్యావిధానాన్ని చేసే బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులందరూ చండాలురతో సమానులవుతారు. అలాంటివారు తిరిగి పవిత్రత పొందాలంటే ఈ గరుడ పురాణాన్ని చదవాలి లేక శ్రవణం చేయాలి.

★ తల్లితండ్రులు మరణించినప్పుడు గరుడ పురాణాన్ని కుమారుడు శ్రద్ధగా వింటే మరణించిన వారు ముక్తి పొందుతారు.

★ ధర్మార్ధకామ మోక్షాల్ని ప్రసాదించేది, దుఖాన్ని నివారించేది అయిన ఈ గరుడ పురాణాన్ని ప్రయత్నంచేసి మరీ వినాలి.

★ గరుడ పురాణాన్ని బ్రాహ్మణుడు వింటే విద్యావంతుడు, క్షత్రియుడు వింటే భూలాభం, వైశ్యుడు వింటే ధనలాభాన్ని పొందుతాడు. శూద్రుడు వింటే పాపాల్ని పోగొట్టుకుంటాడు.

గరుడ పురాణాన్ని చెప్పిన వారికి తగిన సత్కారం చేయాలి. సమస్త వస్తువుల్ని శక్తికొద్దీ దానం చేయాలి. అలాచేయక పోతే ఫలితం ఉండదు. గరుత్మంతా! పురాణాన్ని చెప్పే పౌరాణికుణ్ణి పూజిస్తే నన్ను పూజించినట్టే అవుతుంది. పురాణం చెప్పినవాడు సంతోషిస్తే నేను సంతోషించినట్టే. ఇందులో ఏమాత్రం సందేహపడక్కర్లేదు.

**స్వస్తి**

**సర్వేజనాః సుఖినోభవన్తు**



